రామచంద్రవేంకటకృష్ణారావు, కొచ్చెర్లకోట

# అపవాదతరంగిణి

కాకినాడ, 1911

Record no. 534

## Bibliographic Record Target

రామచంద్రవేంకటకృష్ణారావు, కొచ్చర్లకోట.
అపవాదతరంగిణి / ఇది కొచ్చర్లకోట రామచంద్రవేంకటకృష్ణారావుచే రచియింపఁబడినది.- 2. కూర్పు.- కాకినాడ : సరస్వతీ ముద్రాక్షరశాల, 1911.
2, 135 p. ;19 cm.
Record no. 534

Rāmacandravēṅkaṭakṛṣṇārāvu, Koccarlakōṭa.
Apavādataraṅgiṇi / idi Koccarlakōṭa Rāmacandravēṅkaṭakṛṣṇārāvucē raciyimpam̐baḍinadi.- 2. kūrpu.- Kākināḍa : Sarasvatī Mudrākṣaraśāla, 1911.
2, 135 p. ;19 cm.
Record no. 534

1912 సం॥ రం స్కూలు ఫైనల్ పరీక్షకు పఠనీయపుస్తకము.

# అపవాదతరంగిణి.

ఇది

షెరిడనుయొక్క "స్కూల్ ఫర్ స్కాండలు" అను నింగ్లీషునాటకము

ననుసరించి


పోలవరం జమీందార్

శ్రీ కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావు బి. ఏ.


చే రచియింపఁబడినది.


రెండవకూర్పు 2000.

వెల 6 అణాలు.






కాకినాడ.

శ్రీసరస్వతీముద్రాక్షరశాలయందు బాకీ చినసూర్యారావుచే

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

1911.

## PREFACE TO THE SECOND EDITION.

After a lapse of ten years since the publication of the first edition of this prose-drama, a second edition of it has been fortunately destined to be published. I never hoped or expected that this prose-drama will ever be prescribed as a text-book for any University Examination nor atleast for any of the lower forms in schools. Having received little or no encouragement from the Telugu-reading-public and having found it an impossible task to find sale or atleast persons desirous or willing to read even when gratuitous presentations, of copies of this book were made, during these ten years, I became hopeless of any second edition of it ever becoming necessary or possible. But by the fact of this drama being prescribed now as a text-book for the School Final course, I venture to place before the public a second edition of it.

This drama is a free rendering of "Sheridan's School for Scandal" into Telugu. There are in English many prose-dramas, some written purposely to suit the stage and others more with the object of bringing social evils and pernicious customs of society in a graphical form before the view of the public and thereby impressively demonstrating the dangers resulting to the individual members of the

society and the society itself. Judging this prose drama of Sheridan, it must be said that it is purely a "Socio-Comedy" written by the author to illustrate the dangers that persons indulging in scandals are sure to fall into and bring upon others. Such social dramas are very useful and serve very good purposes indeed, either for presentation on the stage or for reading as a pastime. In Bengali, there are several social dramas written in prose by modern writers which are being largely read and enacted on the stage. But unfortunately in Telugu even the few translations of the English prose-dramas, that have been published, are not cared after by the reading public and no attempt of their presentation on the stage has ever been till now made. I attempted the rendering of the "School for Scandal" into Telugu, with the sincere belief that this book will be of great use and service to our Telugu society wherein there are a large number of persons, and more especially, among the women who are fond of indulging in the mischievous pleasures and pastime of speaking and spreading scandals against others chiefly without no object or purpose in view. The mischievous pleasure of indulging in scandalizing persons and individuals is found in every society to a greater or less degree and I hope. I will not be considered as having been unduly blaming our society alone in this respect and rediculing it un-



charitably. I therefore beg leave of my readers to say that my object of presenting this prose-drama to the public is exactly the same as that with which it was written by Sheridan himself in English.

I sincerely hope that the Telugu public will be indulgent in their judgment of the merits of this book and forgive me for all the short-comings that may be found either in grammar or diction employed by me therein.

K. R. V. KRISHN RAU.



# పీఠిక.

షెరిడన్ కవివరుఁ డాంగ్లేయభాషయందు రచియించిన "స్కూల్
ఫర్ స్కాండల" (School for Scandal) ను నాటకము ననుసరించి నేనీ
నాటకమును వ్రాసినాఁడను. ఈతఁడు వ్రాసిననాటకములలో రెండునాటక
ముల ననుసరించి మ॥రా॥రా॥ రావుబహద్దర్ కందుకూరి వీరేశలింగముపంతుల
వా రింతకు మునుపే రాగమంజరియుఁ, గళ్యాణకల్పవల్లియు రచియించిరి. నీ
తిబోధకమును, హాస్యరసప్రధానమును నగు నీనాటకమును సులభమగు రీతిని వ
చనరూపముగా వ్రాసి నేనిప్పుడు ప్రచురించుచున్నాఁడను.

ఇందు మనహిందూసంఘమునకుఁ దగియుండునట్లు కొన్నిమార్పులను
జేసితిని. ఇచ్చవచ్చినరీతి నపవాద లారోపించుటవలన నితరులకు గలుగు నష్టము
లను బోధపఱచి యపవాదలాడుట నుచితమని దెలుపుటకీనాటకము ప్రథమ
మున నాంగ్లేయభాషయందు వ్రాయఁబడినది. ఈనాటకముఁ బాత్రానుసరణ
ముగా లోకవ్యవహారసిద్ధమగు సామాన్యభాషనే వ్రాసితినిగాని లక్షణయుక్త
మగురీతిని వ్రాయలేదు. ఆంగ్లేయనాటకమున దామోదరవర్మ దనవార్ధకమువ
రకు వివాహము నేయాడకుండి తరువాతఁ జిరకాలమునకుఁ బెండ్లి చేసికొనెనని
వ్రాయఁబడియున్న యంశము మనయాచారములకు విరుద్ధమని యాతఁడు ప్రథ
మమున వివాహమాడి తనభార్య మృతినొందినతరువాతఁ జాలకాలము వివాహ
మాడకఁ దిరిగి వార్ధకమునఁ బెండ్లి చేసికొనెనని మార్పవలసివచ్చినది. ఈవిధమున
నే యనేకాంశములను మార్పసాహసించితిని. జనాపవాదాలాపములవలన నిత
రుల కమితముగా హానిగలుగుచుండునను నంశమును బోధించుచు హాస్యరస ప్ర
ధానమైన యీనాటకము నాచదువరులకు నీతిబోధకముగా నుండకపోదని న
మ్ముచున్నాఁడను.

నేనీ నాటకమును వ్రాసి మొదట నాసరస్వతీ పత్రికయందుఁ బ్రకటిం
చి యిప్పుడు పుస్తకరూపమునఁ బ్రచురించుచున్నాఁడను. మఱియు నీ నా
టకము స్వలాభమును గోరి యితరులకు హానిఁజేయునీచులు గామపాలునివలెఁ

దేమకపటవృత్తి ప్రకటీకృతమై గడుదుర్దశకు వత్తురనియు, నంతశ్శుద్ధిగలిగి పరోపకారపరాయణులై సాధువృత్తిఁ జరించువారు వసుకామునివలె సుస్థితికి వత్తురనియు బోధించుచున్నను జనాపవాదదూషణ మాచరించుట కూడదను టకే యిది వ్రాయఁబడినది. ఇందుఁ జదువరులు దోషలేశములను బాటింపక నాయీప్రథమప్రయత్నము నాదరించి నాకుఁ బ్రోత్సాహము గలుగజేతురని నమ్ముచున్నాడను.

కాకినాడ<br>
ది 1 జూన్ 1900.

విధేయుఁడు<br>
కొ. రా. వెం. కృష్ణారావు.



## ఈనాటకమున వచ్చుపాత్రలు.

పురుషులు :—

విజయవర్మ.<br>
దామోదరవర్మ.<br>
కామపాలుఁడు.<br>
వసుకాముఁడు.<br>
కరటకాచార్యులు.<br>
నారాయణవర్మ.<br>
చలపతిరావు.<br>
వీరభద్రుఁడు.<br>
ధనగుప్తుఁడు.<br>
అప్పన్న.<br>
పురుషోత్తమరావు.<br>
రాముఁడు.<br>
విక్రమదేవు.<br>
మాధవరావు.<br>
ఒక సేవకుఁడు.<br>
వసుకాముని స్నేహితులు గొందఱు.

స్త్రీలు.

సుభద్రమ్మ.<br>
జానకి.<br>
పద్మావతి.<br>
అన్నపూర్ణమ్మ.<br>
ఒక పరిచారిక.



శ్రీరస్తు.

# అపవాదతరంగిణి.

## ప్రథమాంకము.

రంగము :—రాజమహేంద్రవరము, సుభద్రమ్మగారి గృహములో నొకచావడి.

సుభద్రమ్మయు, కరటకాచార్యులును ప్రవేశించుచున్నారు.

సుభ—కరటకాచారీ! నేను చెప్పినట్లు జాబులన్నియు రవానాచేసినావా?

కర—అమ్మా, అన్నీ సరిగా రవానాచేసివేసినాను. అవి నే నేస్వయముగా మా డుపస్తాకీతోను ఎడమచేతితోను బహు నేర్పుతో జాగ్రత్తగా వ్రాసినాను. అవి మనము వ్రాసినామని సందేహించుట కెంతమాత్రము వీలులేకుండా వుండేలాగు వ్రాసినాను.

సుభ—సుందరమ్మగారిసంగతి బాగుగాఁ బ్రచురించినావా లేదా?

కర—ఆసంగతి బహుచమత్కారముగా జరిపినాను. మనకేవిధమైన ఆయాసము అక్కఱలేక నే ఊరందఱికి యీపాటికే తెలిసేలాగున చేసినాను. ఈ సంగతి లక్ష్మీదేవమ్మ చెవిని యీపాటికేపడియుంటుంది. ఆవిడవిన్న సంగతి యేసంగతి అయిన మీకోరికప్రకారమందఱికీ అప్పుడే తెలిసియుంటుంది.

సుభ—కరటకా నీవన్నమాట వాస్తవమే. లక్ష్మీదేవమ్మ యిట్టి విషయముల లో చాల శ్రమపడును. ఆమె యేమాట వినినను నది నలుగురితోను చెప్ప

నిదీ నిద్రయైనను పోఁజాలదు. పాపము! ఆమె యిట్టివిషయములలో చాల
తెలివిగలదిసుమా.

కర—అవునమ్మా, ఆమె పడుచుతనములో చాలా యెక్కువపనులేచేసేది. ఇ
ప్పుడు ముసలితనముచేత అందఱియిండ్లకు తిరగలేక కొందఱితోమాత్రమే
తాను విన్నసంగతులు చెప్పుతూవుంటుంది. ఆమెకాలములో యెన్నివివా
హములో పీటలమీఁదవి చెడగొట్టినది. యెందఱు తండ్రులకును కొమారు
లకునో విరోధము కలుగజేసినది, యెన్నికాపురములో చెడగొట్టినది, యెం
దఱియిల్లాండ్రనో దుష్ప్రవర్తనులనుగాఁ జేసినది. ఆవిడచేసిన కార్యము
లన్నియు శాశ్వతబ్రహ్మకల్పములుగా నుండతగినవి. ఆమె పడినశ్రమ యీ
రోజువఱకును ఫలించుచునేయున్నదిగదా. ఇంతేకాకుండ చిరకాలముక్రిం
దట కుటుంబముతో కాశీవెళ్ళిన బ్రహ్మయ్యగారి కొమార్తె సుబ్బమ్మను నా
లుగుసంవత్సరములక్రిందట కిరస్తానీవాళ్ళలో కలిసి నరసాపురములో మది
డీజాడ్యముచేత మృతినొందిన రామయ్యకు మొన్ననే వాడపల్లిలో వివా
హముకూడ చేసి కన్యాదానఫలము గట్టుకొన్నది.

సుభ—ఆమె నేర్పరియేగాని అంతగా నుపాయశాలిమాత్రము కాదుసుమా!

కర—ఆమాటనిజమే. ఆమె చేసేపని బాగుగా ఆలోచించియే చేయుచుం
డును. మాటలాడునప్పుడుగూడ వెనుకదీయక ధైర్యముగనే మాటలాడు
చుండును. ఎంతసాహసముగానైనను సంగతులు కల్పనచేసి అపవాదలు
వేయుచుండును. కాని ఆమెకు మాటలాడు నేర్పుమాత్రములేదు. ఇట్టివా
టిలో మీనేర్పు ఆమెకెక్కడవస్తుంది.

సుభ—సరే, ఆమాటకేమిలే, నీవెప్పుడును ముఖప్రీతికి యీలాగుననే స్తోత్ర
ము చేయుచుందువు.

కర—నేను యెన్నడు ముఖప్రీతికి స్తోత్రముచెయ్యను. నేనేకాదు. ఈయూ
రందఱు సుభద్రమ్మగారొక్కమాటలో నెంతయర్థమయిన నుండులాగున
మాటలాడి యెంతటికార్యమయినను బహు యుక్తియుక్తముగా చేయుదు



చెప్పుకొందురు. కొంతనిజమున్నను యితరులు మాటలాడు నేర్పు తెలియ
క అపనమ్మకము కలిగేలాగున మాటలాడుదురు. మీరు మీనేర్పుచేత అబ
ద్ధముకూడా, అందరూ నమ్మేలాగున చెప్పుతారు.

సుభ—కరటకాచార్యులు! ఆమాటనిజమే. నేనుకష్టపడివేసిన యపవాదలిప్ప
టికి యెందఱు నమ్ముచున్నారో చూచినావా! నేనుపడినశ్రమ ఫలించినద
నిన నాకు కోపమెందుకు. నాచిన్నతనములో నేనెన్నో యపవాదలపాల
యి చెడ్డదాననని పించుకున్నాను. ఇప్పుడు నాసమయము వచ్చినదిగనుక
నితరులమీఁదనే నపవాదలువేసి వారిని నిందపాలుచేసి నాతో సమానుల
నుగాఁ జేయుటకే నేను ప్రయత్నించుచుందును.

కర—మీరీపనిచేయుట బహున్యాయమే. ఎవరిబాధ లెవరికి తెలియును. మీ
లాగు అనుభవముగల యోగ్యులంతా మీయుద్దేశములు మంచివని గ్రహిం
చనేగ్రహించెదరు. కాని మీరు నెలదినములక్రిందట నాచేత నొకపని చే
యించినారు. ఆవిషయములో మీయుద్దేశమేమియో నేను బొత్తుగా గ్ర
హించ నేరకున్నాను.

సుభ—మన దామోదరవర్మగారి సంసారమునుగురించి నేను నీతో చెప్పిన
మాటవిషయమై యడుగుచున్నావాయేమిటి?

కర—అవును. దామోదరవర్మగారి యింట కాపురమున్న యన్నదమ్ముల నిద్ద
ఱిని వారితండ్రి చనిపోయినప్పటినుండియు దామోదరవర్మగారే కాపా
డుచున్నారు. అందు పెద్దవానిని బహుయోగ్యుడని యందఱును గౌరవిం
తురు. చిన్నవాడు దుస్సహవాసదోషముచేత సొమ్మంతయుఁ బాడుచేసి
కొని నాటకములలోఁ దిరుగుచు గౌరవహీనుఁడుగానున్నాఁడు. పెద్దవాఁ
డు మీయెడల బహు గౌరవముగలిగి మిమ్ములను ప్రేమించుచున్నాఁడు.
మీరును నతనినే ప్రేమించుచున్నట్లగపడుచున్నది. చిన్నవాఁడు దామో
దరవర్మగారి తమ్ముడుకూఁతురు జానకిని ప్రేమించి యాచిన్నదానిని వివా
హ మాడవలెనని యున్నాఁడు. జానకిగూడ నతనినే ప్రేమించి వివాహ

మాడవలెనని యున్నది. పాపము జానకి తల్లిదండ్రులు చిన్నతనములోనే చనిపోయియుండుటచే నాచిన్నది దామోదరవర్మగారి యింటనే ఆయన సంరక్షణలోనున్నది. ఈసంగతి యిట్లుండగా యేలోపమును లేక కావలసినంత ఆస్తితోనున్న మీరు వారిద్దఱిలో జ్యేష్ఠుఁడగు కామపాలునివంటి యోగ్యుని మోహించియు నాతని వివాహమాడి సుఖించక కనిష్ఠుఁడగు వసుకామునకును జానకికిని గల ప్రేమానుబంధమును జెడగొట్టి జానకి వసుకాముని వివాహమాడకుండ నేలయత్నించుచున్నారో నాకు బోధపడకున్నది. జానకి వసుకామునిఁ బ్రేమించి యాతని వివాహమాడినయెడల మీకార్యమున కేమిభంగమున్నది?

సుభ—దీనికి చాలకారణమున్నది. ఈవిషయములో రహస్యము నీకేమియుఁ దెలియనే తెలియదు. ఆరహస్యమిప్పుడు నేను చెప్పెదనువిను. కామపాలుని నేను నిజముగా మోహించినాననుకొన్నావా యేమిటి? మాకు వివాహమాడవలయునను యుద్దేశమే లేదు.

కర—ఏమి? నిజముగా మీకాయభిప్రాయమే లేదా?

సుభ—కామపాలుఁడు జానకిని మోహించినాఁడుగాని నన్ను ప్రేమించుటలేదు. జానకి యాస్తిచూచి యాయాస్తికొఱకామెను మోహించి వివాహమాడవలెనని యున్నాఁడు. తనతమ్ముని వసుకాముని జానకి మోహించియుండుటచేఁ దాను నామీఁదలేని మోహమొకటి కల్పించుకొని యీమిథ్యామోహముచేఁ దనకార్యము కొనసాగించుకొన యత్నించుచున్నాఁడు.

కర—అయితే యీవిషయములో మీకేమి లాభమున్నదో నాకింకను బోధపడలేదు. జానకి వసుకాముని నిరాకరించి కామపాలుని వివాహమాడినయెడల మీకేమిలాభమున్నది?

సుభ—అయ్యో! ఇంకను నాసంగతి నీవు కనిపెట్టలేకపోయినావుగదా! సిగ్గుచేతను భయముచేతను నీతోఁగూడ నేనిదివఱకీవిషయమును గుఱించి చెప్పక దాచినాను. జనులందఱు నయోగ్యుఁడనుకొను వసుకామునే నేనంత



రంగముగ మోహించుచున్నాను. అతనిని స్వాధీనపఱచుకొనుటకు నేనెంత కష్టమయినను బడుచున్నాను.

కర—ఇప్పుడు నిశ్చయముగా మీరుచేసే ప్రయత్నమునకు రహస్యకారణము నాకు బోధపడినది; కాని కామపాలునకును మీకును నింతయన్యోన్యవిశ్వాసమును నమ్మకమును యెట్లుకలిగినది?

సుభ—మాయిద్దఱిస్వలాభములకొఱకును మాకీయన్యోన్యవిశ్వాసమును నమ్మకమును గలిగినది. అతనిస్వభావము నేనిదివఱకు చాలకాలముక్రిందటనే చక్కఁగాఁ గనిపెట్టినాను. అతఁడు స్వకార్యదురంధరుఁడనియు, కుచోద్యుఁడనియు, కపటియనియు నేనిదివఱకే గ్రహించినాను. దామోదరవర్మకును నతని స్నేహితులకును మాత్రమితఁడు బహుయోగ్యుఁడుగను విశ్వాసపాత్రుఁడుగను, పరోపకారపారీణుఁడుగనుఁ గనఁబడునట్లు నటించుచున్నాఁడు.

కర—అవును. దామోదరవర్మ కతనియందు విశేషగౌరవమున్నమాట వాస్తవమే. కామపాలునివంటి సత్పురుషుఁడీదేశమధ్యమందు లేఁడని దామోదరవర్మ యభిప్రాయము. ఇంతేకాక కామపాలుఁడు మిక్కిలి దయాంతఃకరణగలవాఁడని దామోదరవర్మ అతనిని శ్లాఘించుచుండును.

సుభ—దామోదరవర్మ కాతనియందట్టి యభిప్రాయమున్నమాట నిజమే. కామపాలుఁడు తననేర్పుచేతనే దామోదరవర్మ నిట్లు మోసపుచ్చి యాతనినిఁ దనకు వశునిగాఁ జేసికొని జానకిని వివాహమాడుటకు సిద్ధముగానున్నాఁడు. పాపమావసుకాము నాదరించువారెవ్వరును లేరు. ఒక్క జానకి మాత్రమే యాతనియందు దృఢమైన యనురాగమును విశ్వాసమునుఁ గలిగియున్నది. అందుచేతనే మనమీప్రయత్నములన్నియు జాగరూకతతోఁ జేసి వారికొండొరులకుగలస్నేహభావము చెడిపోవునట్లుకృషిచేయవలయును.

(ఒకసేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు).

సేవకుఁడు—అమ్మా! కామపాలుఁడుగారండి—

సుభ—అయనను త్వరగా లోపలికి తీసికొనిరా.

(సేవకుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

అతఁడెప్పుడును మాయింటికీవేళనే వచ్చుచుండును. జనులందఱు నన్నతఁడు మోహించినాఁడని చెప్పుకొనుటయందాశ్చర్యమేమున్నది.

(కామపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కామ—సుభద్రా! ప్రియురాలా! నీవు సుఖముగానున్నావా? కరటకాచారీ! నీకు క్షేమమా?

సుభ—కరటకాచార్యులిప్పుడు మనకిద్దఱికినిఁగల యన్యోన్యస్నేహబంధమునకు రహస్యకారణమేమని యడుగుచున్నాఁడు. అతనితో మనయుద్దేశములన్నియుఁ జెప్పినాను. అతఁడు మనకెంత యుపయోగకారిగా నున్నాఁడో నీవెఱుఁగుదువు. అతఁడు బహు నమ్మకమైనవాఁడు; మనరహస్యముల నెన్నఁటికిని వెల్లడి చేయఁడు. అతనితో మనరహస్యములనన్నిఁటినిఁ జెప్పుటవలన మనకేమియు భయములేదు.

కామ—సుభద్రా! నీవిషయమై యింతగా నాతోఁ జెప్పనవసరములేదు. కరటకాచారివంటి నమ్మకమైన ప్రాణస్నేహితుఁ డెన్నఁటికిని మనరహస్యములను వెల్లడిచేయునన్న భయము నాకెప్పుడును లేదు.

సుభ—ఈమాటల కేమిగాని నీప్రియురాలు జానకిని నేఁడు చూచితివా లేదా? మీతమ్ముని గూడ నేఁడు చూచితివా లేదా?

కామ—నిన్ను జూచి వెళ్ళినతరువాత వీరిద్దఱినిఁ గూడ నేనిదివఱకుఁ జూడలేదు. జానకి వసుకామునితో మాటలాడుట లేదనిమాత్రము నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను. నీవు చేసిన యత్నములన్నియుఁ జక్కఁగా ఫలించి నీవు కల్పించిప్రచురపఱచిన యపవాదలవలన జానకికి వసుకామునియందనిష్టము కలిగినట్లే యగుపడుచున్నది.

సుభ—కరటకాచారీ! ఈకార్యమంతయు నీసహాయముననే కొనసాగినదిసుమా. నీవు చేసిన మహోపకారమెన్నఁటికిని మఱవఁదగదు. ఆయితే కా



మపాలకా! నీతమ్ముఁడు వసుకాముని దుఃఖము హెచ్చుచునేయున్నదిగదా! అయ్యో! పాపమతని కెంతయాపదవచ్చినది!

కామ—అతఁడు వెఱ్ఱివానివలెఁ దిరుగుచున్నాఁడు. అతనికి మనస్థితియే బొత్తిగాలేదు. నిన్ననే ఋణదాతలాతనిఁ జిక్కులుపెట్టి యతనిపై నొక "వారంటుఁ" గూడ "జారీ" చేసినారు. అతనన్నివిధములచేతను గష్టపడుచున్నాఁడు. స్వబుద్ధివలన సొమ్మంతయుఁ బాడుచేసికొని స్వేచ్ఛగాఁ దిరిగిన ఫలమంతయు నిప్పుడు చక్కఁగా ననుభవించుచున్నాఁడు.

సుభ—పాపమయ్యో! వసుకామున కెంతకష్టమువచ్చినది!

కామ—సుభద్రా! నీవన్నమాటనిజమే. అతనిసంగతిఁ దలఁచుకొనిన విచారము కలుగకమానదు. అయ్యో! వసుకామునకెంతదుర్గతిఁ సంప్రాప్తమయినది! నాశక్తి వంచనలేకుండ నేనతని కెంతసహాయమైననుఁ జేయసిద్ధముగా నున్నాను. తనసోదరుఁడెంతదుర్మార్గుఁడయినను నతనికిఁ గష్టసమయములోఁ దోడ్పడనివాఁడు—

సుభ—ఆమాటలకేమిలే, మావంటినమ్మకమైన ప్రాణస్నేహితులతో మాటలాడునప్పుడుగూడ నీనీతిబోధనలెందుకు. సంగతియంతయు నీవు మఱచిపోవుచున్నట్లు తోఁచుచున్నది.

కామ—అవును నీవుచెప్పినమాట నిజమే. ఈనీతిబోధలన్నియు దామోదరవర్మదగ్గఱ చెప్పఁదగినవికాని మీవంటి స్నేహితులయొద్దఁ జెప్పఁదగినవికావు. దామోదరవర్మ దగ్గఱకు వెళ్లువఱకును నేనీనీతియంతయు మఱచిపోయెదను. ఏదియెట్లున్నను జానకినిమాత్రమట్టి యయోగ్యునిపాలఁబడకుండఁగాపాడుటవలన మనకెంతైనను బుణ్యమున్నది. ఇది మనము కేవలము దేశక్షేమముకొఱకును జానకి క్షేమముకొఱకును నుపకారబుద్ధితోఁ జేయుచున్నాముగాని మనలాభమునకుఁగాదు. ఈపుణ్యము నీవంటి యుత్తమురాలే గట్టుకొనవలెను గాని యితరులవలన నెంతమాత్రమును గాదు.

కర—సుభద్రమ్మగారూ! ఇదిగో యెవరోవస్తున్నారు. ఇఁక నేను యిక్కడ

వుండఁగూడదు. మీరు చెప్పిన ప్రత్యుత్తరములన్నీ ఆలాగున నేవ్రాసి యీసాయంత్రమే "రవానా" చేస్తాను. కామపాలుఁడుగారూ! సెలవిప్పిస్తారా.

కామ—కరటకా! మంచిది. నీవుచేయవలసిన పనిమాత్రము మఱచిపోవలదు.

(కరటకాచార్యులు నిష్క్రమించుచున్నాఁడు)

సుభద్రా! మనరహస్యములన్నిటినిఁ గరటకాచార్యునితోఁ జెప్పినందుకు నాకు మిక్కిలి విచారముగనున్నది.

సుభ—ఏమి నీవట్లు భయపడుచున్నావు?

కామ—ఈమధ్యనే కరటకాచార్యులు మాతండ్రిగారి "గుమాస్తా" సుబ్బయ్యతో నేదో రహస్యముగా మాటలాడుచుండఁగా నేను స్వయముగాఁ జూచినాను. ఆముసలివానికిని నాకును బద్ధవిరోధము. మనశత్రువులతో మాటలాడువానిని మనమెన్నటికిని నమ్మఁదగదు.

సుభ—అంతమాత్రముచేతనే కరటకాచారిని మనము మరియొకవిధముగా నెంచఁగూడదు. అయితే కరటకాచార్యులు మనరహస్యములన్నియు నతనితోఁ జెప్పననుకొంటివా యేమి?

కామ—దానికి సందేహమేమి, చెప్పినఁ జెప్పనేవచ్చును. కరటకుఁడంతగా నమ్మఁదగినవాఁడుకాఁడు. అతఁడు తనను తానే నమ్మఁడు, ఓహో! జానకా!

(జానకి ప్రవేశించుచున్నది)

సుభ—జానకీ! నీకు క్షేమమా? విశేషములేమి?

జాన—ఏమివిశేషములున్నవి. ఇప్పుడే చలపతిరావు తనపినతండ్రి నారాయణవర్మతోఁ గలసి మామేనమామ దామోదరవర్మగారియింటికి వచ్చినాఁడు. చలపతిరావు నన్ను వివాహముచేసికొనవలెనని ప్రయత్నించుచున్నాఁడు. చలపతిరావు పేరువినుటకే నాకిష్టములేదు. కావున వానిని జూచుటకిష్టములేక నేనిచటకు వచ్చినాను.

సుభ—అంతేగద! మఱేమియు విశేషములు లేవా?

కామ—మాతమ్ముఁడు వసుకాముఁడుగూడ నచటనేయున్నయెడల జానకీ! నీ



కెంతయనిష్టము కలిగి నీవిక్కడికి రాక యక్కడనే యుందువుఁగదా!

సుభ—ఏమి? నీవంత కఠినముగా మాటలాడుచున్నావు. అందులో జానకి నిజమైన యభిప్రాయమదికాదు. నీవిక్కడ నున్నావని విని జానకియీవఱకే యిక్కడకు వచ్చినది. జానకీ! చలపతిరావేమిచేసినాఁడు నీకాతనియందంతకోపమేమి?

జాన—అతఁడు నాకేమియు నపకారముఁ జేయలేదు. అతఁడు చెప్పుమాటలు వినుటకు నాకెంతమాత్రము నిష్టములేదు. అతఁడెప్పుడు చూచిన నితరులను నిందించుచునేయుండును.

కామ—అవును. అతఁడు తనస్నేహితులను నెఱిఁగినవాండ్రను నెఱుఁగనివాండ్రనుఁ గూడ నొక్కరీతిగా నిందించుచుండును. అతని పినతండ్రి నారాయణవర్మగూడ నట్టివాఁడే.

సుభ—దానికేమి? చలపతిరావు మిక్కిలి సరసుఁడు యుక్తియుక్తగా మాటలాడఁగలఁడు. అతఁడు కవిత్వముఁగూడ చెప్పఁగలఁడు.

జాన—పరదూషణతోఁగూడిన సరసత్వమును, యుక్తులును నాకెంతమాత్రమును రుచింపవు. కామపాలుఁడుగారూ! మీయభిప్రాయమేమి?

కామ—నిశ్చయముగా నీవుచెప్పినమాటసత్యము. ఇతరులమనసు బాధపఱచి పరులవంచించు సరసుఁడెంతయపకారముఁ జేయుటకయినను వెనుకఁదీయఁడు.

సుభ—చతురతగల సరసత్వము పరదూషణలేక రాణింపనేరాణింపదు. నీతిబోధలు చేయుచు వేదాంతముపదేశించువారికి సరసత్వమును హాస్యోక్తులును నెట్లు తెలియును. కామపాలకా! నీయభిప్రాయమేమి?

కామ—యుక్తియుక్తముగా నుండక నవ్వుఁబుట్టింపఁజాలని సంభాషణ వినుటకే రుచింపదు.

జాన—సరే. బాగుగానేయున్నది. పరదూషణమంచిదియగునాకాదా యనునంశమును గూర్చి నేనిపుడు చర్చింపను. పురుషులుమాత్రమితరుల నిందించుట తగదు. ఆఁడువాండ్రకు స్వాభిమానము, గర్వము, అసూయ, అస

హానము మొదలగు దుర్గుణములుండుటచేతను విద్యాశూన్యులగుటఁబట్టియు నితరులనుఁగూర్చి చులుకనగా నొకవేళ మాటలాడినను మాటలాడుదురు. మగవాండ్రుగూడ నాఁడువాండ్రవలెనే పరదూషణఁ జేయుచు లేనిపోని యపవాదులువేయుట యెంతమాత్రమును మంచిదికాదు.

(సేవకుఁడు తిరుగఁ బ్రవేశించుచున్నాఁడు)

సేవ—అమ్మా? అన్నపూర్ణమ్మగారు వచ్చారు. సెలవైతే లోపలికి తీసుకొని వస్తాను.

సుభ—ఆమెను త్వరగా లోపలికిఁ దీసికొనిరా.

(సేవకుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

జానకీ! ఇదిగో, అన్నపూర్ణమ్మగారు నీకిష్టమువచ్చినట్లు మాటలాడును. అన్నపూర్ణమ్మ మితభాషిణిమాత్రము కాదుగాని యామె మాటలాడునదంతయు సహేతుకముగా నుండుననియు నామె బహుయోగ్యురాలనియు నూరందఱుసంతోషింతురు.

జాన—అవును. మంచితనముపేరుపెట్టుకొని యోగ్యురాలనిపించుకొనుచు నామె నారాయణవర్మకంటెఁగూడఁ బ్రపంచమున కెక్కువనష్టమేచేయుచున్నది.

కామ—జానకీ! ఆమాటనిజమే. నాస్నేహితులనుఁగూర్చి యెవరేమియపవాదలు వేసినను నాకేమియు భయములేదుగాని యన్నపూర్ణమ్మ వాండ్రను మంచివాండ్రని వాదించుచుండినమాత్ర మితరులువేయు నపవాదలెంత వఱకయినను వ్యాప్తమగును. ఆమె యేమాటచెప్పకూరకుండిన మహోపకారముచేసినట్లు సంతోషించవలెను.

సుభ—చాలు. నెమ్మదిగా మాటలాడు. అదిగో, అన్నపూర్ణమ్మవచ్చుచున్నది.

(అన్నపూర్ణమ్మ ప్రవేశించుచున్నది)

అన్న—సుభద్రా! ఇన్నాళ్ళనుంచీ నీవేమిచేస్తూవున్నావు. కామపాలకా! విశేషములేమి? అది యేమిమాపమో కాని అన్నీ అపవాదలు, నిందలే చెవులఁబడుతూవుంటాయి.



కామ—అవును. ఎక్కడఁజూచినను పరదూషణయు నపవాదలునుఁ బ్రబలుచున్నవి.

అన్న—అమ్మాయీ! జానకీ! వసుకాముడకును నీకును జరిగిన వ్యవహారమంతా యేమిటి? వివాహముకాకుండానే అతనితో కయ్యమాడుచున్నావాయేమిటి. ఊరంతా అతనిసొమ్ము పాడుచేసుకోవడము దుర్వ్యయముచేయడమే చెప్పుకొంటారు.

జాన—వసుకాముని విషయమై లేనిపోనిమాటలు చెప్పుకొనుట కితరులకేమిలాభము. అతని విషయమై యితరులకెందుకు.

అన్న—అమ్మాయీ! ఆమాటనిజమే, కాని మనుష్యులనోళ్లు యెవరు కట్టివెయ్యగలరు. విన్నమాటలు చెప్పుకొనకమానరు. ఈమధ్య మీపెత్తండ్రి దామోదరవర్మయు భార్యయు వివాదపడిరనియు వారిద్దరు యిప్పుడు మాటలులేకుండా వున్నారనియు విని నేనెంత విచారించుచున్నానో యెవరికేమి తెలుస్తుంది.

జాన—లేనిపోనివిషయములను గురించి లోకులకెందుకు. ఇతరుల సంసారములనుగూర్చి యిట్లుచెప్పుట తగదు.

అన్న—అమ్మాయీ! ఆమాట నిజమేకాని మనమేమిచెయ్యఁగలము, లోకము మంచీచెడ్డా చెప్పకోకమానరు. ఎవరియిష్టమువచ్చినట్లు వారిని మాట్లాడకుండా మనము చెయ్యఁగలమా. ఇంతయెందుకు దర్భావారి సీతమ్మ తనమెడలోకంటె చాకలివానికి యిచ్చినదని విన్నాను. పాపపుకాలము, కలి దగ్గరకు వచ్చినది. మనము విన్నమాట లన్నీ మరచిపోవడము మంచిది. కానియీసంగతి బహునమ్మకమైనవాళ్ళవలన విన్నాను సుమా.

జాన—అట్టిమాటలు కేవలమపవాదలుగా గణింపవలసినదే గానినమ్మదగ్గవి యైనవి కావు.

అన్న—అవును, ఆమాటలు అపవాదలే, అవివినుటకుకూడా సిగ్గుగావుంటుంది. కాని లోకములో మాటలుపడనివారు యెవరూలేరు, నీస్నేహితురా

లు కాంతమ్మకూఁతురు మొన్న ఒక స్కూలుపిల్లవానితో లేచిపోతూ వుండగా తండ్రి వాళ్ళను గాటీపాకదగ్గర పట్టుకొని కూఁతురుని యింటికి తీసికొనివచ్చినాడఁట. కాంతమ్మకూతు రట్టిపని చేస్తుందని యెవరను కొన్నారు చెప్పు.

జాన—ఆమా టెంతమాత్రము నిజముకాదు, నాకాసంగతియంతయు బాగుగాఁ దెలుసును.

అన్న—అయ్యో! లోకులు మాటలనేటప్పుడు నిజము గిజముఆలోచిస్తారా నోటికి యెట్లావస్తే అట్లా అంటారు. మొన్న నెలరోజులక్రిందట సూరమ్మనుగురించి లక్ష్మీపతిని గురించి అనుకొన్న మాటకంటె యివి అన్నీ ఆశ్చర్యమా యేమిటి. కాని, అమ్మాయీ! ఆసంగతి యెంతవఱకు నిజమో యిప్పటికిని తెలియనేలేదుసుమా.

కామ—నిజమో యబద్ధమో యని యాలోచించకుండుట యటుండగా లేని మాటలు కూడఁ గల్పించి లోకులు చెప్పుచుందురు.

జాన—ఆమాట వాస్తవమే. అట్టిమాటలను విని యితరులతోఁ జెప్పువారు మాటలను కల్పించినవారివలెనే దుర్మార్గులనియు, దూష్యులనియు నాయభిప్రాయము.

అన్న—ఆమాట నిజమే. తమకు లాభములేనిమాటలు యితరులతోఁ జెప్పేవాళ్ళు అపవాదలు వేసేవాళ్ళంత చెడ్డవాళ్లు అవుతారు. అయితే యేమిచెయ్యను. లోకుల నోరుకట్టివెయ్యలేము. ప్రతివారి అమ్మాయి వాళ్ళయింట్లోవున్న తన మేనమామకొడుకునే గాని పెళ్ళాడనని తండ్రితో జగడమాడుతూవున్నదని మంగమ్మ నాతో యిప్పుడేచెప్పినది. ఆవిడే ప్రక్కవీధిలో నొకపిల్ల వెధవపెళ్ళిచేసుకోవలెనని ఆలోచిస్తూవున్నదని కూడా ముభావనగా అన్నది. ఈమాటలు మంగమ్మ నాతో చెప్పుతూవుండగా రత్నమ్మ దగ్గిరవుండి మాధవరావుగారి భార్యా పొరుగింట్లో కూర్చుని చీట్లపేక ఆడుతూవుండగా మొగుడు చూచి కొట్టినాఁడని చెప్పినది. ఈ



మాటలన్నీ నాకెందుకు. ఈమాట నేనెవరితోనైనా చెప్పుతాననుకొన్నావా యేమిటి, నీలాపనిందలు వెయ్యడమెంతతప్పో చెప్పడము కూడా అంతేతప్పు.

కామ—అన్నపూర్ణమ్మా! అందఱికి నీమంచితనము, నీతి, యోరిమి యుండిన నెంతో బాగుగానుండునుగదా.

అన్న—మనుష్యుల ముఖముమీఁద అనక చాటున చెప్పుకొనేమాటలు వినుటకు నాకెంతమాత్రము యిష్టములేదు. నేనెఱిఁగినవాళ్ళమీఁద యేమాటలైనా చెప్పితే నాకెంతో కష్టముగా వుంటుంది. అయితే, కామపాలుఁడుగారూ! మీతమ్ముఁడు బొత్తిగా చెడిపోయి పకీరుఅయిపోయినాఁడన్న మాట నిజముకాదుగదా?

కామ—అతనివ్యవహార మేమియు బాగుగానుండలేదు. అతనిస్థితియంతయుఁ జెడిపోయినట్లే తోఁచుచున్నది.

అన్న—నేనూ ఆలాగేవిన్నాను. మీరుమాత్రము అతనికి ధైర్యముచెప్పవలెను. ఈరోజులలో అంతా ఆలాగేవున్నారు. ఒకరినిజూచి వొకరు చెడిపోతున్నారు. వసుకాముని స్నేహితులలో సగముమంది దివాలాతీసినారు. వసుకాముఁడుకూడా దివాలాతీస్తే అతనినోదార్చే స్నేహితులనేకులుంటారు.

కామ—ఇందుకు సందేహముండదు. ప్రపంచములో నెట్టికారికి నన్నియవస్థలయందును స్నేహితులు దొఱకుచునేయుందురు.

(తిరిగి సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సేవ—అమ్మా! చలపతిరావుగారూ నారాయణవర్మగారూ వచ్చినారండి.

(అని వెళ్లిపోవుచున్నాఁడు.)

(చలపతిరావును నారాయణవర్మయుఁ బ్రవేశించుచున్నారు.)

నారా—సుభద్రమ్మా! నీకుఁ గుశలమా? అన్నపూర్ణమ్మగారూ! మాయన్నకొమారుఁడు చలపతిరావును మీ రెఱుఁగరు కాఁబోలును. అతను మంచిరసికుఁడు, కవిత్వముఁ గూడ చెప్పఁగలఁడు. సుభద్రమ్మా! చలపతిరావు మంచి

కవిత్వము చెప్పఁగలవాఁడు కాఁడూ?

చల—ఆమాట లిప్పుడెందుకు పోనియ్యండు నాకవిత్వ మెంతటిది లెండు.

నారా—అలాగునఁ జెప్పవద్దు. యోగ్యులెప్పుడుఁ దమ్ము స్తుతిచేయునప్పుడిట్లే చెప్పుచుందురు. ఇతనివలె జటిలముగాఁ గవిత్వము చెప్పువారీదేశమధ్యమందే లేరు. ఇతఁడు మొన్న రమాకాంతరావుగారిమీఁదఁ జేసిన పద్యములను విన్నారా? చలపతిరావూ! ఆపద్యములనుగాని యీమధ్య నీవాశుధారగాఁ బుత్రోత్సవసమయమున రచించిన పద్యములనుగాని రెండు చదువుము.

చల—పోనిండు. ఇప్పుడు పద్యములెందుకు.

నారా—నామాటనమ్మండి, మీరాపద్యములు వినినయెడల నాతఁడెంతజటిలముగను; ఆశుధారగాను కవిత్వముఁ జెప్పఁగలఁడో మీకేవిశదమగును. అతను సమస్యలు మిక్కిలి యద్భుతముగాఁ బూర్తిచేయఁగలఁడు.

శుభ—చలపతిరావుగారు! మీపద్యములేమియు మాసపత్రికలలోఁ బ్రకటించరేమి?

చల—పత్రికలలోఁ బ్రచురింపుటకు నాకవిత్వమెంత. నేఁజెప్పిన పద్యములన్నియు శృంగారవిషయమై కొన్నియు, స్త్రీలనుఁగూర్చి యాశుధారగా నాయాసమయములయందుఁ జెప్పినవి కొన్నియుఁ గలవు. ఇవి మాసపత్రికలలోఁ బ్రచురించుటకంటె వేలువేలుగా కాగితములమీద నచ్చువేయించి నాస్నేహితుల కిచ్చుచుండు టుచితమని నేనట్లు చేయుచుందును. ఈపద్యములుగాక నేనొక శృంగారప్రబంధమిప్పుడు వ్రాయుచున్నాఁడను. జానకిని నేను వివాహమాడునపు డాగ్రంథము జానకికిఁ గృతియొసంగఁ దలఁచుకొన్నాను. (అని జానకిమొగము చూచుచున్నాఁడు)

నారా—(జానకితో) నామాటనమ్ముము. ఆగ్రంథము నీవు కృతినొందుటవలన నీవు మిక్కిలి ప్రసిద్ధురాలవగుదువు. నీపేరు ప్రపంచమున్నంతవఱకు నుండును. గ్రంథమును కృతినొందుట యష్టైశ్వర్యములలోఁ బ్రధానమయినది.



చల—(జానకితో) ఆమాటవాస్తవము. ఆప్రబంధము నీవుచూచినయెడల నీవు చాల సంతోషింతువు. ఆగ్రంథమును చక్కని దళసరికాగితములమీఁద మంచియక్షరములతో రంగులతో ముద్రించి నీకుఁజూపింతును. నాగ్రంథము మిక్కిలి మంచిదని యప్పుడు నీవే సంతోషింతువు.

నారా—ఈమాట బహు బాగుగానున్నది. కాని మీరీమధ్య నేమయిన విశేషములు వినినారా?

అన్న—ఏమివిశేషములున్నవి. మీయభిప్రాయము దామోదరవర్మగారిని గురించి, అనేనా?

నారా—ఆయనను గురించికాదు. రామలక్ష్మమ్మ విధవపెండ్లిచేసికొన యత్నించుచున్నదఁట, మీరువిన్నారా?

అన్న—ఏమిటి? ఆమాట యెంతమాత్రము నమ్మదగినది కాదు. ఆమాట నిజమై యుండదు.

నారా—పోనీ యింకను నామాటమీకు నమ్మకము లేకపోయినయెడల చలపతిరావు నడుగవచ్చును.

చల—ఆమాటనిజమే. వివాహమునకంతయు నిశ్చయమయినది. వరుఁడుఁ గూడ దొఱకినాఁడు. వివాహమునకుఁ బ్రయత్నములు జరుగుచున్నవి.

నారా—అవును. ఈరాత్రియె వివాహము జరగును. ఆలస్యమయినచో వివాహమునకేమి యడ్డమువచ్చునోయని తొందరగాఁ జేయుచున్నారు.

శుభ—ఈమాట నేనిదివఱకే కొంతవఱకువిన్నాను.

అన్న—ఈమాటవింటే చాలా హాశ్చర్యముగానున్నది. రామలక్ష్మమ్మ ప్రతిరోజూ గోదావరిస్నానములుచేస్తూ యేకాదశియుపవాసములుంటూ, ఆచారము బహుజాగ్రతగా జరుపుతూవుంటుంది. అంతయాచారవంతురాలింతపని చేస్తుందంటే వింతగావున్నవి.

చల—ఆచారమునకేమిలెండు. ఇదియంతయు లోకులను సంతోషపెట్టి మోసముచేయుటకుఁగాని మఱియొకటికాదు. గట్టిగా విధవావివాహమాడవలె

నని మనసులోనున్నది గనుకనే తానీవిధముగా ముసలివాండ్రకంటె నెక్కువ యచారము జరపుచు మంచిదానివలె నటించుచున్నది.

అన్న — మంచివాళ్లనిపించుకొంటూ వుండేవాళ్లమీఁద యిట్టివాడుకలు వస్తే లోకులు మఱివిరుద్ధముగాఁ జెప్పుకొంటారు. రామలక్ష్మమ్మకు యిట్టీ దుర్బుద్ధిలేకపోతే అంత చిన్నతనములో నంత ఆచారమేమి? అది అంత ఆచారము జరుపుచు నెంతో యోగ్యురాలననిపించుకొనవలెనని నటించుచున్నది గనుకనే యీమాటవిన్నవారంతా నిజమని నమ్మకమానరు.

చల — ఆమాటసత్యమే, లోకవిరుద్ధముగానుండులాగున మంచిపనిచేసినను నది యనుమానాస్పదము కాకమానదు.

అన్న — అవునుకాని యీసంగతంతా నిజముకాదనుకొంటాను. ఇది కేవలము అపవాదగా నుండవచ్చును. చలపతిరావుగారూ! నరములేనినాలుక యెట్లాగునచెప్పమంటే ఆలాగున చెప్పుతుంది. లోకములో కారణములేకుండా యెన్నిమాటలు పుట్టుచుండునో మీకే తెలుసును.

నారా — కారణములేకనే లోకములో లేనిపోని మాటలనేకము పుట్టుచుండును. ఆమాటవాస్తవమే, పాపము పార్వతమ్మనుగూర్చి యెట్టియపవాదలు పుట్టినవో మీరేయెఱుఁగుదురు. చలపతీ! నీకాసంగతి జ్ఞాపకమున్నదా?

చల — అవునాసంగతి మిక్కిలి యాశ్చర్యమైనది. అంతకంటె విరుద్ధమయినది మఱొకటుండదు.

సుభ — ఏమిటి! ఏమిటి! ఆసంగతియేమో చెప్పుఁడు.

నారా — ఏమున్నది. ఒకరోజున మహాలక్ష్మమ్మగారి యరుఁగుమీఁద నమ్మలక్కలందఱుఁ గూర్చుండి మాటలాడుచుండఁగా నందులో నొకామె తాయారమ్మ గనుపించుటలేదేమని యడిగినది. అందుపై నొకతె యామె యొడ్డిమంగలివానినిఁ గూడఁ దీసికొని కోటిఫలి స్నానమునకు వెళ్లినదని చెప్పినది. ఆమాట అరాధ్యుల అన్నమ్మగారికి చెవిటితనముచేత సరిగా వినిపింపక తాయారమ్మ యొడ్డిమంగలివానినిఁ దీసికొని లేచిపోయినదని యందఱితోఁ జెప్పినది. తరువాత యీమాట యూరంతయు వ్యాపించి యందఱును వింతగాఁ జెప్పుకొనుచు, కొందఱు కాశి లేచిపోయినదనియు, గొందఱు రంగము లేచిపోయినదనియు, మఱికొందఱాస్తియంతయుఁ దీసికొని చెన్నపట్టణము లేచిపోయినదనియు ననేకవిధములుగా ననేక వింతలుగూడ కల్పించి చెప్పుకొన నారంభించినారు.



సుభ — ఈసంగతి బహుచమత్కారముగానే యున్నది.

నారా — ఇదియంతయు నిజము, నామాటనమ్ము. కామేపాలుఁడుగారూ! ఈమధ్య మీపినతండ్రి విజయవర్మగారికీయూరు వత్తురనివిన్నాను, నిజమేనా?

కామ — ఆసంగతి నేనువినలేదు. నాకాయన యేమియు వ్రాయలేదు.

నారా — ఆయన చాలకాలమునుంచి చెన్నపట్టణములోనే యుద్యోగములో నున్నారు. ఆయనను నీవిప్పుడానవాలు పట్టుటఁగూడ కష్టము. ఆయన వచ్చినయెడల మీతమ్ముడు వసుకామునిగుఱించి విని చాల విచారించునుసుమా-

కామ — వసుకాముఁడు యోగ్యతగానే సంచరించుచున్నాఁడుగాని యతనింతవఱకుఁ జెడిపోయెనని మాత్రమాయనకుఁ దెలిసియుండదు. వసుకాముఁడిప్పటికయినను బాగుపడవచ్చునను నమ్మకము నాకున్నది.

చల — నిశ్చయముగా నతఁడిప్పటికిని బాగుపడుటకు వీలుకలదు, అతఁడు లోకులనుకొనునంత దుర్మార్గుఁడు కాఁడని నాయభిప్రాయము. అతనిస్నేహితులలో మాత్రమాతని మేలుగోరువారెవ్వరును లేకపోయినను గొందఱు పెద్దమనుష్యులాతని గౌరవించుచు సాధ్యమగునంతవఱకు సహాయమిచ్చుచునే యున్నారు.

నారా — అవును. కొందఱు పెద్దమనుష్యులాతని గౌరవించుచునేయున్నారు వారందఱును వసుకాముఁడు మంచిమనసుగలవాఁడనియేఁ జెప్పుచుందురు.

చల — వసుకామునంత దాంభికుఁడెవ్వఁడును లేడు. అతనితో నెప్పుడుచూచినను ఋణదాతలును, కోర్టుబంట్రౌతులును, అమీనాలును మొదలగువారెందఱో యుందురట. అతఁడొంటరిగా నెన్నఁడును గానుపించఁడు.

కామ—ఈసంభాషణ మీకు వినోదకరముగానే యుండునుగాని మీరీవిధము గానాతమ్ముని నాయెదుట నిందించుట నాకుమాత్రము కష్టముగానున్నది.

జాన—(తనలో) వీరి దూషణవాక్యములను వినుటకు నాకు మిక్కిలి కష్టముగానున్నది. 'పూనినకర్మము పొరుగూరువెళ్ళినను మాన' దను సామ్యమునకిది దృష్టాంతముగానున్నది.

(పైకి) సుభద్రమ్మా! నాకు తలనొప్పిగానున్నది, నేను వెళ్లెదను.

(అని నిష్క్రమించుచున్నది)

అన్న—ఈమాటలువినుటకు జానకికెంతకష్టముగానున్నదో చూచినారా. పాపము దీనికి వసుకామునియందు ప్రేమ మిక్కిలి దృఢముగా నున్నట్లున్నది.

సుభ—అన్నపూర్ణమ్మా! నీవు జానకితోఁగూడ పొమ్ము. దానికిఁ గోపమువచ్చినట్లున్నది.

అన్న—అలాగునేవెళ్లెదను. పాపము ఆచిన్నదాని మనసెంతనొచ్చినదోగద

(అని వెళ్లుచున్నది)

సుభ—వసుకామునితో వివాదపడినను నింకను జానకి కాతని యయోగ్యతను గుఱించి వినుటకిష్టములేకున్నది. దీనికింకను నతనియందభిమానము పోలేదు, చూచినారా!

చల—జానకి యభిప్రాయము స్పష్టముగా నామెచర్యలవలనఁ దెలియుచునే యున్నది.

నారా—చలపతీ! నీవాలాగునని యూరకుండఁగూడదు. జానకిని వశపఱుచుకొనుటకు నీవుచేయవలసిన ప్రయత్నములను మానఁగూడదు. నీవామెతోఁబోయి యామెనూఱడించుట మంచిది. నీపద్యములు గొన్నికూడా చదివి జానకికి వినుపించుము. అవసరమైన నేనును నీతోవచ్చెదను.

చల—కామపాలుఁడుగారూ! మిమ్ముల నగౌరవపఱచవలెనని నేనీసంగతినిగుఱించి మీయెదుట మాట్లాడలేదు. కాని మీతమ్ముఁడు బొత్తిగా చెడిపోయినాఁడు. నామాటనమ్ముఁడు.



నారా—అతను కేవలము సన్యాసివలెనున్నాఁడు; ఒకపూటకైనను గతిలేకుండఁజెడిపోయినాఁడు. అతనికీయూర నొకగవ్వైనను నెవ్వరునప్పీయరు.

చల—పాపమాతని చరాస్తియంతయు నమ్మకమైపోయినది.

నారా—ఇంకను గొంతచరాస్తి యాతనియింట మొన్నఁ జూచినాను. అదియయినను బొత్తిగా నమ్మకమున కక్కఱరాకపోవుటచే నున్నట్లున్నది.

చల—అతనినిగుఱించి నేనుకొన్ని మాటలు గూడ విన్నాను. పాపమతనిస్థితిఁ దలఁచుకొనిన నాకు విచారముగానున్నది.

(వెళ్ళఁబోవుచున్నాఁడు.)

నారా—అతను చాలదౌర్జన్యపుఁబనులే చేసినాఁడు. ఆమాట వాస్తవమె.

చల—ఇంతకు నతను మీతమ్ముఁడు గనుక—

నారా—అతని సంగతినిగుఱించి సవిస్తరముగా మీతో సావకాశముగా నింకొకసారి చెప్పెదము.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు)

సుభ—(నవ్వుచు) వీరిద్దఱు నేసంగతినిగుఱించి మాటలాడనారంభించిన వినువారికేఁగాకఁ దమకుఁ గూడ విసుగుపుట్టునట్లు మాట్లాడుదురు.

కామ—ఈమాటలు వినుటకు వసుకాముని సోదరుఁడనగు నాకెంతకష్టముగానున్నదో నీకును నంతకష్టముగా నుండియుండును.

సుభ—మనమనుకొనినదానికంటె జానకికి వసుకామునియందెక్కువ యనురాగమేయున్నట్లు తోఁచుచున్నది. అయినను దామోదరవర్మగారి కుటుంబమంతయు నేటిరాత్రి యిటకు భోజనమునకు వత్తురు. నీవుఁగూడ నేఁటిరాత్రియిచటనే భోజనముచేసినచో మనమిద్దఱమునుఁ గలసి జానకియంతరంగమంతయుఁ జక్కఁగాఁ దెలిసికొనవచ్చును. నేనువెళ్ళి కర్తవ్యమాలోచించి కుతంత్రములు పన్నుటకుపాయమాలోచించెదను. నీవు మనరహస్యాభిప్రాయములను మాత్రము వెల్లడికానీక నేమియుఁ దెలియనివానివలెనే నటించుచుండవలెను.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు)

2 వ రంగము- దామోదరవర్మ గారి యింటనొకగది.

(దామోదరవర్మ ప్రవేశించుచున్నాఁడు.)

దామో—ముసలితనములోఁ బడుచుదానిని వివాహమాడినవానికెంతేసుఖము. పద్మావతిని నేను వివాహమాడి యిప్పటికాఱుమాసములయినది. ఈయాఱుమాసములలో నొక్కనిముసమయినను నేనుకంటనిడిపెట్టి విచారింపనిది లేదు. పెండ్లి చేసికొనినందుల కన్నివిధములచేతను నాయనుభవము నాకగుచున్నది. అందఱితోటిపాటు నేనుగూడ దంపతీయుక్తముగా దేవతాదర్శనము చేతమని శివరాత్రినాఁడు మార్కండేయస్వామి యాలయములోనికి వెళ్ళిన నక్కడనాతో వివాదపడి కోపముపట్టలేక పదిమంది చూచుచుండగా నన్నుకొట్టినది. గర్భాధానమునాఁటి రాత్రే నాగర్వమునాకు ధారపోసినది. వివాహమాడి నేనేమోసుఖపడవలెనని నను కొంటినిగాని యిదియంతయు నాముప్పునకేవచ్చినది. అక్కడికి నేను ప్రపంచానుభవముగలయేండ్లుగడచినవాఁడనుగనుక పల్లెటూరిబీదకుటుంబములోపిల్లనువెదకి వివాహము చేసికొన్నాఁడను. మేలుకమ్మిచీరె యొకటికట్టుకొని యొక కుత్తికంటును చేతులకు గాజులునుఁ దప్పనగలునాఁడెములు యెట్టివో యెఱుఁగని దీనిని వివాహముచేసికొనినయెడల నేనుచెప్పినట్లువిని నన్నేమో యీముసలితనములో సుఖపెట్టునని దీనిని తెచ్చిపెట్టుకొంటినిగాని నామాటవినినమాత్రమునఁనే కస్సుమని రాకాసివలె మీఁదపడునని కలలోనైనఁ దలఁపలేదు. తానుమొదట యేనగలు నాఁడెములు యెఱుఁగకపోయినను యిప్పుడు ప్రతిదినము నగలకోసము దినుసుచీరలకోసము నన్ను కొఱుకుకొనితిని నాప్రాణములు తీయుచున్నది.- నేను డబ్బియ్యకపోయినయెడల నింటనుండు బియ్యముమొదలగు సామానులన్నియు నమ్మితనయిష్టమువచ్చినట్లు చీరెలుతెడ్లు కొనితిని నాడబ్బంతయుఁ ఖర్చుచేయుచున్నది. మొదటినుండియు నాడబ్బుతిని నాకునమ్మకముగానుండెడి నాసేవకులందఱుగూడ దానిమూ



టూడుచు దానినే వెనుకవైచుకొనివచ్చుచున్నారు. నేను వీధిలోవెళ్ళుచున్నప్పుడెవరు నవ్వుచున్నను నన్ను చూచియేనవ్వుచున్నారని నేననుమానపడవలసినకాలమువచ్చినది. నేనుపొరిగిండ్లకువెళ్ళవలదంటే వెళ్ళకమానదు. నన్నొక గడ్డిపఱకక్రిందఁ దలచి నేనువలదని యెంతచెప్పుచున్నను వినక నాకండ్లయెదుట నేనుచూచుచుండఁగాఁ దనయిష్టమువచ్చినట్లలంకరించుకొని బజారులోనికిఁ గూడవెళ్ళుచున్నది. ఎక్కడచూచినను దామోదరవర్మగారి భార్యయేగనఁబడునని జనులనుకొనుటవలన దీనిమూలముగా నాపేరుగూడ నలుగురినోళ్ళలోను బడవలసివచ్చినది. పడుచువాండ్రతో మాటలాడవలదనినేనెంతనిర్బంధించినను నామాటవినక నామీఁద పంతమున కరఁగుమీఁదఁ గూర్చుండి దారినిఁబోవు పడుచువాండ్రందఱితో మాటలాడుచుండును. దీనిమూలముగా నాగౌరవమంతయుఁ బోయి నాబ్రతుకంతయు నవ్వుటాలకాస్పదముగాఁ బరిణమించినది. మునుపటివలె నేను పదిమందిలోనికి వెళ్ళుటగూడ మానుకొనవలసివచ్చినది, మొదటిభార్యపోయినతరువాత యెందఱెన్ని చెప్పినను వినక తిరిగివివాహము చేసికొనని శపథముపట్టికూడ తుదకు నలుగురిలో నాకుఁ దలవంపులు వచ్చులాగున నేనీపనిచేసినాను. ఇంతకు నాకు దానిమీఁదనున్న మోహముతగ్గలేదు. నన్నది యెంతకొట్టినను నెంతతిట్టినను నాకొక్కసారి నవ్వుమొగముతోఁ గంటఁబడిన నేనదంతయు మఱచిపోదును. తాను నన్నేమిచేసినను దనమీఁది మోహముచేత దానినేనేమియు నననని నన్ను మఱింతబాధపెట్టుచున్నది. "కడుపుచించుకొనిన కాళ్ళమీఁదఁబడు"ననునట్లు నేనేమిచేయుటకువీలులేకున్నది. ఇకనైననేను గొంచెము కోపముతెచ్చుకొని నాభార్యనాజ్ఞపెట్టి శిక్షించుచుండినఁగాని నేనుబ్రతుకుసాధనములేదు

(వీరభద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వీర—దామోదరవర్మగారూ! నమస్కారము. తమరేమో యాలోచించుచున్నట్లున్నారు. తమకు క్షేమమేకద ?

దామో—వీరభద్రా! నాసంగతియేమడిగెదవు, నాసౌఖ్యమింతింతని చెప్ప శక్యముకాదు. గృహచ్ఛిద్రములచేత నామనస్సంతయుఁ జెడిపోయియున్నది.

వీర—తమ్ము నేను నిన్నకదా చూచినాను. ఇంతలోఁ దమకు విచారహేతువేమి సంభవించినదో నాకుఁ దెలియకున్నది. తమ్ము నెప్పుడుచూచినను సంతోషముగా నుండెడివారు. ఇప్పుడాసంతోషమంతయుఁ బోయి యింతవిచారముగానుండుటకుఁ గారణమేమో నేనూహింపఁజాలకున్నాను.

దామో—నీవు చెప్పినమాట మిగులవింతగానున్నది. నావయసులో వివాహమాడినవానిని విచారహేతువేమని వేరేయడుగవలెనా?

వీర—తమరట్లనుట ధర్మముకాదు. పద్మావతి తమకెన్నటికిని విచారహేతువు కానేరదు. ఆమెనుదామే స్వయముగాచూచికదా వివాహముచేసికొన్నారు. అట్టివిషయములో నామెతమకెట్లు విచారహేతువగును?

దామో—బ్రతికియున్నంతవఱకు నాకది విచారహేతువుగా నేయుండును.

వీర—మీరట్లు సెలవీయవలదు. పద్మావతియొకవేళ చిన్నతనముచేత నవ్యక్తతగా సంచరించుచుఁ దమమాటకెదురుచెప్పినను దమకామెయందుఁగల ప్రేమాతిశయముచేత దానట్టివానిని బాటింపరాదు.

దామో—అవును; ఇది యెంతయుఁ దానితప్పుకాని నాతప్పెంతమాత్రమునుగాదు. అది నామాటకెప్పుడుచూచిన నెదిరించుచునేయుండును. నన్నేమన్నను నేనూరకుందును. నాతో మాటలాడుటకే దానికి విసుగుగానున్నది. నాముఖముచూచినప్పుడెల్ల నేమేమో తననోటిలో నాకు వినఁబడకుండ గొణుగుకొనుచుండును. అన్నిటికి నేను తలయొగ్గియుందును.

వీర—అవును మీరాసంగతి వేరే సెలవీయవలెనా! తమరు కేవలము దైవసమానులు. తమశాంతముచూచిన చాలనాశ్చర్యముగానుండును.

దామో—ఏమిచెప్పుకోను. కడుపుచించుకుంటే కాళ్ళమీఁదపడుతుంది. ఏమిచూచినను నామనస్సునకు విచారమేకాని సంతోషమన్నమాటలేకున్నది. పద్మావతి నామాటకెప్పుడుచూచిన నెదురుచెప్పుచునేయుండును. మూర్ఖ



ముగా నన్నెదురించుటయే ముఖ్యకార్యముగా నెంచి యయినదికూడఁ గాదనివాదించుచుండును. ఏమట్లా గొణుగుకొనుచున్నావని యడిగిన నేనేమియుఁ గొణుఁగుటలేదు. గట్టిగానే మాటలాడుచున్నాను. మీకు వినబడకపోతే నేనేమిచేయనని భయములేక చెప్పుచుండును. ముసలితనముచేత నదిచెప్పుమాటలు నాకుసరిగా వినిపించక యేమని యడిగిన నిరుగుపొరుగువారందఱు మేమేమో కయ్యమాడుచున్నామని యింటికి బరుగెత్తుకొనివచ్చు లాగున బిగ్గరగా నూరందఱికి వినిపించులాగున కేకలువేయును. దీనికిఁదోడు దీనిస్నేహితురాండ్రు సుభద్రమొదలైన వాండ్రందఱు నీకెది తగదనిచెప్పక మఱింతప్రోత్సాహము చేయుచున్నారు. బ్రహ్మసమాజమతమని పేరుపెట్టుకొనికొందఱు నాప్రాణములకు పెనుభూతమువలె వారపత్రికలుప్రచురించియు నుపన్యాసములని పేరుపెట్టి దుర్బోధలు చేసియు భార్యలు దమభర్తలు చెప్పుమాటవినకుండఁ జేయుచున్నారు. ఇప్పుడు విధవావివాహములు ప్రబలుటచేత నాకుమఱింతభయముగానుండి నాప్రాణములు నేనఱచేతిలోఁ బెట్టికొని కాలముగడుపుచున్నాను. ఇంతయెందుకు? తుదకు నేనుచిన్నతనమునుండియు నాబిడ్డవలెఁ బెంచిన జానకిగూడ నామాటకెదురుచెప్పుచు నేను వివాహమాడుమని చెప్పిన వానివివాహమాడనని యెదిరించి యయోగ్యుఁడైననాతనితమ్ముని వివాహమాడెదనని నాయెదుట భయమైనను లేకుండ జెప్పుచున్నది. ఆడుపిల్లలను బెద్దలు తమకిష్టమువచ్చిన వానికిచ్చి వివాహము చేయుటకుఁ గూడ వీలులేనికాలమువచ్చినది. ఆడువాండ్రు మనవలెఁ జదువుకొనుటవలన నిట్టియనర్థకములన్నియు సంప్రాప్తమగుచున్నవి.

వీర—ఈవిషయములో మాత్రము నేను మీతో నేకీభవించను. స్త్రీలకు విద్య చెప్పుటచేత లాభమేకాని నష్టమెంతమాత్రమును లేదు. నేనుమీతో మొదటినుండియుఁ గామపాలునికంటె వసుకాముడే బహుయోగ్యుడని చెప్పుచున్నాను. అతఁడు మిగుల దయాంతఃకరణ గలవాఁడు. వీరితండ్రి

యొద్ద నేను చిరకాలము పనిచేసినాను. ఆయన గూడ చిన్నతనములో స్వేచ్ఛగా సంచరించి ధనము పోఁగొట్టుకొని తుదకంత యుత్తముఁడు లేఁడనిపించుకొని కాలముచేసినాఁడు. వసుకాముఁడు గూడఁ బెద్దవాఁడైనతరువాత బహుయోగ్యుఁడుగాఁ బ్రవర్తించును. అతని స్వభావమునుమీరు చక్కఁగాఁ గనిపెట్టనేలేదు.

దామో—వీరభద్రా! నీవుచెప్పుమాట యెంతమాత్రము సరికాదు. వీరితండ్రి చనిపోవునప్పుడు నేనాయనచే వీరిసంరక్షకునిగా నియమింపఁబడినాను. ఆ దినము మొదలిప్పటివఱకు వాండ్రస్వభావములను నేను చక్కఁగాఁ గనిపెట్టుచునేయున్నాను. వాండ్రస్వభావములను నాకంటె నీకెక్కువ తెలియుటకు వీలులేదు. నాకుఁగల ప్రపంచానుభవమును బట్టి నేనెన్నఁడు నేవిషయములోను పొరపడలేదు. కామపాలుఁడు చాలబుద్ధిమంతుఁడు. మనసులో నొకటియుంచుకొని పైకి మఱియొకవిధముగా సంచరించువాఁడుకాఁడు. అతఁడు బహుయదార్థమైన ప్రవర్తనగలవాఁడు. వసుకామునియొద్ద యోగ్యతయన్నమాటే లేదు. వానియొద్ద నొకటైన మంచిగుణము గపడదు. పిత్రార్జిత మొక్కగవ్వయైన లేకుండఁ బాడుచేసినాఁడు. వీండ్రపినతండ్రి విజయవర్మ వాండ్రతండ్రియొక్క యాస్తియంతయు వీరిచేతిలోఁ బెట్టుటవలన నింతయనర్థము సంభవించి వసుకాముఁడు తనయిష్టమువచ్చినట్లు తనయాస్తి పాడుచేయుటకు వీలుకలిగినది. నాస్నేహితుఁడు విజయవర్మకీసంగతి తెలసినయెడలఁ దానుచేసినదానికిఁ దాను తప్పక విచారించును.

వీర—వసుకామునియెడలఁ దామంతకోపముగా నుండుటతగదు. అతఁడు బాగుపడు సమయముగూడ నిప్పుడు తటస్థమయినది. నేనొక వర్తమానమును విని యది తమతోఁ జెప్పుటకే యిక్కడికి వచ్చినాను.

దామో—ఆసంగతి యేమోచెప్పు?

వీర—ఇప్పుడే విజయవర్మగారీగ్రామము వచ్చినారు.



దామో—ఏమిటీ! ఆశ్చర్యముగానున్నది! ఆయనయీనెలలో రాఁడనుకొంటిమే?

వీర—అవును; కాని, యాయన యేందువల్లనో త్వరగానే వచ్చినాఁడు.

దామో—నాకుఁ జాల సంతోషముగానున్నది. నాబాల్యస్నేహితుని జూచుటకు నామనసు మిక్కిలి కుతూహలపడుచున్నది. అతనిని జూచి పదునాలు సంవత్సరములయినది. అయితే, వీరభద్రా! ఆయన వచ్చినసంగతి దనయన్న కొమాళ్ళకుఁ దెలియనీయవద్దని చెప్పినాఁడా యేమి?

వీర—అవును. ఆసంగతి యెంతమాత్రము వాండ్రకుఁ దెలియనీయవద్దని నాతోఁ జెప్పినాఁడు. ఆయన యీగ్రామము వచ్చినట్లు తెలియనీయక దనయన్నకొమాళ్ళ స్వభావములు దాము స్వయముగాఁ బరిశీలించి చూడవలెనని యున్నారు.

దామో—వీరి స్వభావములు వేఱేపరిశీలించవలసిన యవసరమేలేదు. పైకి స్పష్టముగాఁ గనుపించుచునే యున్నవి. అయినను, ఆయన యిష్టమువచ్చినట్లు పరిశీలించి చూచుకొనవచ్చును. అయితే నేను వివాహము చేసుకొన్నసంగతి యాయనకుఁ దెలిసినదా యేమిటి?

వీర—తెలిసినది. ఆయన త్వరలోనే యిక్కడకువచ్చి క్రొత్తపెండ్లికొడుకయిన మిమ్ములనుజూచి యానందింపఁగలఁడు.

దామో—ఆనందము అడిగినట్లేయున్నది. అతనిముఖము చూచుటకే గూడ నాకు సిగ్గుగానున్నది. విజయవర్మ నేనుచేసినదానికి నన్నుఁ జూచినవ్వకమానఁడు. పెద్దతనములో వివాహము చేసికొనఁగూడదనియు, అట్టివివాహములు దూష్యములనియు మేమిద్దరముఁగూడ వాదించి చెప్పుదు నెంతమందిచెప్పినను వివాహము చేసికొనఁ గూడదని మేమిద్దఱము నిశ్చయించుకొన్నాము. అతఁడు మాత్రము వివాహమాడక ఆనాఁటిమాట ప్రకారము సంచరించుచున్నాఁడు. నేనేమా యితనికంటె మారాలోచనగలవాఁడనని వివాహమాడితే

నికష్టములను దెచ్చిపెట్టుకొన్నాఁడను. అతఁడు త్వరగా రావలెను. ఇప్పుడేయతనిరాకకయి నిరీక్షించి తివాచీలు వేయించి సిద్ధముగా నుంటాను. అయితే, వీరభద్రా! మాపద్మావతియు నేనును వివాదపడుచు ననుకూల దాంపత్యముతో లేమని మాత్రము ఆయనతోఁ జెప్పకుమా.

వీర—ఆమాట నేనాయనతో నెంతమాత్రము చెప్పను.

దామో—ఈసంగతి తెలిసినయెడల విజయవర్మ నన్నాక్షేపించి చంపక మానఁడు. ఆతనికేమాత్రము అవకాశము చిక్కినను నేను చేసిన పనికి నవ్వక మానఁడు. నేనును నా భార్యయు మిగుల ననుకూలముగాఁ గాపురము చేయుచు, ఈ వివాహమువలన మేమిద్దఱము భూలోకస్వర్గ మనుభవించుచున్నట్లాతఁ డనుకొనవలెను.

వీర—ఇప్పుడు మీయభిప్రాయము నాకంతయుఁ దెలిసినది. ఆయన యాప్రకారముగా ననుకొనవలెనంటే విజయవర్మగారు మీయింట్లో నున్నంతవఱకు మీ భార్యతో మీరువివాద మాడఁగూడదు.

దామో—నిజమే, యెవరికోసము, నీవు చెప్పినట్లా రెండుగడియలసేపు నెట్లోగట్టుగా నుండెద. కాని నాశక్యమా? అదిగయ్యాళిలాగున కస్సుమని మీఁదఁబడి యెదిరించుచుంటే నేనేలాగున నోపికపట్టియుండఁగలను? దానిచేఁత బడరానిమాటలన్నియుఁ బడి పడి విసికి యున్నాను. అదినన్నెదిరించినప్పుడు నేనూరకుంటే నేనశక్తుఁడనని విజయవర్మనవ్వును. అటుగాక నేనేమయినను నన్నచో నదికయ్యము పెంచక మానదు. అన్నివిధములచేతను నాబ్రతుకు ముందుకుబోయిన గొయ్యి వెనుకబోయిన నుయ్యి యన్నట్లున్నది. వీరభద్రా! ముసలివాఁడు పడుచుదానిని వివాహమాడిన నిదేసుమా యనుభవము. ఎవరుచేసికొనిన దానిఫలము వారనుభవించక తప్పదు. నేనుచేసిన తప్పునకుఁ దగినశిక్ష ననుభవించుచున్నాను. ఇఁకఁ జాలును వివాహ సౌఖ్యమిప్పటికి నాకు బాగుగా బోధపడినది చాలు, చాలు. (అని నిష్క్రమించుచున్నాఁడు)

శ్రీరస్తు

# అపవాదతరంగిణి.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

రంగము:—దామోదరవర్మగారి గృహము.

(దామోదరవర్మయుఁ బద్మావతియుఁ బ్రవేశించుచున్నారు)

దామో—పద్మావతీ! పద్మావతీ! ఈవేషములన్నియు నాదగ్గఱఁ బనికిరావు. నేనిదంతయు సహించి యూరకుండువాఁడను గాను.

పద్మా—మీరు సహించియూరకుండకపోతే యూరకుండకండి, మీయిష్టమువచ్చినట్లు చేసుకోండి. నేను నాయిష్టమువచ్చినట్లుండేదానను గాని మీయిష్టమువచ్చినట్లుండలేను. పల్లెటూరి బీదకుటుంబములోని దాననుగదాయని నన్ను కొని పారవేసినట్లే ఆజ్ఞపెట్టి చంపుచున్నారు. నేనుమాత్ర మొక అమ్మకూ అబ్బకూ పుట్టలేదనుకున్నారా యేమిటి. మన యిరుగుపొరుగు వాళ్ళందఱుఁ దమపెళ్ళాలకుఁ దగినవెల్లాయిచ్చి యెట్లుసుఖపెట్టుచున్నారో చూడండి. మీరు ముసలివారయినా మిమ్ములను పెళ్ళాడినదేగాక నన్నుచంపుకతినడముకూడానా? నన్ను సుఖపెట్టలేక యీలా ఆజ్ఞపెట్టి చంపేనారు నన్నెందుకుఁ బెండ్లిచేసుకొన్నారు?

దామో—సరే! ఇంతేగాదు. పెండ్లిచేసుకొన్న మగనికిఁ బెండ్లాముమీఁద నధికారము ఆజ్ఞకూడా నుండఁగూడదుగా. సరే.

పద్మా—అధికారముకూడనా! ఆలాగున నామీఁద మీరధికారము చెలాయించవలెనంటే నన్ను పెండ్లిచేసుకోవడము మానివేసి పెంచుకోలేకపోయినారా యేమిటి? ఆలామీరు నన్ను పెంచుకొంటే మీకుఁ గూఁతురనై మీయధికారమునకులోబడి యీముసలితనములో మీకు సేవచేస్తూవుందును కాదు?

దా మో — అదిగో! నన్ను ముసలివాఁడననికూడ నాక్షేపించుచున్నావు కాదు. పెనిమిటినని నాయెడల గౌరవము భయమును నెంతమాత్రము లేకుండ నన్ను వెక్కిరించుటగూడనా? సరే! జ్ఞాపకముంచుకో. నీవు నాయధికారమునకు లోఁబడకపోవుట యటుండగా నా యిల్లుకూడా గుల్లచేసి నగలు చీరలు కొని నాడబ్బంతయుఁ బాడుచేయుచున్నావు.

పద్మా — మీయిల్లు నేనేమిగుల్లచేసి మీడబ్బు తగలఁబెట్టడములేదు. ప్రక్కిన యాడవాళ్ళెవ్వరూ నగలు చేయించుకోవడము మానినారేమిటి.

దా మో — మాటకుమాట యెదురు చెప్పతావు కాదు, సరే నీయిష్టము గిష్టము నిక్కడ నెంతమాత్రము పనికిరాదు. నీవేపాలిక్కడ నెంతమాత్రము సాగవు నేను పోనీయని యూర్కొన్నకొద్దీ నెత్తికెక్కుచున్నావు. డబ్బంతయు నీవు కంసాలివాళ్ళపాలు, బట్టలవర్తకుల పాలు చేయుచున్నావు.

పద్మా — దానికి నన్నేమిచేయుమన్నారు. కాసులధర యెక్కువయితే నాదా యేమిటితప్పు. కాసులధర యెక్కువయినదని నేను నగలు మానుకొనుదానను మాత్రముకాను. చేతనైతే బంగారము చవుకగా నమ్మేలాగునగాని మనవూళ్లో బంగారము దొరికేలాగున గాని చెయ్యరాదూ.

దా మో — ఇకచాలు. ఆట్టేమాటలాడక నోరుమూసుకొని యూరుకో. నేను పెండ్లి చేసికొనకమునుపు నీకీనగలుగిగలు నెక్కడివి? అట్టినగలమాట తలపెట్టక యణఁగిపడియుండు.

పద్మా — నేనట్లా యణఁగి పడియుండేదానను గాను. నాయిష్టమువచ్చినట్లు నగలు చేయించియయినా నన్ను సుఖపెట్టనివారు నన్నెందుకుఁ బెండ్లిచేసుకొన్నారు. మీరిట్లాటివారని తెలిసిన మిమ్ములను



పెండ్లాడకనే పోదును. మీరేమో నన్ను పెళ్ళాడి నాకు కావలసినన్ని నగలు పెట్టుతారని మాఅమ్మ నాతో చెప్పుటచేత మిమ్మల్ని పెళ్ళాడినాను గాని మీముఖము మీఅందము చూచి మిమ్మల్ని పెళ్ళాడినా ననుకొన్నారా యేమిటి

దా మో — సరే, బాగుగానేయున్నది. నిన్ను నేను పెండ్లాడకమునుపు నీవు మేలికమ్మె చీర యొకటి కట్టుకొని యొకకత్తిగంటుతో బుజములు కాయలుగాచులాగున చెఱువుకువెళ్ళి నీళ్ళు తెచ్చేదానవు. జ్ఞాపకములేదూ. నీకిప్పుడెక్కడలేని సుకుమారము నాగరికత వచ్చినది.

పద్మా — మీచేత యీతిట్లుతింటూ మీయాజ్ఞలోఁబడి యీపాడుసంసారము చేయుటకంటె నాకదే బాగుగానున్నది. నాయిష్టమువచ్చినట్లుండేదానను.

దా మో — ఇప్పుడు నీయిష్టమూగిష్టమూ యేమీసాగదు. నాయిష్టమేగాని నీయిష్టమెంతమాత్రము పనికిరాదు.

పద్మా — మాయిరుగు పొరుగువాండ్ర యిండ్లకువెళ్ళి కథలుచెప్పుకొంటూ ఆడుకొంటూ వుండేదానను. ఇప్పుడు గుమ్మముదాటి యెదటింటికైన వెళ్ళనియ్యరు. ఇంట్లో పిల్లలకు నీళ్ళుపోసి పాఁడిచేసి తరువాత నాయిష్టమువచ్చినట్లుండేదానను. ఇప్పుడు నాకెక్కడలేని చెఱవచ్చినది.

దా మో — పోనీ! నీపూర్వపుస్థితి నీకింతవట్టుకైనా జ్ఞాపకమున్నది. ఇప్పుడు నీకు బనారసు చీరలు నగలు చిరతింట్లు యివియన్నీ కావలెను. మునుపు నీకివియన్నియు నున్నవా యేమిటి?

పద్మా — మునుపు లేకపోతే లేకపోయినవి. ఇప్పుడుండకూడదని యెక్కడవున్నది.

దా మో — మునుపుస్థితి యింతకంటె నేమిలేదు. నేను నీకేమి యవ

కారము చేసినాను నిన్ను పెండ్లిచేసుకొన్నాను, యింతేనా? నీవు డిప్యూటీకలెక్టరుగారి భార్యవనిపించుకొనుచున్నావు. అదిచాలదూ?

పద్మా—నాకింతకంటె యేమియుపకారము చెయ్యవలెనేమిటి. నన్ను మీరు పెళ్ళిచేసుకొని నాకవకారమే చేసినారుకాని యుపకారమేమి చెయ్యలేదు. డిప్యూటీకలెక్టరుగారి భార్యనైతే నాకేమివచ్చిందేమిటి? ఇంతకంటె——

దామో—సరే, నీయభిప్రాయము తెలిసినది ఈకాపురము చేయుటకంటె ముండామోయుట మంచిదనికాదూ నీయభిప్రాయము.

పద్మా—చాలు! చాలులెండి. అన్నీ మీరే అనుకొంటున్నారు.

దామో—నీపుణ్యము! సంగతి ముందుగానే చెప్పినావు. నేనుచచ్చిపోతే చూడవలెనని యున్నావుకాదూ. సరే, నీయభిప్రాయమిప్పుడు నాకుఁదెలిసినది. ఇఁక నేను జాగ్రతగా నుంటాను. నేనేచిరకాలము జీవించియుంటాను.

పద్మా—అవును, నన్నాడిపోసి చంపుకొని తినడమునకు దేవుడు మీకు ఆయుర్దాయము కూడా యిచ్చినాఁడు. చిరకాలము జీవించియుండి ఆలాగుననే చేతురుగాని లెండి నాకునగలుమాత్రము చేయిస్తూవుండండి.

దామో—ఇప్పుడు నేనామాటే యడుగుచున్నాను. నన్నుఁబెండ్లిచేసుకొనకమునుపు నీకీనగలు గిగలు యెక్కడివి?

పద్మా—సరే మీపెండ్లామునని పేరుపెట్టుకొని మూసివాయనపు ముత్తైదువులాగు నుండమంటారా యేమిటి?

దామో—నన్నుఁ బెండ్లిచేసికొనకపూర్వము నీవు మూసివాయనపు ముత్తైదువలాగునఁగాక మహారాణివలె నున్నావా యేమిటి?

పద్మా—నలుగురిలోను డిప్యూటీకలెక్టరుగారి భార్య ఆలాగున నున్నదంటే మీకేసిగ్గుగా వుంటుంది.



దామో—అదిగో, నాకుసిగ్గనుచున్నావు; నాకుదలవంపులు తేవలెనని నీయభిప్రాయమున్నదికాబోలు?

పద్మా—ఆమాట నిజమే; మిమ్ముఁ బెండ్లిచేసికొన్న తరువాత నాకు సౌఖ్యము మీకుఁ దలవంపులు లేకపోవడము కూడానా? మిమ్ముల బెండ్లిచేసుకొన్నందుకు నాకునాలుగు నగలైనా చేయించండి. నాకు మీతో నీవివాదమెందుకు? వేళయైనది, పాపము సుభద్ర నాకోసము కనిపెట్టుకొనియుండును. అక్కడికి వెళ్ళవలెను.

దామో—అదిగో నీకు స్నేహములుకూడ బలిసినవి. నీవు బహుమంచివాండ్ర స్నేహము సంపాదించినావు.

పద్మా—నన్నంటే యన్నారుగాని వాండ్రనుగూడ ననకండి; బాగుండదు. వాండ్రిందఱు నెంతో గౌరవముగల మంచివాండ్రు.

దామో—నిజమే, వారిగౌరవము మంచితనము నాకంతయుఁ దెలిసేయున్నది. వాండ్రునలుగురు వీథిలో నరుగుమీఁదఁ గూర్చుండి కచ్చేరీచేసి యందఱి నాక్షేపించుచు లేనిపోనిమాటలు చెప్పుకొనుచుందురు. తమకక్కఱలేని సంగతి, వ్యవహారము లేదు.

పద్మా—ఈమాట మఱీబాగున్నది. మనుష్యులను మాట్లాడకుండఁ గూడఁ జేయుదురుకాఁబోలు? ఎవరియిష్టము వచ్చినట్లువాళ్ళు మాట్లాడుకొనుటకు మీసెలవే కావలెనా యేమిటి?

దామో—సరే, బాగుగానేయున్నది వాండ్రు నిన్నుఁగూడ తరీఫీదు చేసి దమమందలోఁ గలుపుకొన్నారు. కాఁబోలును.

పద్మా—అవును, వాండ్రిందఱు నాకు స్నేహితులయినప్పుడు నేనువారిమందలోఁ గలిసినఁగలిసెద. ఆసంగతి మీకెందుకు?

దామో—కలుస్తావు; కలుస్తావు. సిగ్గూబిడియము లేకపోతేసరి. ఈపాడుసహవాసమువలన నీవుమఱీ చెడిపోయినావు.

పద్మా—ఆసిగ్గుబిడియములు మీకుఁగాని నాకవసరము లేదు. పాడుస
హవాసమని యాక్షేపించకండి మేమక్కడఁ జేసెడి యక్రమ
ప్పుఁబనులేమియు లేవు. లోకులతోఁ బాటిగ నందఱిమంచిచేష్టలు చె
ప్పుకొంటాము. మీరువస్తానన్నారుగనుక వచ్చిచూడండి.

చామో—అలాగున నేవచ్చి చూస్తానుగాదు; నన్నుగురించికూడ నేమ
నుకుంటారో వింటాను.

పద్మా—రావలెననియుంటే త్వరగారండి వేళయయినది, నేను వెళ్ళ
వలెను.

(అని వెళ్లుచున్నది.)

చామో—సరే, ఇప్పటికీగోష్యముగూడఁ జెడ్డది. నేనేమోనాయధికా
రమును గనపఱచి నాభార్యను నేను జెప్పినట్లు వినులాగునఁ జేయ
వలయుననుకొని నేనేమాటలుపడ్డాను. ఇంతటితో నూరకుండుట మే
లు; ఇరుగుపొరుగువాండ్రుగూడ విన్ని నవ్వెదరు. కాని పద్మావతి
తెలివికిమాత్రము సంతోషించవలసి యున్నది. ఏమాటాడిన నామా
టకుఁ దడవుకొనకుండ బదులు చెప్పుచున్నది. ఈవివాదమూలను
గానైన నది నాతో మాట్లాడి నాదగ్గరఁ గొంచెముసేపున్నది. అం
తేచాలును. నేనుమాటలాడిన చేవస్త్రమని విసుగుకొనకుండ నింతవ
ఱకైన మాటలాడినది; యిదేచాలును, దానిముఖము చూచిన నే
నన్నియు మఱచిపోదును. నామాట కెంతయెదురుచెప్పినను న
న్నెంతయెదిరించినను నాతోనది కొంచెముమాటలాడిన నంతేచాలు
ను. దానికి నామీఁదఁ బ్రేమ లేకపోయినను నాకుమాత్రము దాని
మీఁద మోహముతగ్గలేదు. అదినన్ననుమాటలు భరించుటకు శక్య
ములేకున్నదిగాని దానితో వివాదపడుచు దానివలన మాట లనిపిం
చుకొనుచునైనను గొంతసేపు దానితో మాటలాడుచు దానిముఖ
ముఁ జూచుచుండవలెనని యున్నది. నాకు దేహదార్ఢ్యము తగ్గ



వయసు ముదిరినకొలఁది నాకుదానిమీఁద మోహము హెచ్చుచున్న
ది. దానికిమాత్రము నామాట పనికిరాకున్నది. ఈవయసులో నేను
స్వేచ్ఛగా సుఖముగా జీవించక దీనిని వివాహముగూడ చేసికొనినాఁ
డను. నిద్రపోవుచున్నప్పు డెప్పుడు గొంతు పిసికిచంపునో యను
భయముచేత నిద్రయు, భోజనములో నేమిగలిపి పెట్టునోయని భో
జనమును గూడ మానియీరీతిగాఁ బడరానికష్టములఁ బడుచున్నా
ను. ఈమధ్య జోస్యులవారి గోపాలము విధవావివాహము చేసుకొ
న్నాదని యెంతోసంతోషముతో చెప్పినప్పటినుంచి నేనయుపశ్రుతి
గాగణించి యిదికూడ నన్నుఁ ద్వరలోఁ గడతేర్చి తిరిగివివాహ
మాడవలెనని యున్నదని నిశ్చయించుకొన్నాను. ఇంతకు నాకన్ని
విధములచేతను కష్టకాలము వచ్చినది. ఈముసలితనములో నాకుప
చారమైనను జేయునని దీనిని వివాహమాడినానుగాని నన్నీవిధము
గాఁ గష్టపెట్టునని కలలోనైనను దలఁచలేదు.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

ద్వితీయరంగము.

రంగము:—సుభద్రమ్మగారి యింటిలోకచావడి.

(సుభద్రమ్మయు, అన్నపూర్ణమ్మయు, నారాయణవర్మయు, చలపతిరా
వును కామపాలుఁడునుఁ బ్రవేశించుచున్నారు)

సుభ—మేమాపద్య మవశ్యము వినవలెను,

కామ—అవును; మీరురచించిన పద్యము మేము వినవలెనని యున్నా
ము, చదువండి,

చల—పోనిత్తురూ! దానికేమి! ఏమోచాటుధారగాఁ జెప్పినాను, అ
దిమీరంతగా వినఁదగినదికాదు,

నారా—నీవట్లుచెప్పవద్దు, చాటుధారగా నంత మంచిపద్యమును ర
చించుట సామాన్యముకాదు. అపద్యమెంతో చక్కఁగానున్నది,

అందలి స్వభావోక్తి చెప్పశక్యముగా లేదు,

చల—పదిదినములక్రిందట మాణిక్యాంబగారు చాటుధారగాఁ గొన్ని పద్యములు చెప్పుమని నన్నడిగినారు, అందుపయుని నేనీపద్యమును రచించి చదివినాఁడను,

(అనియొక వెఱ్ఱిపద్యముఁ జదువుచున్నాఁడు)

నారా—చూచినారా! ఎంత చక్కఁగా నొక నిముషములోఁ బద్యము చేసినాఁడో. ఇతఁడు బహుబుద్ధిమంతుఁడు చాటుధారగా గంటకొకశతకము రచించఁగలఁడు.

కామ—ఇతఁడు కేవలము తిక్కనసోమయాజితో సమానుఁడు. తిక్కనగూడ నిముషమునకొకశతకము చాటుధారగా రచింపఁగలఁడని నేను నమ్మను.

కామ—ఈపద్యమునకే మీరట్లు సెలవిచ్చుచున్నారు. ఇదియొక పద్యమే కాదు. అందువలననే మీయెదుట నీపద్యమును జదువుటకు మొదట సందేహించినాను. నేను రచించిన పద్యములింకను ననేకములు గలవు.

(పద్మావతియుఁ జానకియుఁ బ్రవేశించుచున్నారు)

అన్న—ఈపద్యమును నేను వ్రాసికొని తప్పక పాఠము చేయవలెను.

సుభ—పద్మావతీ! నీపెనిమిటి దామోదరవర్మగారుకూడ వచ్చుచున్నారా?

పద్మా—ఆయనకూడ నిప్పుడే వచ్చెదరని తోఁచుచున్నది.

సుభ—జానకీ! నీవేలాగుననో గనుపించుచున్నావు. మఱియేమియు లేదుగదా! ఇటురా. నీవును గామపాలుఁడును చీట్లాటక యాడుకొనవచ్చును.

జాన—నాకుం జీట్లాట యిష్టములేదు. అయినను మీరాడుమనుచున్నారుగానఁ జేతనైనట్లాడెదను.

పద్మా—(తనలో) దామోదరవర్మగారిక్కడకు రాకపూర్వమే కామపాలుఁడు నాతో రహస్యములన్నియు మాటలాడునని నేనిచ్చటకు వచ్చినాను. అట్లుచేయుటకు మాఱుగా నతఁడు జానకితోఁ జీట్లాడుటకు సిద్ధపడుచున్నాఁడు. సరే; కామపాలుని సంగతియంతయు నిప్పుడు నాకుఁ జక్క-



గా బోధపడినది.

అన్న—మీరనేమాట వినుటకు నాకు మిక్కిలి కష్టముగానున్నది. మీకితరుల నిందించుటయే పనిగానున్నట్లున్నది. నేను రేపటినుండి యిక్కడకు రానని వట్టు పెట్టుకొంటాను.

పద్మా—అన్నపూర్ణమ్మగారూ! మీకెందుకంతకోపము వచ్చినది. ఏమిజరిగినదో చెప్పండి.

అన్న—చూచినావా యీవింత? మనకామేశ్వరి యందకత్తెగాదనియు నది శుద్ధకురూపియనియు ననుచున్నారు.

సుభ—ఆమాట వాస్తవముకాదు. ఒకరంటే దానియందమునకేమిలోపము వచ్చునేమిటి? కామేశ్వరి చాల నందమైనది.

నారా—పోనీ! నీకడుపుచల్లగా నీవైనను జక్కనిదని యొప్పుకొన్నావు.

అన్న—అది యెఱ్ఱగాఁ జక్కగానున్నది. దానివంటిరంగు బంగారమునకె నుండును.

పద్మా—అది స్వభావసిద్ధమైన యందమనుకొన్నారాయేమిటి. ఎక్కడలేని నగలు పెట్టుకొని లేనియందముఁ దెచ్చిపెట్టుకొన్నది.

అన్న—అది పెట్టుకొనే నగలన్నీ దానివేగాని యెరువు తెచ్చి పెట్టుకొనినవిగావు. ఆసంగతి నేను జక్కగా నెఱుఁగుదును.

పద్మా—ఆనగలన్నియు దానివికావని యెవరన్నారు. ఆనగలన్నియు గిల్టునగలుగాని బంగారపునగలు కావు.

చల—ఆమాట నిజమే. ఆమె విస్తారము గిల్టునగలే కొనుచుండును. లేనియందము నగలు పెట్టుకొనినమాత్రమున నెంతమాత్రము రాదు.

అన్న—మీరు మాట్లాడునదంతయు నెంతో వింతగానున్నది. దానికేమిగాని దానియప్ప యింతకంటెను జక్కగానుండెను.

నారా—కామేశ్వరి యక్క నరసమ్మమాట చెప్పుచున్నారాయేమిటి? ఆమెకిప్పుడఱువది సంవత్సరములుంటవి. ఆమెకించుమించుగా మానాయనమ్మ

వయసుండును. ఈవయసులో నామెయందము వేఱె చెప్పనక్కఱలేదు.

అన్న—ఆమెకఱువది సంవత్సరములులేవు. మొన్న యేకాదశినాటికి దానికి నేఁబదియేడో యేఁబదియెనిమిదో సంవత్సరములు. అంతకంటె నెక్కువ లేదు. ఆమెకెంత వయస్సయినను గాయశరీరమగుటచేత నలుబదియేండ్ల దానివలెఁ గనుపించును.

చల—ఆమెను దూరమునుండి చూచినయెడల నాలాగుననే కనిపించును. దగ్గఱగాఁ జూచినయెడల దానిముఖమునిండ నన్నియు ముడుతలే గనుపించును. ఆమె తలగూడఁ జాలభాగము నెఱసినది.

సుభ—పాపమది జబ్బుపడుటచేత మొగమాలాగున ముడుతలు పడిపోయినవి. అది తలనెఱసినట్లు కనుపించకుండుటకుఁ బ్రతిదినము మిక్కిలి శ్రద్ధతోఁ దలకు కాటుక రాయుచుండును. తాను చక్కనిదాన ననిపించుకొనవలెనని సానిమేలుఁగులన్నియుఁ బెట్టుచుండును.

చల—సుభద్రమ్మగారూ! మీరుచెప్పినదంతయు నిజమే కాని యామె సానిమేలుఁగులన్నియుఁ దెచ్చిపెట్టుకొని తనకున్న యందమంతయుఁ గూడఁ జెఱుపుకొనుచున్నది. ఆమె వీధిలోనికి వచ్చునప్పుడు భామవేషమువలె నుండునుగాని యందకత్తెయైనవాండ్రవలెను గనుపించదు.

తారా—నీవుచెప్పినమాట యుచితముగానున్నది. నిశ్చయముగా నామె భామవేషమువలెనే కనిపించును.

అన్న—మీరనేమాటనువింటే నాకుఁగూడా నవ్వువచ్చుచున్నది. మీరుచేసెడి యాక్షేపణలుచూస్తే నాకుఁ గోపముగానున్నది. పోనీ శ్యామలాంబ చక్కనిదంటారా కాదా?

చల—ఆమె ముఖమందముగానే యుండును.

పద్మా—అవును, గాని దానికిఁ గొంచెము మిట్టపళ్లున్నూ చికిలికన్నులున్నూ వున్నవి. అది మాట్లాడేటప్పుడు తనమిట్టపళ్లు గనఁబడకుండ సిగ్గు నగపడుచున్నట్టు నోటికిచెయ్యి యడ్డముపెట్టుకొని మఱిమాట్లాడుచుండును.



అన్న—దేవుఁడు చేసినదానికి మనమాక్షేపింపఁగూడదు. పాపము వస్తుంది. ఒకరిలోపములుచూచి యాక్షేపిస్తే ఆలోపములన్నీ మనకూ వస్తవి.

పద్మా—శ్యామలాంబ కొంతవఱకు నయమే. రంగమ్మకసలే పండ్లులేకపోవుటచేత తన బోసినోరు గనఁబడకుండవలెనని ముసిముసినవ్వులు నవ్వుచు నేమన్నను మాటలాడక యూరకుండును. పదిమాటలకొకమాటైనను జవాబు చెప్పదు.

సుభ—పద్మావతీ! నీవున్న సంగతియంతయు నిజముగా బహుచక్కఁగాఁ జెప్పినావు.

పద్మా—ఉన్నమాటంటే తప్పేమున్నది. లేనిమాటలని నేనెవరిని యాక్షేపించలేదు. ఇదిగో మావారువస్తున్నారు. ఇకమనయిష్టమువచ్చినట్లు మాట్లాడి యానందించుటకు వీలులేదు.

(దామోదరవర్మ ప్రవేశించుచున్నాఁడు.)

దామో—అందఱికీ కుశలమా? (తనలో) ఆహా! అమ్మలక్కలందఱుఁ జేరి కచేరీబహుచక్కఁగాఁ జేయుచున్నారు. ప్రతిమనిషిని యాక్షేపించుచుందురు. వీళ్ళచేత నిందపడనివాఁడును వానకుఁ దడియనివాఁడును లేఁడు.

అన్న—దామోదరవర్మగారూ! తమరు దయచెయ్యడము నాకు బహుసంతోషముగానున్నది. వీండ్రు లోకములో నెవరిని బ్రతుకనియ్యకున్నారు. పద్మావతిగూడ వీండ్రతోఁజేరి వీరిమాటే యాడుచున్నది.

దామో—అన్నపూర్ణమ్మగారూ! మీకట్టి సంభాషణ వినుటకుఁ జాలకష్టముగానే యుండును.

అన్న—లోకములో నెవరినిగూర్చి మంచిమాటాడినను దనసొమ్మంతయుఁ బడిపోయినట్లు సహించకున్నారు. మనమీనాక్షమ్మగారు మంచిదంటేకూడ నొప్పుకొనకున్నారు.ఇంతకన్న విరుద్ధమేమున్నది చెప్పండి.

పద్మా—మీనాక్షమ్మంటే మొన్న రాత్రి కనకమ్మగారింటికివచ్చిన లావుగానున్న తలవెండ్రుకల విధవేకాదూ? కోమటివిధవవలె లావుగా నల్లగానుండును.

అన్న — లావుగాను నల్లగాను ఉన్నంతమాత్రముచేతఁ జెడ్డదగునా? యేమిటి. భగవంతుఁడు దెచ్చిపెట్టిన వికారమునకుఁ బాపమావిడయేమిచేయఁగలదు. అక్కడికి నామె శరీరము తగ్గిపోవుటకనేకప్రయత్నములు చేయుచునేయున్నది. ఆమె శరీరమును దలవెండ్రుకలును జూచి నీవామెనట్లాక్షేపించఁగూడదు.

సుభ — ఆమాట నిజమేకాని నలభైయేండ్ల వెధవముండకుఁ దలవెండ్రుకలేమిచెప్పు?

పద్మా — మీనాక్షమ్మ చాలమంచిదియని చెప్పుకొందురు. మగఁడు పోయినది మొదలురోజుకొకపూటమాత్రమే భోజనముచేయుచు నెలకు బదియేనురోజులేదియో యొకపేరుచెప్పి యుపవాసములు చేయుచుండును. ఈమధ్య నామెకెవ్వరో శరీరముతగ్గిపోవునని చెప్పఁగాఁ బుణ్యము పురుషార్థముఁగూడఁ గలసివచ్చునని యాలోచించి రోజు, నుదయము నిమ్మకాయంత గోమయమును రెండు దోసిళ్ళ యావుపంచితమును గూడఁ బుచ్చుకొనుచున్నదఁట.

అన్న — పోనీలే, నీతల్లి కడుపుచల్లగా నింతమట్టుకైన నామెమంచిదని యొప్పుకొన్నావు.

దామో — అన్నపూర్ణమ్మ సంతోషమడిగినట్లేయున్నది. పద్మావతి మంచిదనుచునే మీనాక్షమ్మను జెడ్డదానినిగా వర్ణించినది.

అన్న — నిజమే. పద్మావతి రంగాచార్యుల గవరమ్మగారివలెనే యందఱి నాక్షేపించుచుండును.

నారా — సిగ్గులేక దనయందమునకు గవరమ్మ యందఱినిగూడ నాక్షేపించవలెనుగాఁ బోలును. ఆమె సొట్టకాలు, బట్టతల, కాయకన్ను ముందఱఁ బ్రపంచమంతయు నందవికారముగాఁ గనుపించుచున్నది కాఁబోలును.

అన్న — గవరమ్మను నీవట్లనవద్దు. అదినాకొక ప్రేలువిడిచిన వదినెగారి మేనమామకూఁతురు. పాపము మశూచికములోఁ గన్నును గాలును బోయిన



నదియేమిచేయఁగలదు. దానికున్న వయసుకు ముప్పదియేండ్లపడుచుదానివలెఁ గనఁబడవలయునని నటించినఁ బాపము దాని బట్టతల దాగదు, దాని నేరమేమున్నది. దానిని మీరట్లాక్షేపించవద్దు.

సుభ — ఈలోపముకేమిగాని అది చక్కఁగానేయుండును. అక్కడికి, పాపము! తనబట్టతలకు, కాయకంటికి నెన్నెన్నో వైద్యములు చేయించుచునే యుండును.

అన్న — అవును. దానికే నగలు, చీరెలు లేకపోయినను నదిచక్కఁగానే కనుపించును. పాపము దానితల్లిదండ్రులు చాల బీదవాండ్రు. దానితండ్రి పురోహితుఁడుగను, తల్లి ముత్తైదువగను దిరిగి జీవించిరి.

చల — మీరిద్దఱింటివఱకైనను గవరమ్మ మంచిదని యొప్పుకొన్నారు. అదికొంతమేలే గదా.

దామో — (తనలో) వీరిద్దఱిమంచితనమును జూచి నీవేసంతోషించవలెను. తమబంధువులనే దామిట్లు దూషించుచున్నారు.

అన్న — నాబంధువులను స్నేహితులను నెవరైన నేమైన నన్న నేనెంతమాత్రమును సహించియూరకుండఁజాలను.

దామో — అవును. నీయోగ్యతలోకమంతయు నెఱిఁగినదే.

చల — ఇవంతయుఁ జూడఁగా మీకు వేదాంతములు బలిసిపోవుచున్నవి. అన్నపూర్ణమ్మగారు నీతులుబోధించుట బహుచక్కఁగా నేయుండును. విశాలాక్షమ్మగారి లాగున నిఁక నీమెకూడ వేదాంతోపదేశములు చేయవచ్చును.

అన్న — చాలు. చాలు. మీయాక్షేపణకేమిలెండి. మీమాటలు వినుటకు నాకసహ్యముగానున్నది. మాపినతల్లికూఁతురు చెల్లమ్మతో స్నేహితుల నాక్షేపించుటమంచిదికాదని నేనెప్పుడు చెప్పుచునేయుందును. అయితే మాచెల్లమ్మ బహుచక్కనిదిసుమండి.

నారా — ఆమె యందము నీవువేఱుగా వర్ణించి చెప్పనవసరములేదు. బోగ

ముదానివలె నెక్కుడలేని యంగములకు నెప్పుడుచూచినను బాధపడు
చునేయుండును.

చల—తనవయసువారుఁ దానింకను జడకూడ వేసికొనును.

దామో—(తనలో) చిరకాలపరిచితురాలగు చల్లమ్మనే వీండ్రిట్లాక్షేపించుచుం
డఁగా నన్యుల నన్నారన్న నాశ్చర్యమేమున్నది.

అన్న—దానికేమి. మీరట్లన్నంతమాత్రముచేతనే నూరకుండను. చెల్లమ్మ—

దామో—అన్నపూర్ణమ్మగారూ; మీపుణ్యము మీరూరకుండండి. చెల్ల
మ్మ నాకుఁగూడ బంధువురాలు. మీరేమైనన్న నీపెద్దమనుష్యులు సహిం
యూరకుండరు. ఇఁక నీదూషణల కంత్యమేయుండదు.

సుభ—దామోదరవర్మగారూ! హాస్యమున కనుకొనుమాటలకు మీకింత కో
పమెందుకు? నవ్వులాటలకెవ్వరినీ యేమియుఁజెప్పుకొననియ్యరుకాఁబోలును.

దామో—ఇతరుల దూషించుటయందు హాస్యమేమున్నది. నవ్వులాటకైనను
నితరులదూషించుట మంచిదికాదు.

పద్మా—ఎవరిని నేమియు ననకుండ మావారు దొరతనమువారితోఁ జెప్పి చట్ట
ములను గూడ నేర్పఱతురు గాఁబోలును.

దామో—అట్టిమాటలవలన నితరులకు హానికలుగునప్పుడు చట్టములు నేర్పఱచ
వలసియే యుండును.

సుభ—కాలయాపన కొఱకు మేమేమో చెప్పుకొనుచుండిన మీకింతకో
పమెందుకు? మంచిచెడ్డలు చెప్పుకొననైన చెప్పుకొననియ్యరు కాఁబోలు
ను. ఇది బహువింతగానున్నది.

దామో—నలుగురాడముండలును జేరి సిగ్గును భిడియమును వదలి ప్రొద్దుపో
వడమునకని పేరుపెట్టి యందఱిని నాక్షేపించుచున్నారు. ఇది బాగుగా
నేయున్నది. మిమ్ముల నాజ్ఞపెట్టుటకు మీకుభర్తలైనను లేకుండ మీకుదై
వము మేలుచేసినాఁడు.

సుభ—మీరాట్టే మాటలాడక యూరకుండండి. కావలిసే సిగ్గును భిడియ



మును మీకేలేదు. అంత సిగ్గును భిడియమును గలవారైతే తమరిక్కడికెం
దుకు దయచేసినారు. మమ్ముల నాజ్ఞపెట్టువాళ్ళులేరని యాక్షేపించుచు
న్నావు. నీవుండి నీభార్యనేమి యాజ్ఞపెట్టుచున్నావో మేమెఱుఁగ
మా యేమిటి?

అన్న—వినినమాటలు చెప్పుకొన్నమాత్రమున మీకంత కోపమువచ్చుట న్యా
యముకాదు.

దామో—వినుటకేమి; ఏవోమాటలెప్పుడును మనచెవులఁ బడుచునేయుండు
ను. ఒకరికిహాని సంభవించునప్పుడు మనమువినిన మాటలైనను నలుగురి
లోఁ జెప్పుట ధర్మముకాదు.

నారా—లేనిమాటలెప్పుడును బుట్టవు. కొంచెముగనో, గొప్పగనో నిజము లే
క యేమాటయుఁ బుట్టదు.

సుభ—ఈవృద్ధపిశాచము మనలను వదలిపెట్టదు. రండి దొడ్డివసారాలోఁ గూ
ర్చుండి చీట్లాడుకొందము.

(ఒకసేవకుఁడు ప్రవేశించి దామోదరవర్మ చెవిలో నేమో చెప్పుచున్నాడు)

దామో—నేనువచ్చి యిప్పుడే వారినిఁ గలిసికొందునని వారితోఁ జెప్పుము.

(సేవకుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

దామో—(తనలో) వీండ్రకుఁ గనుపించకుండ నెమ్మదిగా వెళ్ళెదను.

సుభ—దామోదరవర్మగారూ! మమ్ములను వదలి యప్పుడే వెళ్లుచున్నారా?

దామో—నాకుఁ జాలఁ బనులున్నవి; నేనిప్పుడు వేగముగా వెళ్ళవలెను.
మీకు నేను లేకుండుటయే మంచిది; మీయిష్టము వచ్చినట్లు నన్నుఁగూర్చి
కూడ మాటలాడుకొనవచ్చును.

చల—ఆమాట వాస్తవమే. పద్మావతీ! నీపెనిమిటి చాల వింతమనిషివలెఁ గ
నుపించుచున్నాఁడు. పెనిమిటియని కోపము వచ్చునసిగాని యతనినిగూర్చి
చాల చిత్రకథలున్నవి. కావలసినయెడల నవియన్నియు జెప్పెదను. బ
హువినోదముగానుండును.

పద్మా—నాభర్తయని నాకెప్పుడును గోపములేదు. ఆయననుగూర్చి నాకంటె మీకెక్కువ తెలియుటకు వీలులేదు. అయినను మీరు చెప్పుమాటలేమో చెప్పండి.

(కామపాలుఁడును జానకియుఁ దప్ప నందఱును నిష్క్రమించుచున్నారు)

కామ—జానకీ! ఇప్పుడు వీరాడుమాటలు వినుటకు నీకిష్టము లేనటులున్నది.

జాన—నాకామాటలు వినుటకిష్టముగూడ నెట్లుపుట్టును? హాస్యమునకైన నితరుల దూషించుట తప్పు. భగవంతుఁడు నాకిట్టిమాటలు చెవిని బడకుండఁ జేసిన నంతియచాలును.

కామ—వీండ్రకెవరితోను, ఏవిధమయిన విరోధమును లేకయే యిట్లు దూషించుచుందురు సుమా.

జాన— అందులకే వీరాడుమాటలు వినుటకు నాకసహ్యముగానుండును. యుక్తాయుక్తముల నాలోచించక దమమాటలవలన నితరులకుఁ గలుగు నష్టములవైనఁ బాటించక నోటికి వచ్చినట్లెల్లఁ బ్రేలుచుందురు.

కామ—ఆమాటవాస్తవమే. ఇతరులమనసు మన మనసువలెనే బాధపడునని గ్రహించి నేనెన్నఁడును విరోధమున్నను నితరులఁగూర్చి పరుషవాక్యములను బలుకను. జానకీ! యితరులయందంత దయాంతఃకరణ గలదానవు నాయెడలమాత్రమే నీవంత నిర్దయతఁ గనుపించవలయునా? మీయెడలఁగల మోహముచే నేనిట్లు కృశించి కష్టపడవలసినదేనా?

జానకి—తిరిగిమీరాసంగతి నాదగ్గరఁదలపెట్టి నన్నాయాసపెట్టవద్దు.

కామ—జానకీ! నీవువన్నివిధముగా నిరాకరించవద్దు. అయోగ్యుఁడగు నావసుకామునికొఱకు మీపినతండ్రి దామోదరవర్మగారి మాటకుఁగూడ నడుగుదాటుచున్నావు. నీకదిన్యాయముకాదు.

జానకి—నన్నిఁక మీరు బాధపెట్టవద్దు. నాయందుఁ గరుణించి మీకీవిషయమయి నన్నడుగవద్దు. నాహృదయమును నేను ద్రవ్యమునకు విక్రయించుకొనుదానను గాను. వసుకాముని గూర్చి నాయభిప్రాయమేమైనను నయో



గ్యుఁడని మీసోదరునే మీరట్లు దూషించుటమాత్రముతగదు. అయోగ్యుఁడైనను ధనహీనుఁడైనను నేనతనినే ప్రేమించుచున్నాను.

కామ—నీవట్లనవద్దు. జానకీ నీవంతకోపముతో నన్ను విడిచిపోవుట న్యాయముకాదు.

(అని జానకిచేయిపట్టుకొనియాపుచున్నాఁడు.)

(వెనుకనుండిపద్మావతి ప్రవేసించుచున్నది.)

(తనలో) దైవమా! ఇదంతయు పద్మావతి చూచినది కాఁబోలును. నేనేమని పద్మావతితో బొంకుదును? (జానకితో బిగ్గరగా) వద్దు—నీపుణ్యము వద్దు—పద్మావతియందునాకు విశేషగౌరవమేగాని———

జానకి—పద్మావతియందా—ఏమిటి?

కామ—ఈసంగతి దామోదరవర్మగారికి దెలియుననినాకుభయముగానున్నది.

పద్మా—(ముందుకువచ్చి) ఇదంతాయేమిటి! కామపాలుఁడు జానకినిఁజూచి నన్నునుకొనెనుగాఁబోలును. అమ్మాయీ!జానకీ! నిన్నుఁ బిలుచుచున్నారు. దొడ్డివసారాలోనికి వెళ్ళుము.

జానకి—(నిష్క్రమించుచున్నది)

పద్మా—కామపాలా! ఈసంగతియంతయుఁ నేమోనిజముగా నాతోఁ జెప్పుము.

కామ—నీయెడలనాకుఁగల గౌరవమునకును, అభిమానమునకును గలరహస్యకారణము జానకి యెట్లో గ్రహించినది. ఈసంగతి దామోదరవర్మగారితోఁ జెప్పవద్దని జానకిని నేను బ్రతిమాలుకొనుచున్నాఁడను.

పద్మా—బహుచక్కఁగానున్నది.. నీవు బ్రతిమాలుకొనుట బహువింతగానున్నది. నీవు బ్రతిమాలుకొనునప్పుడు చెయ్యిపట్టుకొని లాగుచుందువు కాఁబోలును.

కామ—అదిపిల్లగనుక దానిచేయిపట్టుకొనిన మాత్రమున తప్పులేదని చేయిపట్టుకొని బ్రతిమాలితినేకాని మఱియేమియులేదు.. అయితే పద్మావతీ! నన్నుఁగూర్చి నీకుఁగల యభిప్రాయము చెప్పెదనంటివి.. ఆసంగతి యెప్పుడు చెప్పెదవు?

పద్మా—దానికేమి ; నేనట్లూరికేచెప్పినాను. నాకు నీయెడల మఱియొక యభిప్రాయమెప్పుడును లేదు.

కామ—ఇంతేనా ? నాయందునీకు గనబఱచిన ప్రేమయంతయునబద్ధమేనా!

పద్మా—అబద్ధముకాక నిజమనుకొంటివాయేమి ? నీగుణము చక్కఁగాఁ గని పెట్టవలెనని నేనట్లు నటించితినే గాని మఱియొకటికాదు. దామోదర వర్మ గారునన్నెంత బాధించుచున్నను నాకుమాత్రమాయనయెడల——

కామ—నీవుపగదీర్చుకొనుటకు నేను చెప్పినదొక్కటే యుపాయము. కాని పద్మావతీ! నీశాంతస్వభావము చూచిన నాకెంతో యాశ్చర్యముగానున్నది. నీవంటి యోగ్యురాలగు భార్యకు దామోదరవర్మవంటివాఁడు భర్తగా దొరకుటయు నతఁడు నిన్నీవిధముగా బాధించుచుండుటయు నాకుమిక్కిలి సంతాపకరముగా నున్నదిసుమా ?

పద్మా—ఈశ్లాఘనలకేమిలే. నీసంగతియంతయుఁ నాకుఁ జక్కఁగాఁ దెలిసినది. నీతో మాటలాడఁగూడదు. వాళ్ళచటఁ గనిపెట్టుకొనియుందురు ; అక్కడకు వెళ్లుదమురా.

కామ—మనమిద్దఱముఁ గలసి వెళ్ళుట బాగుగానుండదు.

పద్మా—అయితే, నీయిష్టము. నీవిక్కడఁ గూర్చున్నమాత్రమునఁ బ్రయోజనములేదు. నీచేత బ్రతిమాలించుకొనుటకు జానకిమాత్రమిక్కడికింక రాదు.

(అని నిష్క్రమించుచున్నది)

కామ—నాకిప్పు డెక్కడలేని చిక్కువచ్చినది. నాకిప్పుడు పచ్చివెలగకాయ గొంతుకఁబడ్డట్టున్నది. ఏమిచేయుటకుఁగూడ నాకుఁదోఁచకున్నది. జానకిని వివాహమాడుటకు మాత్రమే పద్మావతి సహాయమునుఁ గోరి యామెయందులేని మోహమును గనపఱచి యామిథ్యామోహముచే నాకార్యమును గొనసాగించుకొనఁదలఁచితినిగాని మఱియొకటికాదు. పద్మావతికిమాత్రము నాయందు నిజమైన ప్రేమపుట్టినది. లేనిపోనివేషములు వేసి మంచివాఁడననిపించుకొని పరులను వంచించి జానకిని వివాహమాడుటకుఁ బడ



రానిపాట్లన్నియుఁ బడినాఁడను. పద్మావతికిని దామోదరవర్మకును విరోధముఁ గల్పించి పద్మావతిచే నాకార్యమున కనుకూలమగు పనులెల్లఁ జేయింపఁదలఁచినాఁడను. న్యాయమార్గమువదలి తంత్రములవలననేమో నాకార్యమును గొనసాగించుకొననెంచి సుభద్రమ్మతోఁ గలసి యయోగ్యకార్యముల నెన్నియో చేసినాఁడను. ఇప్పుడు నారహస్యమంతయుఁ బయలుపడినది. ఇప్పుడు నేనుపడుబాధ దైవమునకె తెలియును. నాకార్యభంగమగుటయుండఁగా నాదొంగతనమంతయుఁ గూడ బయలుపడునని భయపడుకాలము వచ్చినది. ఇప్పటికైనఁ బశ్చాత్తాపముఁ దెచ్చుకొనుటకు నాకాశ వదలలేదు. ఆశనన్నొకవంక నే నిదివఱకుఁ బోవుచుండిన మార్గమునకే నాచేయిఁ బట్టి లాగుచుండఁగా నాదొంగతనము బయలుపడినదను భయముచేతఁ గాళ్ళాడక యేమిచేయుటకుఁగూడఁ దోఁచకున్నాఁడను.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

## తృతీయరంగము.

రంగము—దామోదరవర్మగారి గృహమునందలి చావడి.

(విజయవర్మయు, వీరభద్రుఁడునుఁ బ్రవేశించుచున్నారు)

విజ—ఆహా! హా! ఔరా, నాస్నేహితుఁడు వివాహము చేసికొనెనుగా——పల్లెటూరి యొకచిన్నపిల్లనా వివాహము చేసుకొనెను? ఇంతకాలమువఱకు నెవ్వరుచెప్పినను వివాహమాడక తుదకీముసలితనములో శరీరపటుత్వమంతయుఁ దప్పిపోయినతరువాత వివాహమాడెనుగా ?

వీర—విజయవర్మగారూ! మీరాయనను వివాహమాడితిరాయని మాత్రమాక్షేపించవద్దు. ఆయన వివాహమాడి యాఱుమాసములకంటె నెక్కువకాలము కాకపోయినను నింతత్వరలోనే ఆయన వివాహమువలని నష్టములన్నియు ననుభవించుచుఁ దనవయసులో వివాహము చేసికొనినందులకుఁ దన్నుఁదానే దూషించుకొనుచున్నాఁడు సుమండీ!

విజ—తానుచేసిన దానిఫలముఁ దానిప్పుడే యనుభవించుచుండెనుగదా ? హా

పము దామోదరునకుఁ బెద్దకాలములో నెంతకష్టము సంప్రాప్తమైనది? శ
రీరపటుత్వముతోపాటు మనోదార్ఢ్యముగూడఁ దఱిగి ముసలితనములో ని
ట్టి వెఱ్ఱిపని చేసినాఁడు. తనకుఁ గష్టకాలము వచ్చినదిగనుకనే యీవయ
సులో నిట్టిదుర్బుద్ధి పుట్టినది. అతఁడు వసుకామునియందంత కోపముతోను
న్నాఁడుగా! అతని ముఖమైనఁ జూచుట మానివేసినాఁడుగదా?

వీర—ఆయనకు వసుకామునియందుఁగల కోపము నేనింతింతని చెప్పఁజాలను.
అతనిపేరు విన్నంతమాత్రముననే మండిపడుచున్నాఁడు. దీనికిఁ దోడు
గొందఱుదుర్మార్గులు చేరి దామోదరవర్మ భార్య పద్మావతితో వసుకాముని
కేమో సంబంధమున్నదని యొక యపవాదకల్పించి ఆయనకుఁ దెలియున
ట్లు ప్రచురించిరి. తానీవార్ధక్యదశలోఁజిన్నపిల్లను వివాహము చేసికొని
యుండుటచే నెవ్వరేయపవాదలాడినను నిజమని నమ్ముచున్నాఁడు. ఈసం
గతి దామోదరవర్మకుఁ దెలిసినప్పటినుండియు వసుకామునియందు మఱిం
తకోపము గలిగి యాతనితో మాటలాడుటగూడ బొత్తుగా మానివేసినాఁ
డు. పద్మావతికిని గామపాలునకును సంబంధమున్నదన్నచో నమ్మనైన నర్హ
ముగా నుండునుగాని వసుకామునికట్టి సంబంధమున్నదన్నచో నెంతమాత్ర
ము నమ్మఁదగదు. ఇది కేవలము దుర్మార్గులు కల్పించి ప్రచురించిన యపవా
దగాని మఱియొకటికాదు. దుర్మార్గుఁడును, గుచ్ఛితుఁడును నగు కామపాలు
ని యోగ్యుఁడనియు సన్మార్గుఁడగు వసుకాముని నయోగ్యుఁడనియుఁ దలఁ
చి లేనిపోనియనుమానములఁబడుచు నెక్కుడలేని బాధపడుచున్నాఁడు.

విజ—అవును; కాలయాపనకని పనిలేక నోటికివచ్చినట్లు ప్రేలుచు లేనిమాట
లను గల్పించి చెప్పువాండ్రు మగవారిలోను, నాఁడువారిలోనుగూడఁ గల
రు. వయసులోనున్న మగవాఁడుగాని యాఁడుదిగాని యట్టిదుర్మార్గుల కం
డ్లఁబడుటతప్పు; వెనుకను ముందును నాలోచింపక యెన్నినిందలనైన నా
రోపించి చెడువాడుకలు వేయుచుందురు. కాని వసుకామునిఁగూర్చి యట్టి
యపవాదలు విని నేనాతనియెడల మఱియొకవిధముగా నుండను. అతఁ



డు నీచప్రవర్తన లేనివాఁడయి మోసవృత్తియందుఁ బ్రవేశించకపోయిన
చోఁ దానెంత ధననష్టము గలుగఁజేయుచున్నను నేనతని నాదరించుచునే
యుందును.

వీర—నామాటనమ్మండి. అతనియందు నీచత్వముగాని మోసవృత్తిగాని యెం
తమాత్రమును లేదు. అతనిని బరీక్షించి చూచినచో నాతని స్వభావము
మీకే బోధపడును. మీరిప్పుడు సెలవిచ్చినమాటలవలన నాకెంతో సంతో
షముగానున్నది. స్వర్గస్థుఁడైన నాయజమానుని కొమారుఁడు వసుకా
మునకు మీరొకరీప్రపంచములో నాధారముగానున్నారు; యింతేచాలును.

విజ—వీరభద్రా! చిన్నతనములో నతనివయసులో నేనును నతనితండ్రియుఁ
గూడ నెట్లుంటిమో నేను మఱచిపోతిననుకొంటివా? పిన్నవయసులో నె
ట్లుప్రవర్తించినను, దరువాత నీయజమానుఁడెంత యోగ్యుఁడనిపించుకొనె
నో నీవెఱుఁగవా? కాఁబట్టి వసుకామునియందిప్పుడు పరులారోపించు దో
షములాతని యౌవనకారణములవలనఁ గలిగినదిగాని మఱియొకటికాదు.

వీర—తామిప్పుడు సెలవిచ్చిన మాటలవలన వసుకాముఁడు తనతండ్రి గౌరవ
ము నింకను గాపాడగలఁడను ధైర్యమున్నది. అదిగో! దామోదరవర్మగా
రు వచ్చుచున్నారు!

విజ—ఏమీ! హాశ్చర్యముగానున్నదే! ఆయనకీవివాహముతోఁ బడుచుద
నముగూడ వచ్చినట్లున్నదే! ఆయనముఖముచూడఁగా మునుపటిచర్యలన్ని
యు మాఱిపోయినట్లగపడుచున్నవి. ఆమధుర తలరుమాలు, ఆపెనిమీస
ము, ఆకత్తిరింపుకోటు, తిరుచునాపల్లిజోడు చూడఁగా వింతగానున్నది.
పూర్వమాయన తెల్లపాగాయొకటి చుట్టుకొని బొందుల అంగరఖా వేసికొ
ని చెప్పులజోడు దొడుగుకొని కచ్చేరీకి వెళ్లుచుండెడివాఁడు. మునుపు మీ
సముంచుకొనిన వానిఁజూచినను గిరజాలుంచుకొన్నవానినిఁ జూచినను గో
పపడి యామీసములును, గిరజాలును దీయించువఱకును నిద్రపోయెడివాఁ
డుకాఁడు. ఇప్పుడాయన తన జుట్టుచుట్టు పిల్లలనుబెంచి మీసముగూడ

నొంచుచున్నాఁడు. పూర్వమువలె విభూతియు, గంధాక్షతలును మాని యగురుచుక్క పెట్టుకొనుచుఁ గన్నులకు వైద్యమని పేరుపెట్టి కాటుకగూడఁ బెట్టుచున్నాఁడు. చూచినవానినెల్ల నాక్షేపించు నీతనికిప్పుడు దానే యాక్షేపణలఁబడి హాస్యములకుఁ బాత్రుఁడైనాడు. ఈవివాహముతోనే యీయన కెక్కుడలేనిపోకలు వచ్చినవి.

(దామోదరవర్మ ప్రవేశించుచున్నాఁడు)

దామో—నాప్రియస్నేహితుఁడు విజయవర్మా! నిన్నుఁ జూచుటవలన నామన సెంతో సంతోషము నొందుచున్నది. నీవెప్పుడువచ్చినావు?

విజ—దామోదరా! నీవు క్షేమముగనున్నావా? నిన్నుఁ జూచి చాలకాలము యినది.

దామో—అవును; మనమిద్దఱముఁ గలసికొని చాలకాలమైనది. పమ్మైదుసంవత్సరములయినదికాదు? విజయవర్మా! నిన్నెంతకాలమునకుఁ జూచితినోయీ!

విజ—దామోదరా! నీవు వివాహము చేసికొంటివని విన్నాను. అవును పాపము నీవేమిచేయఁగలవు. నీకన్నియుఁ గష్టములు సంప్రాప్తమైనవి. నీవు సుఖముగా నుండుటయే నాకుఁ గావలసినది.

దామో—ఏమో, వివాహము చేసుకొన్నాను. నాజాతకమునుబట్టి సంతాన ప్రాప్తిగలదని నన్నందఱుఁ బ్రేరేపించుటచే నిజమనినమ్మి నేనీపనిచేసినాను. సుఖమునకేమిలే—ఆసంగతి యిప్పుడెందుకు?

విజ—అవును, ఆసంగతులిప్పుడెందుకు? బాల్యస్నేహితులు చిరకాలమునకుఁ గలిసికొనినప్పుడు గృహచ్ఛిద్రములఁ గూర్చి మాటలాడఁగూడదు.

వీర—(విజయవర్మ చెవిలో) మీరాతని వివాహమునుగూర్చి యిప్పుడు తలపెట్టవద్దు.

విజ—ఓయీ! నాయన్నకొమాళ్ళలో నొకఁడు దుర్మార్గప్రవర్తనుఁడై తనధనమంతయుఁ బోఁగొట్టుకొనెనఁట, నిజమేనా? వానిసంగతి వినిన నాకుఁ జాల విచారముగానున్నది?



దామో—అతనిసంగతి నన్నేమని యడిగెదవు. అతఁడు నిర్భాగ్యుఁడయి పొత్తుగాఁ జెడిపోయినాఁడు. వానిసంగతి వినిన నీకు విచారకరముగా నుండుటాశ్చర్యముకాదు. కాని వానియన్న కామపాలుఁడు బహుయోగ్యముగా సంచరించుచున్నాఁడు. పోనిమ్ము. ఇద్దఱిలో నొక్కఁడైన నక్కఱకువచ్చును. ఈగ్రామములో నందఱుఁ గామపాలునిఁ జూచి మిక్కిలి గౌరవింతురు.

విజ—దానికేమిలే. గ్రామములో నందఱు గౌరవింతురన్నమాత్రమున నేను సంతోషించను. దొంగవేషములు వేసికొని లేనియోగ్యతఁ దెచ్చిపెట్టుకొని నటించెడివారికేగాని యిట్టిగౌరవముండదు. కామపాలునందఱు గౌరవింతురనఁగా నతఁడు యోగ్యులకు నయోగ్యులకుఁ గూడ నణఁగియుండునని యర్థము. అందులో విశేషమేమున్నది?

దామో—చాలు. చాలు. కామపాలునకందఱుస్నేహితులని దానియర్థము. అతఁడు యోగ్యుఁడగుటచే నతని కెవ్వరును విరోధులులేరు; అతనినందఱు గౌరవింతురు.

విజ—కామపాలునియందట్టి గౌరవమున కాతనియందేమి సుగుణములున్నవి?

దామో—కామపాలునంత గౌరవపాత్రుఁడింకొకఁడులేఁడు. ఇన్నిమాటలెందుకు? నీవు స్వయముగా నాతనిఁజూచిన నాతనిస్వభావము నీకేబోధపడును. అతఁడు మాటలాడునప్పుడు నీతులు గురియుచుండును.

విజ—ఈనీతులకేమిలే. మాటలలో నెన్నినీతులనైనను జెప్పవచ్చును. ఎక్కుడలేని నీతులను జెప్పుచు నతివినయముగా సంచరించువాండ్రను జూచిన నాకెక్కుడలేని యనుమానమును బుట్టును. నేనిట్లంటినని నీవు మఱియొకలాగునఁ దలఁచవద్దు. వసుకాముఁడు యోగ్యుఁడని నాయభిప్రాయముకాదు. వీరిద్దఱిస్వభావములను బరీక్షించుటకు వీరభద్రుఁడును నేనును నొకయుపాయ మాలోచించితిమి. ఆవిధముగాఁ బరీక్షించి వారి యంతరంగములను బక్కాగాఁ గనిపెట్టఁదలఁచుకొన్నాము.

వీర—అట్లుపరీక్షించినతరువాత వారి నిజమైనస్వభావములు దామోదరవర్మ గారికే విశదము కాఁగలవు.

దామో—కామపాలుఁడు యోగ్యుఁడనిపించుకొనకపోయినచో నాప్రాణము లు ధావవోసెదను.

విజ—సరే. ఆసంగతి యిప్పుడెందుకు? దాహమగుచున్నది. కొంచెము మంచినీళ్ళు తెప్పింపు. తరువాత మేమాలోచించిన యుపాయ మేమో చెప్పెదను.

దామో—ఆలాగుననే కానిమ్ము. ఆయుపాయమేమో వినెదను.

విజ—దామోదరా! స్వర్గస్థుఁడైన నీపూర్వస్నేహితుని కుమారునియందు నీవింతనిర్దయబుద్ధితోఁ బ్రవర్తించుట యుచితముకాదు. చిన్నతనములో నందఱు నట్లే సంచరింతురు. అది యాతని వయసుతప్పుగాని యతనితప్పు కాదు. పెద్దవాడయిన తరువాత నతఁడే యోగ్యుఁడనిపించుకొనును. ప్రపంచానుభవములేని పిన్నవయసులో నాతనినడువడిని గూర్చిమనమంత కఠినముగా నాలోచింపఁగూడదు. చిన్నతనములో నెక్కడలేని నీతులు బోధించుచు యోగ్యులనిపించుకొనినవాండ్రు ముందెక్కడలేని దౌష్ట్యమును నేర్చుకొని భ్రష్టులనిపించుకొందురు.

(అని నిష్క్రమించుచున్నారు)



శ్రీరస్తు

# అపవాదతరంగిణి.

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

రంగము:—దామోదరవర్మగారి యింట నొకగది.

(దామోదరవర్మయు, విజయవర్మయు, వీరభద్రుఁడును బ్రవేశించుచున్నారు)

దామో—సరే, ముందుగా నతనిఁజూచినతరువాత భోజనమునకు వెళ్ళుదము. వీరభద్రా! యిందులో నీయభిప్రాయమేమియో నాకుఁ దెలియకున్నది. నీవిప్పుడు చెప్పినట్లు చేయుటవలనఁ బ్రయోజనమేమున్నది?

వీర—ఇప్పుడు నేనుచెప్పిన పురుషోత్తమరావు వీండ్రకుఁ దల్లివైపున సమీపబంధువు. ఇతఁడు కొంతకాలము కాకినాడలో వర్తకముచేసి యిప్పుడుధనహీనుఁడయిదరిద్రత ననుభవించుచుఁ బడరాని కష్టములఁ బడుచున్నాఁడు. ఋణదాతలీతనిఁ దమఋణమునకయి కారాగృహమునసుంచిరి. ఇతఁడుతనకాపద్బాంధవులని వీరినెంచి తనదుస్థితిని గూర్చి వ్రాసివీరిసహాయమును గోరినాఁడు. కామపాలుఁడు తానిప్పుడు సాహాయ్యముచేయుస్థితిలో లేననియు, ముందుగావలసిన సాహాయ్యమంతయుఁ జేయుటకు సిద్ధముగానున్నాననియు, నతని దుస్థితికి మిక్కిలిచింతించుచున్నాననియుఁ దియ్యని మాటలను జెప్పి యేమియు సాహాయ్యముఁ జేయకుండెను. వసుకాముఁడు మాత్రమిట్లు మిథ్యావచనములను జెప్పక తనశక్తి వంచనలేకుండఁ దగు సహాయముఁజేసి యిప్పుడు దానపేక్షించుచున్న ఋణములోకొంత భాగ మతనికీయనున్నాఁడు.

విజ—వీరిపరోపకారబుద్ధికి సంతోషముగానున్నది. ఇతఁడు నిశ్చయముగా నాయన్నకొమారుఁడనుటకుఁ దగినవాఁడు.

దామో—అయితే, విజయవర్మగారిప్పుడు స్వయముగా వీరస్వభావములను దె
లిసికొనుటయెట్లు?

వీర—ఇందులోఁ గష్టమేమున్నది? కామపాలునితోడను, వసుకామునితోడ
ను బురుషోత్తమరావు జామీనుమీఁదఁ గారాగృహవిముక్తుఁడై తమ సా
హాయ్యమపేక్షించి స్వయముగా నీగ్రామము వచ్చెనని నేను చెప్పఁగలను.
వీరిరువురును బురుషోత్తమరావు నిదివఱకుఁ జూచియుండకపోవుటచే విజ
యవర్మగారు పురుషోత్తమరావువేషము వేసికొని స్వయముగా వీరిద్దఱిప
రోపకారస్వభావమును జక్కఁగాఁ దెలిసికొనవచ్చును. నామాటనమ్ముఁడి
వసుకాముఁడెంతదుర్వ్యసనలోలుఁడుగాఁ గనుపించుచున్నను దుదకాతఁడే
నిజమయిన పరోపకారబుద్ధి గలవాఁడుగాఁ గనుపించును.

దామో—దానికేమి. తనదగ్గరనొకదమ్మిడియయిన లేనప్పుడు వాఁడెంతధా
ర్మికుఁడుగా నుండిననేమిలాభము? మీయిష్టమువచ్చినట్లు వీరిస్వభావ
ముల నాలాగుననే పరీక్షించి చూడండి. అయితే వసుకామునిసంగతి యం
తయుఁ బూర్ణముగా దెలిసినవానినొకనిఁ దీసికొనివచ్చి విజయవర్మగారి
కి వసుకామునిగూర్చి యంతయుఁ దెలియజేతు నంటివే, అతఁడేడి?

వీర—ఇదిగో నాతఁడు వీధిలో నరుగుమీఁదఁ గూర్చున్నాఁడు. వసుకాముని
వ్యవహారములనుగూర్చి యతనికంటెఁ జక్కఁగాఁ దెలిసినవాఁడు మఱియొ
కఁడు లేఁడు. అతఁడే విజయవర్మగారితో నన్నిసంగతులు మనవిచేయు
ను. విజయవర్మగారూ! ఇతఁడు స్నేహపాత్రుఁడు. విశ్వాసముగల నమ్మ
కమైన యొకకోమటి. ఇతఁడు దనశక్తివంచనలేకుండ వసుకామునివ్యవహార
ములఁ జక్కఁబఱచి యాతనిమంచిమార్గమునకుఁ దేవలెనని పాటుపడినాఁడు.

దామో—అయితే నాతని లోపలికిఁ దీసికొనిరా. వసుకాముని సంగతియంత
యు నతని నడిగి తెలిసికొందము.

వీర—వీధిలో నరుగుమీఁదఁ గూర్చున్న ధనగుప్తుని లోపలికిఁ దీసికొనిరా (అని
సేవకునితోఁ జెప్పుచున్నాఁడు)



దామో—ఈధనగుప్తుఁడు మాత్రము యథార్థమునే చెప్పునని నీకేమినమ్మకమున్నది.

వీర—ఇతఁడిదివఱకు వసుకామునకిచ్చిన ఋణము విజయవర్మగారు తీర్చని
యెడలఁ దాను ధనము రాఁబట్టుకొనుమార్గ మేమియు లేదని నేనాతని
తో నిదివఱకే చెప్పియున్నాను. విజయవర్మగారిప్పుడీగ్రామము వచ్చి
నారని యతఁడెఱుఁగును. తానిచ్చిన ఋణము రాఁబట్టుకొననున్నవాఁడు
గాన నిప్పుడు యథార్థమునే చెప్పునుగాని యబద్ధమాడఁడు. ఇంతేగాక
కరటకాచారియను మఱియొకసాక్షిగూడ దొఱికినాఁడు. అతఁడాకాశరా
మన్న పేరుపెట్టి మారుదస్తూరీతో నుత్తరములను వ్రాయుచుండఁగా నే
నాతనిఁ బట్టుకొన్నాను. పద్మావతినిగూర్చియు వసుకామునిఁ గూర్చియు
మీకిదివఱకుఁ గలిగిన యనుమానముగూడ నిర్మూలముగాఁబోవును.

దామో—నేనిదివఱకే యిందువిషయమయి కొంతవిన్నాఁడను.

(ధనగుప్తుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వీర—ఇదిగో! ధనగుప్తుఁడు ఇతఁడు బహున్యాయమైన ప్రవర్తనగలవాఁడు.
ఈయనే విజయవర్మగారు. ఇటువచ్చికూర్చో.

విజ—ధనగుప్తా! ఈమధ్య నీవు మాయన్నకొమారుఁడు వసుకామునకుఁ గొం
తఋణమిచ్చినావఁట నిజమేనా?

ధన—అవును నేనాయనకుఁ గొంతఋణమిచ్చినాను. నాశక్తివంచనలేకుండ
వసుకాముని యాస్తి కాపాడవలెనని ప్రయత్నించినాను. అదివఱకే తన
యాస్తి యంతయుఁ జెడిపోవుటచే నేనెంత తోడుపడినను నేమియుఁ
బ్రయోజనము లేకపోయినది.

విజ—అవును, పాపము నీవుమాత్ర మేమిచేయఁగలవు. నీస్నేహలాభమును వి
శ్వాసమును నగపఱచుటకు నీకు వీలులేకపోయినది.

ధన—నాకెంతమాత్రమును వీలుదొఱకినది కాదు. అతని ఋణమాతని యాస్తి
కంటె మించకపూర్వమాతని వ్యవహారస్థితియే నాకుఁ దెలియకపోయినది.

విజ—ఇది యంతయు నతని యదృష్టహీనతగాని మఱియొకటి కాదు.

ధన—నేనాయనవిషయమై చేసినదంతయు నాయనకే తెలియును. ఈసాయంత్ర మాయనయొద్దకుఁ బాలకొలనునుంచివచ్చిన యొకవర్తకుని దీసికొనివచ్చెదనని చెప్పినాను. అతఁడు వసుకాము నిదివఱకెన్నఁడు నెఱుఁగకపోయినను, అతనికిఁ గొంతఋణమిచ్చుట కొప్పుకొన్నాఁడు.

దామో—ఏమిటి? క్రొత్తవాండ్రుకూడ వసుకామున కాస్తి లేదని తెలిసియు ఋణమిచ్చుటకొప్పుకొనుచున్నారా?

ధన—అవును. పాలకొలనులో బూర్వము వర్తకము చేసి యిప్పుడు వడ్డివ్యాపారము చేయుచున్న అప్పన్న వసుకామునకు ఋణమిచ్చుట కొప్పుకొన్నాఁడు.

విజ—నాకిప్పుడొకయుపాయము దోఁచుచున్నది. ధనగుప్తా! పాలకొలనునుండివచ్చిన అప్పన్న నిదివఱకెన్నఁడును వసుకాముఁ డెఱుఁగఁడు గదా?

ధన—అవును. నిశ్చయముగా నాయన యప్పన్ననెన్నఁడును జూడలేదు.

దామో—అయితేసరే, విజయవర్మా! నీవుపురుషోత్తమరావు వేషమువేసికొని వెళ్ళుటకంటె పాలకొలనునుంచివచ్చిన యప్పన్న వేషమువేసికొని ధనగుప్తునితో వసుకామునియొద్దకు వెళ్ళిన నాతని వ్యవహారమంతయు నీకప్పుడే బోధపడును.

విజ—అవును. నీయాలోచన బాగుగానేయున్నది. తరువాత గ్రామపాలుని యొద్దకుఁ బురుషోత్తమరావు వేషమువేసికొనివెళ్ళి యాతనిస్వభావమును గ్రహించెదను.

దామో—సరే. అలాగుననే చేయవచ్చును.

వీర—కాని పాపము వసుకామునీవిధముగాఁ బరీక్షించుటమాత్రము న్యాయముకాదు. మీరిట్లాతనిఁ బరీక్షించుటవలననాతని సుగుణములకంటె దుర్గుణములే మెండుగాఁ గనిపించును. అయినను భయములేదు. ధనగుప్తా! దామోదరవర్మగారు చెప్పినసంగతి నీకుఁ దెలిసినదా? నీవుమాత్రము నమ్మకముగా సంచరించవలెను.



ధన—అందుకు మీ రెంతమాత్రము సందేహింపవద్దు. ఇప్పుడొక్క వేళయయినది. అయిదుగంటలకే వచ్చెదనని వసుకామునితోఁ జెప్పినాను.

విజ—నీయిష్టము. నీతోఁగూడవచ్చుటకు నేను సిద్ధముగానున్నాను. కాని ధనగుప్తా! నేను కోమటినని వసుకామునినమ్మించుటెట్లు?

ధన—మీకాసందేహమక్కఱలేదు. ఇప్పుడు కోమట్లందఱు బ్రాహ్మణులకంటెగూడ నెక్కువగా నుండవలెనని ప్రయత్నించుచున్నారు. మీరుకోమటినంటే సందేహించుటకు వీలుండదు.

విజ—సరేకాని, వడ్డివ్యాపారము చేయువాఁడనని నమ్మించుటకు వీలులేకుండ నుద్యోగస్థునివలెఁ గనుపింతునేమోగదా?

ధన—మీకెందుకు? నాతోరండి. ఇప్పుడు కోమట్లుద్యోగస్థులకన్న నెక్కువ వేషములు వేసికొని పంతులవారివలె సంచరించుచున్నారు. ముఖమును, మాటలు, చూచి కోమటియని తెలిసికొనుకాలము పోయినది.

దామో—ఆభయము మీకెంతమాత్రము నక్కఱలేదు. ఇంకా మీరు గుఱ్ఱపు బండిలో నెక్కికూడ వెళ్ళవచ్చును.

ధన—అవును. మీరు జోడుగుఱ్ఱముల బండిలో వచ్చినను రావచ్చును. మీకా సందేహమక్కఱలేదు.

విజ—సరే; ఇదియు బాగుగనేయున్నది. కాని వడ్డివ్యాపారము మాటలు నాకుఁ బూర్ణముగాఁ దెలియవు. నేనేవిధముగా వడ్డిబేరమాడవలెనో నాకుఁ గొంచెము చెప్పు.

దామో—వడ్డివ్యాపారమునకుఁ దెలియవలసిన సంగతులేమియు లేవు. వడ్డిబేరమాడునప్పుడు విశేషముగా వడ్డికావలయునని చెప్పుట ముఖ్యమైనయంశము. ధనగుప్తా! ఇంతేకాదూ?

ధన—అవును. అది ముఖ్యమైనయంశమే.

విజ—సరే. నాకిప్పుడు తెలిసినది. నెలకు నూటికి రెండురూపాయిలు వడ్డి కావలెనని యడిగెదను.

ధన—అంతేకాక నెక్కువవడ్డి మీరడుగకపోయినయెడల మీసంగతి యంత యు నప్పుడే తెలిసిపోవును. ఈకాలములో ధర్మవడ్డి పనికిరాదు.

విజ—అయితే, యెంతవడ్డి యడుగుమనియెదవు? నెలకు నూటికి రెండురూపాయీలుకూడ ధర్మవడ్డియేనా?

ధన—ఆసంగతి యిప్పుడు ముందుగాఁ జెప్పుటకు వీలులేదు. సమయమునుబట్టి వడ్డియడుగవలెను. ఋణమవసరముగాఁ గావలసినట్లగపడకపోయిన యెడల నెలకు నూటికి మూఁడురూపాయీలు వడ్డియడుగవచ్చును. ఋణమత్యవసరముగాఁ గావలసియున్నదని తోఁచినపక్షమున నెలకయిదురూపాయీలు వడ్డియు నొకసంవత్సరమువడ్డి ముందుగను గావలెనని యడుగవలయును.

దామో—విజయవర్మా! నీవు బహున్యాయమైన వ్యవహారమునే నేర్పుకొనుచున్నావు.

విజ—ఈవ్యవహారము న్యాయమైనది కాకపోయినను దీనివలన లాభమునూత్రము లేకపోలేదు.

ధన—తరువాత నీసొమ్మైనను మీయొద్దఁ బ్రస్తుతములేదనియు, మీస్నేహితుని దగ్గఱ బదులుచేసి యీవలసియున్నదనియుఁగూడఁ జెప్పవలెను.

విజ—నాస్నేహితునియొద్ద బదులు తేవలసి వచ్చినదనికూడఁ జెప్పవలెనా?

ధన—ఆలాగే చెప్పవలెను. మీస్నేహితుఁడు మంచివాఁడుకాఁడనియు, కపటియనియు స్నేహితులయెడలఁగూడ వడ్డివ్యాపారములో మోమోటము లేనివాఁడనియుఁగూడఁ జెప్పవలసియుండును.

విజ—ఇది మిక్కిలి బాగుగానున్నది. ఈవ్యవహారములో నాస్నేహితునిఁగూడ దూషింపవలెనా?

ధన—అవును. ఈవ్యవహారములో నాలాగుననే చెప్పవలెను. మీస్నేహితుని యొద్దఁగూడ ధనములేకపోవుటచే దానొకనగను కుదువపెట్టి ఋణము తేవలసివచ్చినదనికూడఁ జెప్పవలెను.



విజ—నగలు కుదువపెట్టి ఋణము తెచ్చి ధనమిచ్చువాఁడెట్టి మంచిస్నేహితుఁడోఁగదా?

దామో—విజయవర్మా! నిశ్చయముగా నీవు ధనగుప్తునిబోధ నాశక్తివలన నీవ్యవహారమందలి రహస్యమంతయుఁ ద్వరలోనే గ్రహించులాగున గనుపించుచున్నావు. ధనగుప్తా యిప్పుడు దొరతనమువారు క్రొత్తగాఁజేసిన చట్టమును దూషించుటఁగూడ మంచిదికాదా? ఈవ్యవహారములో దొరతనమువారు భూస్వాములు ఋణికులపాలుగాకుండ వారిని గాపాడఁదలఁచి చేసినచట్టము మంచిదికాదని చెప్పిన యుచితముగానుండును.

ధన—అవును. ఈసంగతి బహుచక్కనిదిగానే యుండును.

దామో—దొరతనమువారీచట్టమునుజేసి ఋణదాతలకు విశేషనష్టమును గలుగఁజేసిరనియు, నవసరము వచ్చినప్పుడు స్వేచ్ఛగా ఋణముచేయఁగోరువారికి ఋణదాతలు నిర్భయముగా ఋణమిచ్చుటకు వీలుకలుగకుండ భూస్వాములకుఁ గావలసినప్పుడు ధనము దొఱకకుండ నెక్కడలేని కష్టమును దెచ్చిపెట్టిరనియుఁగూడఁ జెప్పి దొరతనమువారిని దూషింపవలెను.

ధన—అయ్యో పాపము భూస్వాములకును ఋణదాతలకునుగూడ నెంతకష్టము వచ్చినదోగదా?

దామో—ఈచట్టము మంచిదని సంతోషించువారినందఱిని గూడ దూషించి భూస్వాముల భూములు ఋణదాతలపాలుగాక వారిసంతతివారి కుండునట్లు చేయుట మంచిదికాదనియు, అట్లుచేయుటవలన ధనమంతయుఁ గొందఱియొద్దనేయుండి తక్కినవారు ధనహీనులగుదురనియుఁ గూడఁ జెప్పిన బాగుగానుండును.

విజ—సరే! ఈవిధముగా సంగతులన్నియు సమయోచితముగాఁ జెప్పెదను. వేళకావచ్చినది. ధనగుప్తుఁడు మార్గములో నీవ్యవహారమందలి తక్కినరహస్యముల నన్నిటిని బోధించును.

దామో—వసుకాముని యిల్లు బహుసమీపముగా నున్నది. మీకీరహస్యములన్నియు బోధించుటకు వ్యవధియుండదేమో యని తోఁచుచున్నది.

విజ—అందుకు నీవెంతమాత్రమును సందేహించవద్దు.. నాయుపాధ్యాయుఁడు ధనగుప్తుఁడు బోధనాశక్తియందు మిక్కిలి గట్టివాఁడు. వసుకాముఁడు పొరుగింటనున్నను మనగుమ్మముదాటులోపలనే యీవిద్యనంతయు నేనభ్యసించి సంపూర్ణజ్ఞకుచోద్యుఁడను గాకపోయినయెడల నాబుద్ధిమాంద్యమే కారణముగానుండును గాని మఱియొకటి కాదు.

(అని ధనగుప్తునితో నిష్క్రమించుచున్నాఁడు.)

దామో—ఇదియంతయు బాగుగనేయున్నది; కాని, వీరభద్రా! నీవీవిషయములో మనము మొదటఁ దలఁచినట్లు పురుషోత్తమరావు వేషముతో విజయవర్మను దీసికొనిపోయి వసుకామునకు లాభముచేయఁదలఁచితివి సుమా.

వీర—లేదు. దామోదరవర్మగారూ! నేనట్టివాఁడను గాను, నామాటనమ్మండి.

దామో—ఇప్పుడు నీవు వెళ్ళి కరటకాచార్యునిఁ దీసికొనిరా. అతఁడు చెప్పఁబోవు సంగతులను వినవలెను.

వీర—(వెళ్ళుచున్నాఁడు)

దామో—పద్మావతినిగూర్చియు వసుకామునిగూర్చియు నాకుఁగలిగిన యనుమానము తీరవలెను. ఇందలివాస్తవము నాకుఁ దెలిసినఁగాని యేమియుఁ దోఁచకున్నది. నిత్యశంకితుఁడనుగా నేనెన్నాళ్ళిలాగునఁ గాపురము చేయఁగలను. ఇది కేవలమపవాదమని నిశ్చయమయినచో నేనింక సుఖముగాఁ గాపురము చేయవచ్చును. ఈసంగతినిగూర్చి కామపాలునితోఁగూడ నేనిదివఱకెన్నఁడును నాయభిప్రాయము చెప్పలేదు. ఇప్పుడు నాయభిప్రాయమాతనితోఁ జెప్పియిం



దలివాస్తము నేవిధముగానైనఁ దెలిసికొన నిశ్చయించుకొన్నాఁడను. అతఁడు దనయభిప్రాయమును దాచక నాతోఁ జెప్పును.

(జానకి ప్రవేశించుచున్నది.)

దామో—అమ్మాయీ? కామపాలుఁడుగూడ నీతో వచ్చినాఁడా!

జాన—లేదు. ఆయన యేదోపనిమీఁద వెళ్ళినారు.

దామో—అమ్మాయీ! కామపాలునివంటి యోగ్యుఁడు నీకుభర్తగా నుండఁదగినవాఁడని నీకిప్పటికిని దోఁచలేదు గదా! ఆతనితో మాటలాడి యతని సుగుణసంపత్తిని జూచియు నీకతనియందుఁ బ్రేమ యేల పుట్టకున్నదో నాకుఁ దెలియకున్నది.

జాన—మీరీవిధముగాఁ గామపాలుని బ్రేమింపుమని నిర్బంధము చేసి నన్నాయాసపెట్టుట మీకు న్యాయము కాదు. కామపాలునికంటె ననేకవిధముల నుత్తమోత్తముఁడగు మఱియొక పురుషుని నేను ప్రేమించితినని మీరెఱిఁగియు నిట్లనుట ధర్మము కాదు.

దామో—అదిగో, యెప్పుడు చూచినను నీవు మాటకెదురు చెప్పుచునే యుందువు. జానకీ! నీవాలాగునఁ జెప్పవద్దు. నీయభిప్రాయమంతయు నాకుఁ దెలిసినది. నీవు వసుకాముని బ్రేమించుచున్నావని నాకుఁ దెలియకపోలేదు. నీవు చిన్నదానవు. మంచిచెడ్డలు తెలియకుండా నికుఁ దోఁచినట్లు సంచరించుచున్నావు. వసుకాముని యయోగ్యత చూచికూడ నతనినే ప్రేమించుచున్నావని నీవు నిర్భయముగా నాయెదుటఁ జెప్పుటఁ దగదు.

జాన—మీరు నాయెడల నింత దయమాలియుండుట న్యాయము కాదు. మీయాజ్ఞకులోఁబడి వసుకామునితో మాటలాడుటఁగూడ మానివేసినాను. అతఁడయోగ్యుఁడని మీరిదివఱకే నాతో నెన్నిమాఱులో చెప్పినారు. ఇంకనతని యయోగ్యతనుగూర్చి మీరు నాతోఁ జెప్పి నన్నాయాసపెట్టవద్దు. మీయాజ్ఞానుబంధములచే నానోటిని జేతులను

గట్టి వేసికొనఁగలిగినను నా మనసును మాత్రము గట్టి వేయఁజాలకున్నాను. అతనినడత మంచిది కాకపోయినను అతనియందు నాకనురాగము పోనేరదు. అతనిదుస్థ్సితి జూచిననాకు విచారము పుట్టుచున్నది.

దామో—అతనిదుస్థ్సితినిగూర్చి నీవోపికకొలఁది విచారించిన విచారింపుము. కానినీవాతనిఁ బ్రేమించుటమాత్రము మాని యోగ్యుఁడగు కామపాలునే వివాహముఁ జేసికొనుము.

జాన—యోగ్యుడయినను నయోగ్యుఁడయినను నేను వసుకామునే ప్రేమింతునుగాని కామపాలునిమాత్రము వివాహమాడను.

దామో—ఈపెంకితనమును మూర్ఖత్వమును నాదగ్గిర మానుకో జానకీ! నీకు నాసంగతి యింకా బోధపడలేదు. తల్లిదండ్రులు దమపిల్లను గుంటివానికిచ్చినను గ్రుడ్డివానికిచ్చినను మాటాడక పడియుండవలెను. నీతల్లిదండ్రులు చనిపోయినదాదిగా నీకుఁదల్లియుఁదండ్రియు నేనేయయి యున్నాను. నాకు నీమీఁద నిప్పుడు సర్వాధికారమున్నది. నీకిష్టము లేకపోయినను, నాయిష్టమువచ్చినవానికి నిన్నిచ్చి వివాహము చేయుటకు నాకధికారమున్నది. నాయధికారము చెలాయింపవలెనంటే నిముసముపట్టదు. నీవు బుద్ధిమంతురాలవుగనుక వేరే నాయధికారమగపఱచ వలసిన యవసరము లేకుండ నేనుచెప్పినట్లొప్పుకొందువని నీతోనీలాగునఁ జెప్పుచున్నాను. బాగా ఆలోచించుకో. నాకుఁగోపము తెప్పించి నీవుతుదకేమియుఁ జేయలేవు.

జాన—మీరన్యాయముగా నామీఁద గోపపడవద్దు. అధర్మముగా నాకిష్టములేని పురుషునకు నన్ను వివాహము చేసి మీయధికారము గనపఱచెదమనిన నేనేమి చేయఁగలను. నాతండ్రి చనిపోవునప్పుడు నన్ను మీకప్పగించినాఁడు. అదిమొదలు నేను మిమ్ములనే దండ్రిగా భావించుకొనుచున్నాను. మీరు నన్నీవిధముగా నిర్బంధపెట్టినయెడల



మీయాజ్ఞకు మీఱి మీయెడల నాకుఁగల గౌరవమునుఁ గూడ మానుకొనవలసివచ్చును.

(అని నిష్క్రమించుచున్నది.)

దామో—జానకిఁగూడ నామాట కెదురుచెప్పుచున్నది. ఎవరిని జూచినను నాపాటాడువారులేరు. అందఱికి నామాటయన నసహ్యముగానున్నది. ఈముసలితనములోఁ బద్మావతిని నేనువివాహమాడి పడరానికష్టములఁ బడుచు నేనుజేసినపనికి నేనేవిచారించుచుండఁగా జానకితండ్రిచనిపోయి నాకుదీనినొప్పగించి దీనిమూలముగా నొకక్రొత్తవిచారమునుఁగూడఁ దెచ్చిపెట్టినాఁడు. ఆపత్కాలములో నాపదలే వచ్చుచుండునని చెప్పినట్లు నేను వివాహము చేసికొని తెచ్చిపెట్టుకొనిన యాపదలో జానకియొకటిగూడ నాకు సంప్రాప్తమయినది. ఎన్నిటికని నేను దుఃఖించను? (చెవియొగ్గివిని) యిదిగో పద్మావతి పాడుచున్నది. పెనుభూతమువలె నిదికూడ వచ్చుచున్నది. అదినేఁడెందువలననో మిక్కిలి సంతోషముగా నున్నట్లున్నది. జావళీలు నేర్చుకొనవద్దంటే నామాటవినక పంతమునకు జావళీలే పాడుచుండును. నేనింతశ్రమపడి నలుగురిలోఁ దలవంపులు వచ్చులాగున దానిని వివాహమాడినందులకు దానికి నాయందిష్టము లేకపోయినను నాతోఁ గొంచెము నవ్వుమొగముతో మాటలాడిన నంతేచాలును. ఏలాగుననైన దానికినాయందుఁ గొంచెము ప్రేమగలుగునట్లు చేయువలెను.

(పద్మావతి ప్రవేశించుచున్నది.)

పద్మా—మీరుజానకితోఁ గయ్యమాడుటలేదుగద. నేనుదగ్గిర లేనప్పుడైనా కొంచెము మంచితనముగా నుండండి. నేనున్నప్పుడు మీముఖ మెప్పుడుచూచినను విచారముగానే యుంటుంది. నేను దగ్గిరలేనప్పుడయినా కొంచెముసంతోషముగా నుండండి.

దా. మో.—పద్మావతీ! నాకు సంతోషము కలుగులాగున చేయు నుపాయము నీ చేతిలోనే యున్నది. నాకు విచారమన్న మాట లేకుండ నెల్లవేళల సంతోషముగా నుండునట్లు చేయరాదా?

పద్మా.—మీకానందము పుట్టించు శక్తి నాకుంటే యెంతో బాగాయుండును. నాకు మీ రెప్పుడు చూచినను సంతోషముగా నుండవలెనని యే తాత్పర్యము. మీ యిష్టము వచ్చినట్లు ప్రవర్తించుతాను; నాకు రెండువేల రూపాయలతో నొకకంటె చేయించండి.

దా. మో.—నన్ను సంతోషపెట్టుటకు నీకు రెండువేల రూపాయల కంటె చేయించవలెనా? సొమ్ము పెట్టి సౌఖ్యము కొనుక్కొనుట గూడనా? నన్నాయాస పెట్టకుండుటకు నీకీలంచము గూడఁ బెట్టెదననుకొంటివా యేమిటి. నగల మాట మాత్రము నా దగ్గర తలపెట్టవద్దు. మన మీవిధముగా వివాదపడుచుండుట మంచిది కాదు. నీ విట్లు నన్నెదిరించుచుండిన యెడల నేను సహించను.

పద్మా.—మీతో నాకు వివాదపడుట ముచ్చట యనుకొంటిరా యేమిటీ? నన్ని మీర ననిపించుకొనుట యెందుకు? నాతో మీరంత సఖ్యతగా నుండవలెనంటే నా మాటకెదురుచెప్పి నన్నాడిపొయ్యకండి. నన్నుఁ దిట్టితిట్టి మీ రేవిసిగి యూరకుందురని నేనింతవఱకు నోపిక పట్టియున్నాను.

దా. మో.—నిన్ను నేనేమియు ననుటలేదు. నీవే నా మాట కెప్పుడు చూచిన నెదిరించుచుందువు. ఎవ రెవరి నెదిరింతురో చూతాము. ఇఁక ముందు నా మాటకు నీ వెదురుచెప్పుదువో నీ మాటకు నేనెదురు చెప్పుదునో చూతము.

పద్మా.—మీ మంచితనము, మీ శాంతస్వభావము నాకుఁ దెలియదా యేమిటి? మీరు నన్ను వివాహమాడుటకుఁ బూర్వము మాతలడ్రితో మాటలాడుటకు వచ్చినప్పుడు మీ రెంత సంతోషముగా నున్నారు? ఇప్పుడు మీ రెట్లు గనుపించుచున్నారు? మీ పుణ్యము, ఆలాగున నవ్వుమొగముతో నుండండి. నన్నుఁ బెండ్లిచేసికొనక పూర్వము మీ చిన్నతనములో మీరు చేసిన చర్యలు వింతకథలుగా నాతో జెప్పేవారు. ఆ శాంతమంతయుఁ బోయి యిప్పుడు మీ కెక్కడలేని కోపమును వచ్చినది.



దా. మో.—అప్పుడు నీవు నా మాటకెదురుచెప్పక మంచితనముగా నుండుటచే నేనప్పుడట్లు సంతోషముగా నున్నాను. ఇప్పుడు మాత్రము నీవు నాయిష్టము వచ్చినట్లు ప్రవర్తించితివేని నాకుఁ గోపమెందుకుండును?

పద్మా.—అవును, అప్పుడు "మీరు ముసలివా"రని యాక్షేపించినవాండ్రను జూచిన నాకెక్కడలేని కోపము వచ్చేది.

దా. మో.—ఆ మాట నిశ్చయమే. నాకా సంగతి యంతయు దెలియును.

పద్మా.—మా చెల్లెలు సావిత్రి మీరు ముసలివారనియు, మీకుఁ దల నెఱసినదనియు, పండ్లూడిపోయినవనియు, మిమ్ముల నాక్షేపించుచు మీ ప్రక్కను నేను బెండ్లిపీటలమీఁదఁ గూర్చున్న మీకు నేను కొమార్తెవలెనో మనుమరాలివలెనో గనుపింతునని చెప్పినప్పుడు "ఈ తాతగారేనా? నీ మొగఁ"డని నన్నాక్షేపించుచుండఁగా మీరు నాకన్నులకు నవమన్మథునిలాగునఁ గనుపించుచున్నారనియు, మిమ్ములనే గాని యన్యుని వివాహము చేసికొనననియు నేను జెప్పుచుండుదానను.

దా. మో.—పోనీ, నీ పుణ్యము ఇంత మాత్రమయినను నన్నుఁ గూర్చి మంచిగా మాటలాడినావు.

పద్మా.—మిమ్ములను వివాహమాడి సుఖపడుదునని కూడ నేను జెప్పేదానను.

దా మో—బహుబాగాఁ జెప్పినావు. స్వవచన విఘాతముఁరాకుండ నీ
వన్నట్లునన్నెదిరించక నన్నుసుఖపెట్టి నీవు సుఖపడవలెను. ఇం
తయనుకూల దాంపత్యము ప్రపంచములో లేదనునట్లు మనమిద్ద
ఱము కాపురము చెయ్యవలెను.

పద్మా—అలాగున మనము కాపురము చేయవలెనంటే మీరు నామాటకె
ప్పుడు నెదురు చెప్పక నాయిష్టమువచ్చినట్లుండండి.

దా మో—నేనెన్నఁడును నీకెదురు చెప్పనుగాని నీవుమాత్రము నాయిష్ట
మువచ్చినట్లు సంచరించుచు నేను జెప్పినట్లు వినవలెను. పద్మావతీ!
నీవే యాలోచించుకొనుము. ఎప్పుడు చూచినను మనవివాదము నీవే
కారణముగనుండువుగాని నేనుగాను. ప్రియురాలా? నీవే మొదట
నేదో లేనిపోని కారణము గల్పించుకొని నామీఁదకుఁ గయ్యానికి
వత్తువు.

పద్మా—మీరని నామీఁద నెపము వేయుట న్యాయము కాదు. మీరే మొ
దటఁ గోపముతో నన్నేమైన నందురు.

దా మో—అదిగో, నామాట కెదురుచెప్పనని యిప్పుడే యెదురుచెప్పు
చున్నావు. ఈలాగున, నవునంటే కాదని యెదిరించి చెప్పుచుండ
న మనకుసఖ్య మెట్లుకలుగును.

పద్మా—అందుకే నామాటవిని నాకెదురుచెప్పక కాదంటే అవునని వా
దించకండి.

దా మో—అదిగో, తిరిగి యామాటే యనుచున్నావు. సరే, నీయిష్ట
మువచ్చినట్లు ప్రేలు. నాదురదృష్టముకొలఁది నాకునీవెక్కఁడ లేని గ
య్యాళివి దొరికినావు. నీవు మొదటినుండియు నీలాగుననే యవునం
టే కాదని నామాటకెదిరించి నాకుఁ గోపము తెప్పించుచున్నావు.

పద్మా—మంచిచెడ్డలాలోచించక మీరట్లు కోపపడుచుండిన నేనేమి చే
యఁగలను. పోనీయండి, మీయిష్టమువచ్చినట్లనండి.



దా మో—అదిగో, ఆమాటలోఁగూడ నన్ను దూషించుచున్నావు. నా
కు మంచిచెడ్డలు తెలియవని కూడ ననుచున్నావు.

పద్మా—పోనీయండి, నాతో మీకీ వాగ్వాదమెందుకు? మీరుకోపముమా
నండి.

దా మో—చూడు, ఇప్పుడుచూడు. ఎవరెవరి ననుచున్నారో చూడు.

పద్మా—నేనేమన్నాను. మీరేనాచేత నీమాటలన్నియు ననిపించినారు.
మీరుసరిగా మాటలాడక నాచేత నీలాటిమాటలనిపించులాగున సం
చరించిన నాదితప్పుకాదు.

దా మో—నీవునాకుఁగోపమువచ్చులాగున సంచరించినప్పుడు నేననుట
నాదితప్పుకాదు.

పద్మా—ఇది బాగుగానేయున్నది. తుదకు నాబ్రతుకు మాసావిత్రి చె
ప్పినట్లయినది.

దా మో—మీచెల్లెలు సావిత్రి కెక్కడలేని గయ్యాళితనము నున్నది.
అదిసిగ్గుబిడియము లేకుండ నోటికివచ్చినట్లు ప్రేలుచుండును.

పద్మా—మీయందమునకు యోగ్యతకు దానినిగూడ నాక్షేపించవలెను
గాఁబోలును అదిగయ్యాళియయిన నన్నుమీరు కోసికొనితినుటకు
నాపాలిటి మృత్యుదేవతలు గాఁబోలును.

దా మో—చాలు, ఈవివాహసౌఖ్యమింకఁజాలును. నీతోఁగాపురము చేయు
టకంటె సన్యసించుట మేలు.

పద్మా—ఆలాగేసన్యసించండి. మీకంతకష్టముగానున్నప్పుడీకాపురము నాకు
మాత్రముగావలెననుకొన్నారాయేమి? మీరాపనిచేస్తే యీమాటయయిన
నాకుఁ దప్పుతవి.

దా మో—నన్నొక గడ్డిపఱకక్రింద నీవుచూచుచున్నావని నేనిదివఱకే యె
ఱుఁగుదును. నేను నీకొకప్పుడుమాత్రము కావలసివచ్చినానాయేమి. నే
నేమతిపోయి నిన్నువివాహము చేసికొనినాఁడను. నీమూర్ఖత్వము పెంకెత

నము గయ్యాళితనముఁజూచి నిన్నెవ్వరును బెండ్లి చేసికొనక పోయినను నే నుబుద్ధిలేక నిన్ను వివాహమాడి యీబాధలన్నియుఁ దెచ్చిపెట్టుకొన్నాను.

పద్మా—మిమ్ములను బెండ్లిచేసికొనినందులకు మీకుఁగాదు నాకేబుద్ధిలేక పోయిన ది. మామూరివారందఱుఁ గాటికిఁగాళ్ళుచాచుకొనియున్న నీముసలితాత కా యీపిల్లను వివాహముచేయుచున్నారని యాక్షేపించుచుండఁగా సొ మ్ముకై యాసపడి మీధనముఁజూచి మీకు మావాండ్రు గట్టిపెట్టినారు.

దామో—చాలు, ఇఁకఁ జాలు. నీసంగతియంతయు నాకుఁ దెలిసినది. నీకు విశ్వాసమును గృతజ్ఞతయు నెంతమాత్రమును లేదు. నీవంటి దుర్మార్గురా లెక్కడను లేదు. నీవెంతపనికైనఁ జేయుటకు సాహసింతువు. నీతోఁ గా పురముచేసిన నన్ను బలవంతముగా గొంతుపిస్కిగి చంపినను జంపఁగలవు. ఇఁ క నీతోఁ గాపురము చేయఁగూడదు. నీచేష్టలన్నియు నాకుఁ దెలిసినవి, వసుకాముని.గూర్చియు, నిన్నుఁగూర్చియుజనులనుకొను మాటలబద్ధముకాదు. ఆమాటలు నిశ్చయముగా నమ్మవలసేయుండును. ఏకారణములేకుండ నిట్టి మాట పుట్టదు.

పద్మా—మీరట్టియపవాదలు నామీఁద వెయ్యవద్దు. లేనిపోనిమాటలనన్నిటి ని నమ్మి నన్ను దుర్మార్గురాలనని యనవద్దు. బాగుగాజరుగదు.

దామో—పోనీ, నీతో నాకీవాగ్వాదమెందుకు. నీయిష్టమువచ్చినట్లు నీవు. స్వేచ్ఛగానుండవచ్చును. నాకుఁదోఁచిన మనోవృత్తి నీకుఁబారవేసెదను. నీవు నాయింటనుండిలేచిపొమ్ము.

పద్మా—అలాగుననే మనోవృత్తి యీయవచ్చును. మీరిచ్చెదానితో మీయిం టనొక పంచఁగాచుకొనిత్రాగెదను. మీరేమిచేసినను సరే. మీమాటకె న్నఁడు నేనెదురు చెప్పలేదు. ఇప్పుడు మనోవృత్తినిచ్చెదనన్నఁగూడ నా లాగేయని యొప్పుకొన్నాను. నాలోపమేమియుఁ లేదు. ఈవిషయము లోఁ గూడ మీమాట కెదురు చెప్పలేదు. (అనినవ్వుచు) మీకుఁజాలకోప ము వచ్చినది. మీకింతకోపముగా నున్నప్పుడు నేనిచట నిలువఁగూడదు. (అని వెళ్ళుచున్నది)



దామో—నేను దానినన్న మాటలకు దానికెంతమాత్రమును గోపముపుట్టకున్న ది.ఎన్ని మాటలన్నను మానాభిమానములు లేకుండ నామాటకుమాట బదు లుచెప్పుచు మొఱ్ఱులాగున నెదుటనిలువఁబడి నవ్వుచున్నది. దాని నవియ ని నాప్రాణమే విసుగుచున్నది. ఇఁక దీనితో మాటలాడినయెడల నాకు మతిపోవఁబోవును. దీనికి నాలక్ష్యమేమియులేదు. ఇట్టిదానికయి నేను శ్రమపడుట నాదేతప్పు. ఇదినన్ను వదలిపోయినయెడలఁ దలఁదడవిచూ చుకొందును. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ద్వి తీ య రం గ ము.

రంగము:—వసుకాముని యింట నొకచావడి.

(రాముఁడును, ధనగుప్తుఁడును, విజయవర్మయుఁ బ్రవేశించుచున్నారు.)

రామ—ధనగుప్తుఁడుగారూ! ఇక్కడఁ గూర్చుండండి. ఇదిగో, నేనువెళ్ళి మీరువచ్చినారని మనవిచేస్తాను. అయ్యా! తమపేరెవరండి.

విజ—ధనగుప్తా నాపేరేమనిచెప్పుదు (అని ధనగుప్తుని రహస్యముగా నడుగు చున్నాఁడు)

ధన—ఆయనపేరు అప్పన్న.

రాము—అప్పన్నగారాండి. సరే (అని వెళ్ళుచున్నాఁడు)

విజ—సేవకుఁడగు నీరామునిఁజూచిన వానికతని యజమానుఁడు వసుకాముఁడు ధనహీనుఁడని యెవరును దలఁచరు. ఇది నిశ్చయముగా మాయన్నగారియి ల్లువలెనే గనిపించుచున్నది.

ధన—అవును. ఇది నిశ్చయముగా మీయన్నగారయిల్లే. ఈయిల్లు జ్యేష్ఠుఁడ గు కామపాలుని భాగమునకు వచ్చినది. కామపాలునియొద్ద నీయిల్లుసా మానులతోఁ గూడ వసుకాముఁడు కొన్నాఁడు. దామోదరవర్మగారీయి ల్లుకొని వసుకాముఁడు ధనముపాడుచేసెనని కోపపడిరిగాని, తండ్రియంద లి గౌరవముచే నాయనశ్రమపడి కట్టిన యీయిల్లుతరులు కొనుటకిష్టపడక వసుకాముఁడేకొన్నాఁడు.

విజ—పిత్రార్జితమగు నీయిల్లమ్ముట కామపాలునిదేతప్పు. వసుకాముఁడు మంచిపనినేచేసినాఁడు.

(రాముఁడు ప్రవేశించుచున్నాఁడు)

రాము—అయ్యా! మిమ్ములనిద్దఱినిక్కడఁ గొంచెముసేపు కూర్చుండమన్నారండి. మాయజమానుఁడుగారు స్నేహితులతో మాట్లాడుచున్నారు. ఇప్పుడాయనను జూచుటకు సమయముకాదు.

విజ—అప్పిప్పించుటకు ధనగుప్తుఁడు నన్నుఁదీసికొనివచ్చినాఁడుఁ ఈమాట మీయజమానునికిఁ దెలిసినయెడల నిట్లుచెప్పరు. వెంటనే మమ్ములను జూడనేచూతురు.

రాము—అవునుగానండి, నేనాసంగతియంతయు నాయనతోఁ జెప్పినాను. అప్పున్నకూడా వచ్చినాఁడన్న సంగతి మఱచిపోకుండఁ జెప్పినాను.

విజ—అయితేసరే, నీపేరేమి?

రాము—రాముడండి; నాపేరు రాముఁడంటారు.

విజ—రాముఁడూ! మీయజమాని బహుమంచివాఁడుగాఁబోలును. నీకిక్కడ జీతము బాగాయిస్తారా?

రాము—మాయజమానునివంటి యోగ్యులెవ్వరూకారు. మాకిక్కడఁ జేయవలసినపనికూడాలేదు. మేమునలుగురము శేవకులమున్నాము. మేమునలుగురము బహుసంతోషముగా చీట్లాడుకొంటూ కాలము గడుపుదుము. మాకుజీతములెక్కువగా నేయున్నవిగాని యాఱుమాసములకొకసారి మాకు జీతములు ముట్టుతూ వుంటవి. మాయజమానిగారి చేతిలో డబ్బువుంటే మాకేలోపమువుండదు. జీతములు మాకు త్వరగా దొరకవని బాధలేకుండా మాయిష్టమువచ్చినట్లు డబ్బువాడుకొంటాము.

విజ—(తనలో) బాగుగా నేయున్నది దమ శేవకులు యిష్టమువచ్చినట్లు యజమానుని సొమ్ము కర్చుపెట్టఁగలిగినప్పుడు జీతములు లేకపోయినను నష్టములేదు.



రాము—ధనగుప్తుఁడుగారూ! మఱచిపోయినాను. నాకు అప్పుమాట్లాడినారా?

విజ—నీయజమానిగారివలె నీకుఁగూడ నప్పుకావలసివచ్చినదా? ఇది బహువింతగానున్నది.

ధన—రాముఁడూ! నాశక్తివంచనలేకుండఁ బ్రయత్నముచేసినాను. ఋణము దొరకలేదు.

రాము—అయ్యో! మీరుతప్పకుండా నప్పిప్పిస్తారని నమ్మికొనియున్నాను. నా స్నేహితుఁడు వెంటయ్యకూడా నాకు హామీవుంటాఁడు.

ధన—వెంటయ్య హామీవుంటే పనికిరాదు. ఋణము నెవ్వరు నివ్వనన్నారు.

రాము—నూరురూపాయిలేకాదండి. పోనీ నాజీతముమీఁద నప్పిప్పించండి.

విజ—(తనలో) జీతముమీఁద నప్పిచ్చుటకు వీనికీయుద్యోగము శాశ్వతముగాఁబోలును?

ధన—నీకీయుద్యోగము శాశ్వతమని నమ్మి యెవరప్పిస్తారు?

రాము—నాయుద్యోగమునకేమి భయములేదు. ఎవరిపనులైనా పోతాయిగాని నాపనిపోదు.

విజ—(తనలో) వీనిధైర్యము మిక్కిలి యాశ్చర్యముగానున్నది.

ధన—అయితే కుదువపెట్టుటకు నీయొద్ద నేమియు లేదా?

రాము—ఈమధ్య మాయజమానియొద్ద నేమియులేకపోవుటచేత నాకేమియు దొరకలేదు. ఇప్పుడు నాదగ్గిర యేమీలేదు. కాని మాయజమానిగారి పట్టుపంచెలచాపును, బనారసు తలరుమాలును, వెండిచెంబులజోడును మాయెజమానిగారికవసరము వచ్చినప్పుడిచ్చుపద్ధతిని కుదువపెట్టఁగలను. మీకట్లుచేయుటకు నమ్మకములేనియెడల మాయజమానిగారి బట్టలను గొన్నిటిని దెచ్చి మీదగ్గఱపెట్టి యివితీసుకొని వెళ్ళుతూవుంటాను. మాయజమానిగారికీసంగతి తెలియవలసిన యవసరములేకయే నేనీపని యంతయుఁ జేయఁగలను.

ధన—అలాగునైనయెడల బాగుగా నేయున్నది. ఆలోచించి చెప్పుతాను.

(అప్పుడు రాముని బిలుచు నొకకేక వినిపించుచున్నది)

రాము—అదిగో! మాయజమానుఁడుగారు నన్నుఁ బిలుస్తున్నారు. మీరాయ
నను జూడడానికి సమయమయిందని తోస్తుంది. ధనగుప్తుఁడుగారూ నా
సంగతిమాత్రము మఱచిపోకండి. నాపని శాశ్వతమైనదికాదని మాత్రము
నుకోకండి. రండి వెళ్లుదాము. ఇప్పుడు లోపలికి వెళ్ళవచ్చును.

విజ—(తనలో) ఈసేవకుఁడు తన యజమానివంటివాఁడే యగుసెడల వాని
గౌరవమును గూర్చి యాలోచించనవసరములేదు.

(అందఱు లోనికి వెళ్ళుచున్నారు)

రంగము:—వసుకామునియింట నొకగది.

(వసుకాముఁడును, విక్రమదేవుడు, మాధవరావును, మఱికొందఱు స్నేహితు
లును, జీట్లాడుచుఁ బ్రవేశించుచున్నారు)

వసు—ఇప్పుడందఱికి నెక్కుడలేని నీతులును బలిసినవి. ఇష్టమువచ్చినట్లు పె
ద్దమనుష్యు లానందించుటకు వీలులేకుండ సంఘసురాచారసంస్కరణసమా
జమువారు ప్రొమ్ముఁ జెట్టి చీట్లాడుటగూడ దూష్యమని నిందించుచున్నారు.
ఇప్పుడు కాలమంతయుఁ జెడిపోయినది. మనవారు వినోదార్థము నలుగు
రుఁజేరి చీట్లాడుటగూడ జూదమనుచున్నారు.

మాధ—ఆమాటనిజమే. పెద్దమనుష్యులు చీఁకటిపడఁగానే ముసుగువేసికొని
యభిసారికలవలె వేశ్యలయింటికి వెళ్లుచుండుట మనమంతయుఁ జూచుచు
నేయున్నాము. ఈమహాశూరులే భోగముమేళము చూడఁగూడదనియు,
సంగీతము వినఁగూడదనియు బోధించుచుందురు. రహస్యముగా నెట్టి దు
ష్కార్యమునైనను జేయవచ్చునుగాని చీట్లాడుటమాత్రము దూష్యమఁట?
చీట్లాడుట జూదమైన నవుఁగాక. జూదమైతేమాత్రము మానుమనియు
న్నదాయేమిటి. జూదము, మద్యపానము సరసులకు ముఖ్యమైనవని మన
గ్రంథములు చెప్పుచునేయున్నవి.

ఒకస్నేహితుఁడు—పాపము! వాళ్ళనేమిచేయుమంటావు. వాళ్లు పెద్దమను



ష్యులమనిపించుకొనుటకై యితరులను దూషించి సంఘమంతయుఁ జెడిపో
వుచున్నదని లేనిదుఃఖమభినయించుచుందురు. ఇతరులను దూషించుచుండిన
యెడలఁ దాము యోగ్యులని లోకులనుకొందురని వాళ్ళతాత్పర్యము. అం
దుకొఱకు జనులను వంచించుటకు వీరిట్టివేషములను వేయుచున్నారు.

మాధ—అవును. ఆమాటవాస్తవమే. విక్రమదేవిమధ్య శరీరారోగ్యముకొఱ
కు కొంచెము కల్లు త్రాగనారంభించినాఁడు. "శరీరమాధ్యంఖలు ధర్మ
సాదనమ్మ" ని పెద్దలు చెప్పనే చెప్పినారు.

వసు—అందులోఁ దప్పేమున్నది. నేను విచారములు మఱచిపోవుటకుఁ గొం
చెము మద్యపానము చేయుచునేయుందును. త్రాగినప్పుడు నాకెక్కుడలేని
యానందముగనుండును. ఇంతేకాక సరసులకు మద్యపానము ముఖ్యముగా
నుండఁదగినది. మద్యపానము చేసినప్పుడే మోహోదయమగును.

మాధ—వసుకామా! నీకెవతెయందు మోహమున్నదో నిశ్చయముగా నాద
కఁ జెప్పుము. స్నేహితులితో నబద్ధమాడఁగూడదు.

వసు—నాహృదయమొక కన్యకయందు లగ్నమైయున్నది. రూపలావణ్యము
లయందును గుణసంపత్తియందును విద్యాధికతయందును నాకన్యకను బోలిన
వారెవ్వరును లేరు.

మాధ—ఆకన్యకపేరేమి.

వసు—ఆకన్యకపేరు జానకి.

విక్ర—జానకా! ఆమె యెవరికూమార్తె?

వసు—ఆచిన్నదాని కులగోత్రములెందుకు. ఆమె బహుయోగ్యురాలు. ఆ
చిన్నదాని రూపలావణ్యములు వర్ణింపనలవికాదు.

మాధ—అందముతోఁ బనియేమున్నది. కుంటిదయినను గ్రుడ్డిదయినను మో
హమున్నపుడదే మిక్కిలి యందకత్తెగాఁ గనుపించును.

(రాముఁడు ప్రవేశించి వసుకామునితో నేమోరహస్యముగాఁ జెప్పుచున్నాఁడు)

వసు—నాకుఁ గొంచెము పనియున్నది. నేనుబోవలెను మాధవరావూ కొం
చెము నేసికూడనే కూర్చుండుము.

మాధ—వసుకామా; పనికేమిలే; యెప్పుడుకావలెనన్న నప్పుడే చెయ్యవచ్చును. పనియెక్కడికిఁ బాఱిపోదు. ఇప్పుడు నీప్రియురాలినిఁగూర్చి మాటలాడుకొనుచుండఁగా నీవల్లు మమ్ము విడచిపోవుట మంచిదికాదు. ఒకవేళ నీప్రియురాలే వచ్చినదికాఁబోలును.

వసు—కాదు. ఋణమిప్పించుటకు ధనగుప్తుఁడొకవర్తకునిఁ దీసికొనివచ్చినాఁడు. వారితో మాటలాడుటకు నేను త్వరగా వెళ్ళవలెను.

మాధ—ఆధనగుప్తునే యీలాగున రమ్మనవచ్చును. నీవు వెళ్ళవద్దు.

ఒకస్నేహితుఁడు—అవసరమైనచో నిప్పుడావర్తకుఁడుకూడ రావచ్చును.

రెండవస్నేహితుఁడు—అవును. వారినిద్దరినిగూడ నిక్కడకే రమ్మనుటమంచిది.

వసు—ఆలాగుననేచేస్తాను. రాముడూ! వారినిద్దఱిని లోపలికిరమ్మను.

రాము—(పోవుచున్నాఁడు)

మాధ—వసుకామా! వారికిఁగూడఁ గొంచెమీసీసాలోని సారాయిత్తము. వాళ్ళకుఁగూడఁ బోసినయెడల మనయందు విశ్వాసముగా నుందురు.

వసు—త్రాగినవాని విశ్వాసము వేఱచెప్పనక్కఱలేదు. త్రాచుపామునకుఁ బాలుపోసినట్లే ఋణదాతల కుపకారముఁ జేసినయెడల నదియంతయు మన కపకారముగాఁ బరిణమించును.

(విజయవర్మతోడను, ధనగుప్తునితోడను రాముఁడు ప్రవేశించుచున్నాఁడు)

వసు—ధనగుప్తా యిటురా? అప్పన్నా! యిటువచ్చి కూర్చుండుము. ధనగుప్తా! యితనిపేరు అప్పన్నేకాదూ?

ధన—అవునండి. ఇతఁడే అప్పన్న. నేను దమతో మనవిచేసినది యితఁడేనండి.

మాధ—విక్రమదేవుగారూ! రండి మనము వెనుకచావడిలోఁ గూర్చుండి సేపు ఆడుకొందము. వసుకాముఁడు వీరితో వ్యవహారముమాటలాడినతరువాత వచ్చును.

వసు—ఆలాగుననే వ్యవహారమైనతరువాత వచ్చెదను. మీరువెళ్ళండి.

విక్ర—మాధ—(నిష్క్రమించుచున్నారు)



వసు—మాధవరావూ!

మాధ(తిరిగివచ్చి) నన్నుఁ బిలిచినారా?

వసు—అవును; బహుశా నీయవసరముండును. అందువలన నీవుకూడ నుండవలసివచ్చును.

మాధ—మీరందులకెంతమాత్రమును సందేహించవద్దు. నేనెప్పుడు కావలసివచ్చినను సిద్ధముగనే కనిపెట్టియుండెదను. అప్పుపత్రముమీఁద సాక్షివ్రాలు చేయుమనినఁ జేసెదను. (అనివెళ్లుచున్నాఁడు)

ధన—అయ్యా! ఇతఁడేఅప్పన్నండి. ఇతఁడు బహు మర్యాదగలవాఁడు. ఇతఁడన్నమాటఁ దప్పడు. అప్పన్నా! ఈయననే———

వసు—అతని సంగతియంతయు నీవిదివఱకే చెప్పినావు. అతని మొగముచూచినతోడనే యతని యోగ్యతయంతయు నాకుఁదెలిసినది. అప్పన్నా. సంగతంతయు నీకుఁ దెలిసియేయుండును. అయినను చెప్పెదనువినుము. నేనుకర్చుమనిషిని. నాపిత్రార్జితమంతయు నిదివఱకే కర్చుపడిపోయినది ఇప్పుడు నాకు ఋణముకావలసియున్నది. నీవు వ్యవహారమెఱిఁగిన పెద్దమనిషివి. నీవు వడ్డీవ్యాపారము చేయుచున్నావఁట. నాయవసరమునుబట్టి నేను నెలకు నూటికి నాలుగురూపాయీల చొప్పున వడ్డీయిచ్చుటకు వప్పుకొన్నాఁడను. వ్యవహారధర్మమునుబట్టి వీలుకొలఁది నూటికి నెలకుఁ బదిరూపాయిలుగూడ వడ్డీపుచ్చుకొనేయుందువు. ఇప్పుడు సంగతంతయు నీకుఁ దెలసియున్నదిగనుక వేఱుమాటలతో నవసరములేకుండ వ్యవహారమునుగూర్చి మాటలాడుదము.

విజ—ఓహో! మీరెంతయోగ్యులండి. నిగర్వచూడామణియనుమాట మీకే చెల్లును. లాభమువచ్చినను మీరెన్నఁడు నబద్ధమాడరని నాకీమాటలతోనే తెలిసినది.

వసు—నాకెన్నఁడు నన్యాయము నబద్ధము ననుమాట పనికిరాదు. నాకు నష్టమువచ్చినసరే యెప్పుడును నేను నిజమే చెప్పెదను.

విజ—మీయోగ్యత చూచినకొలఁది నాకు మిక్కిలి సంతోషముగానున్నది. మీయోగ్యతంతయు నేనిదివఱకే విన్నాను. అయితే నాయొద్ద నిప్పుడు బొత్తిగా సొమ్ములేదు. నాసొమ్మంతయు లోకులమీఁదనున్నది. మీకుఁ గావలసియున్నదని ధనగుప్తుఁడు చాలదూరము చెప్పుటచేత లేదనిన బాగుగా నుండదని నాస్నేహితునియొద్ద నప్పుతీసుకొని మీకిచ్చుటకాలోచించుచున్నాను. నాస్నేహితుఁడు మొగమోటములేనివాఁడు. ఇదికను నామాటయందు నమ్మకములేకపోయెనేని ధనగుప్తునడగండి. నాస్నేహితునియొద్దనైన నిప్పుడు సొమ్ములేకపోవుటచే నాతఁడు నగలు కుదువపెట్టి యప్పుతెచ్చి నాకీయ్యవలసివచ్చినది.

ధన—ఆమాటనిజమేనండి. నిన్నటినుండియు మాటదక్కునో లేదోయని యప్పన్న నిద్రాహారములు లేకుండ నప్పుకొఱకుఁ దిరుగుచున్నాఁడు. నాసంగతంతయు మీకేవిశదము. నేనబద్ధమాడువాఁడనుగాను.

వసు—అవును నీసంగతియంతయు నిప్పుడు వేఱేచెప్పనక్కఱలేదు. నేను నిన్ను బాగుగా నెఱుఁగుదు. ఈచిక్కులకేమి. కష్టపడకుండ నేవ్యవహారమును సాగదు. ఇప్పుడు సొమ్ము దొరకురోజులుకావు. ఆసంగతి నాకే తెలియును.

విజ—అయితే, తామీయప్పునకేమి యాస్తిచూపించెదరు. మీకు భూములు లేవని తోస్తుంది.

వసు—నాభూమియంతయు నిదివఱకే పోయినది. నాకేవిధమైన యాస్తియులేదు.

విజ—చరాస్తి యయినను లేదా?

వసు—చరాస్తిగూడ నేమియులేదు. వంటచేసికొనుటకవసరమైన పాత్రసామానును రెండావులును దప్ప మఱియేమియు లేదు. అప్పన్నా! నాకు ముందుఁ గొన్నిదినములలో రాఁగలధనమునుగూర్చి ధనగుప్తుఁడు నీతోఁ జెప్పలేదా?



విజ—ఆసంగతి నాతో ధనగుప్తుఁడిదివఱకే చెప్పినాఁడు.

వసు—నాపినతండ్రి విజయవర్మ చాలధనవంతుఁడు. ఆయన యిప్పుడు చెన్నపట్టణములో నుద్యోగములోనున్నాఁడు. ఆయనకు సంతానములేదు. తిరిగి ఆయన వివాహముగూడ చేసికొనలేదు. కాఁబట్టి యాయనయాస్తియంతయు నాకేచెందును.

విజ—మీపినతండ్రి చాలధనవంతుఁడని నేనిదివఱకేవిన్నాను. కాని యాయనయాస్తియంతయు మీకేచెందుననిమాత్రము నాకుఁదెలియదు.

వసు—అందుకుసందేహములేదు. మాపినతండ్రికినాయెడలఁ జాలఁ బ్రేమగలదని యందఱు చెప్పుదురు. ఆయన తనయాస్తియంతయు నాకేయిచ్చెదనని కూడ ననేకపర్యాయములు చెప్పినాఁడఁట.

విజ—ఆలాగునాండి. నేనీసంగతి యిదివఱకెన్నఁడు నెఱుఁగను.

వసు—అవును. ఆమాటవాస్తవమే. ధనగుప్తుఁడీసంగతంతయు బాగుగా నెఱుఁగును. ధనగుప్తా! నామాటనిజమేకాదూ?

ధన—నిజమే. మీపినతండ్రిగారి యాస్తియంతయు మీకేచెందునని నేను ధైర్యముగాఁ జెప్పఁగలను.

విజ—(తనలో) నేనిప్పుడు చెన్నపట్టణములోనున్నానని యందఱియభిప్రాయముగాఁబోలును.

వసు—అప్పన్నా! నేనొకసంగతి చెప్పెదనువిను. విజయవర్మగారి యాస్తియంతయు నీకిష్టమున్నయెడల నిప్పుడు తనఖాపెట్టెదను. ఆయన యాస్తియంతయు నాయన చనిపోయినతరువాత నాకేచెందును. ఆయన చాల పెద్దవాఁడు. చాలకాలము జీవింపఁడు. కాని నాకాయన నిశ్చయముగాఁ జిరకాలము జీవింపవలెననియే యున్నది.

విజ—మీపినతండ్రిగారు చాలకాలము జీవించియుండవలెనని మీకంటె నాకెక్కువకోరికగా నున్నది. అయితే మీరు కుదువపెట్టు నాస్తివలన నాకసలు సొమ్మయిన నేనుజీవించియుండఁగా దొరకునో లేదోయని భయముగానున్నది.

వసు—నీకాభయమేంతమాత్రము నక్కఱలేదు; విజయవర్మగారు చనిపోయిన వెంటనే నీకు సొమ్మంతయు ముట్టును.

విజ—నేను మీకేప్పుడప్పిచ్చి విజయవర్మగారెప్పుడు కాలముచేతురని యుండవలెనుగాఁబోలును.

వసు—ఆయన యిప్పుడు బహుదార్ఢ్యముగా నున్నాఁడనుకొంటివాయేమి?

విజ—ఆయన దార్ఢ్యముగను ఆరోగ్యముగనున్నాఁడని నాకెంతమాత్రము విచారములేదు. కాని యాయన యింకను జాలకాలము జీవించునని నేను విన్నాను.

వసు—నీకు నిజము తెలియలేదు. ఆయనకుఁ జెన్నపట్టణములో నీళ్ళు బొత్తిగాఁ బడలేదు. ఇప్పుడాయన చాలఁ గృశించియుండుటచే నాయనస్నేహితులుగూడ నాయన నానవాలుపట్టలేకుండఁ జిక్కియున్నాఁడని విన్నాఁడను.

విజ—(నవ్వుచు) పాపమాయనబంధువులుగూడనాయన నానవాలు పట్టలేనంత కృశించినాఁడుగా?

వసు—నీకీసంగతి వినినమాత్రమున నెంత సంతోషముగాను ధైర్యముగాను నున్నదని తోఁచుచున్నది.

విజ—లేదు,లేదు; నాకెంతమాత్రము సంతోషముగా లేదు.

వసు—అవును. నాకుఁ దెలియును. నీకీసంగతివింటే సంతోషముగానే యున్నది. ఆయన బాగుగానున్న యెడల నీకు సొమ్ముత్వరగా రాదు. అందువలన నీకుసంతోషముగా నేయుండును.

విజ—అయితే విజయవర్మగారీగ్రామము త్వరలో దయచేతురని విన్నాను. ఆమాటనిజమేనాండి. కొందఱాయనవచ్చినారని కూడఁ జెప్పినారు.

వసు—లేదు. ఆయన యీగ్రామమునకు రాలేదు. ఆయనవచ్చినయెడల నాకుఁ దెలియకుండదు. ఆయనయిప్పుడు చెన్నపట్టణములోనే యున్నాఁడు. ధనగుప్తా! ఆయనయిప్పుడు పట్టణములోనె యున్నాఁడుగాదు?



ధన—అవును. ఆయన యిప్పుడు పట్టణములోనేయున్నాఁడు.

విజ—అయ్యో! తమకిప్పుడు కొంతసొమ్మైనను మిక్కిలి యవసరముగాఁ గావలయునని విన్నాను. అయితే మీయొద్దఁ దాకట్టుపెట్టుట కేమియు నాస్తి లేదా?

వసు—ఆస్తి యేమియును లేదని చెప్పుచుండఁగా నాస్తిసంగతి యెందుకడిగెదవు.

విజ—కాదు, మీతండ్రిగారు చాలబంగారపునగలను వెండిసామానులును మీకిచ్చిరనివిన్నాను. అందువలన మీయొద్ద నేమాత్రమైన నాస్తి యుండునని నేనట్లడిగినాను.

వసు—ఆబంగారపునగలును వెండిసామానులు నప్పుడే కొఱ్ఱుపడిపోయినవి. ధనగుప్తునకాసంగతంతయు బాగుగాఁ దెలిసినయంశమే.

విజ—(తనలో) అయ్యో! ఆనగలును వెండిసామానులు నప్పుడే పోయినవిగాఁబోలును. అందు మాయన్నగారికితరులు బహుమానపూర్వకముగా నొసఁగిన గొప్పవస్తువులు గూడ కొన్నియున్నవి. (పైకి) మీతండ్రిగారు మీకుఁ జాలపుస్తకసామగ్రినిఁగూడ నిచ్చిరని విన్నాను. అందేమయినదనున్నవా?

వసు—అవును. ఆపుస్తకములు విస్తారముగా నుండేవి. కాని విద్యాసాధనములన్నియు నాయొద్దనేయుంచుకొని యితరులకు విద్యాసాధనములు లేకుండఁజేయు టుచితముగాదని యెంచి పరోపకారబుద్ధితో నేనాపుస్తకములన్నియు నప్పుడే యమ్మివేసినాను.

విజ—(తనలో) విద్యాగౌరవమెఱుఁగి చిరకాలమునుండి పెద్దలుసంపాదించిన పుస్తకములు గూడఁ బోయినవి కాఁబోలును. (పైకి) ఆపుస్తకములిప్పు డెక్కడనున్నవో నాకుఁగొంచెము చెప్పండి.

వసు—ఆసంగతి పుస్తకముల నమ్మువాండ్ర నడిగినఁ దెలియును. ఆపుస్తకములన్నియు మొత్తముగా వర్తకునికమ్మివేసినాను. ఆపుస్తకము లిప్పు డెక్కడనున్నవో నేనెట్లు చెప్పఁగలను. ఆసంగతి ధనగుప్తుఁడు గూడ జెప్పలేఁడు.

ధన—నాకుఁ బుస్తకములసంగతి తెలియనే తెలియదు.

విజ—అయితే మీపిత్రార్జితము తాలూకు ఆస్తియేమియు లేదుగాఁబోలును.

వసు—ఆవిధమైన యాస్తియేమియు లేదు. పూర్వుల చిత్రపటములును, దేవతార్చనసామగ్రియు మాత్రమాగదిలో బూజుపట్టియున్నది. అవి కొనవలెనన్నయెడల వానినమ్మెదను.

విజ—ఏమి, యీలాగు సెలవిచ్చుచున్నారు? మీపూర్వులచిత్రపటములును దేవతార్చన సామగ్రియుఁ మాత్రము మీ రెందుకమ్ముతారు.

వసు—నాకా సందేహ మెంతమాత్రమును లేదు. నీ కెందుకు నీకుఁ గావలసినయెడల నవి చూడవచ్చును. నాకిప్పు డవసరముగా నున్న సొమ్ముదొరకిన యెడల నేనవియన్నియు నమ్మివేసెదను.

విజ—ఇప్పుడు వీనిసంగతంతయు నాకుఁ దెలిపినది. వీఁడిఁక బాగుపడుట తటస్థింపదు. (పైకి) మీపూర్వులపటములను దేవతార్చనసామగ్రియు మీయొద్ద గౌరవముతో నుంచుకొనుటకు మాఱుగా నిట్లు విక్రయింపఁజూచుట మిక్కిలివింతగానున్నది.

వసు—అప్పన్నా! నీకాసంగతియెందుకు నీసొమ్ముకుఁ దగినయాస్తి వచ్చునప్పుడు నాగౌరవముతో నీకెందుకు?

విజ—సరే. ఆలాగునైనయెడల నాపటములన్నియు నేను కొనెదను. తరవాత మాఱుబేరమునకమ్మవచ్చుమ (తనలో) వీనికృతఘ్నత చూడ మిక్కిలి కోపము వచ్చుచున్నది. ఈయకార్యము మాత్రము నేనెన్నఁటికిని మఱవను.

(మాధవరావు ప్రవేశించుచున్నాఁడు.)

మాధ—వసుకామా! ఇంకను నిక్కడ నేమిచేయుచున్నావు, త్వరగారమ్ము.

వసు—నేనిప్పుడు వచ్చుటకు వీలువేదు. ఇంకను నాకిక్కడఁ బనియున్నది. ఆగదిలోఁబడియున్న మాపూర్వులచిత్రపటములను దేవతార్చన సామగ్రియుఁగూడ నమ్మఁ దలఁచుకొన్నాను. అప్పన్న యవియన్నియుఁ గొననున్నాఁడు.



మాధ—దానికేమిలే. అవియన్నియు నేలాగునో యొకలాగునఁ బాఱవేయవచ్చును.

వసు—కొన్న తరువాత నప్పన్న వాని నేలాగునైనఁ బాఱవేసికొనును. మాధవరావూ! కొంచెమిక్కడఁ గూర్చుండుము. అవియన్నియు నీవేయమ్మవలెను.

మాధ—ఆలాగుననయితే, అవియన్నియు నొక్కనిముసములో నమ్మివేసెదను. నాప్రయోజకత్వముచూడుము. నేను జూదమాడుటలో నింత నేర్పరినిగా నుండి సామానులమ్మలేననుకొంటివి కాఁబోలును.

విజ—వీండ్రెంతకైనను సాహసింతురనుటకు సందియములేదు.

వసు—ధనగుప్తా! నీవుగూడ నాపటములను జూడవచ్చును. నీవే మధ్యవర్తివిగా నుండి వానిధర పరిష్కరింపవలెను. అప్పన్నా! నీవేలాగుననో యున్నావు. నీకీవ్యవహారము తృప్తికరముగా లేనట్లున్నది.

విజ—నాకవ్యవహార మెంతమాత్రమును దృప్తికరముగా లేదు. పూర్వుల చిత్రపటములనుగూడ నమ్మఁజూచుట బహువింతగానున్నది. (తనలో) వీండ్రు సొమ్ముకొఱకేపనినైనఁ జేయసాహసింతురు.

వసు—సొమ్ముకావలసివచ్చినప్పుడు తన పెద్దలమూలమునఁగాక యితరులవలన సొమ్మెట్లుదొరకును. (అని వెళ్ళుచున్నాఁడు)

విజ—వసుకాముని యవినీతి సహించుటకు వీలుకాదు.

(అందఱు నిష్క్రమించుచున్నారు)



*

శ్రీరస్తు

# అపవాదతరంగిణి.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

(వసుకాముని యింట నొకగది.)

(వసుకాముఁడును, మాధవరావును, విజయవర్మయుఁ, ధనగుప్తుఁడును బ్రవేశించుచున్నారు)

వసు—అయ్యా! లోపలికి దయచెయ్యండి. ఇవిగో! మాపూర్వుల చిత్రపటములును, మాతండ్రిగారు బహుభక్తిశ్రద్ధలతోఁ బిత్రార్జితమని పూజించుచుండిన దేవతార్చనల సామానులు నిక్కడనున్నవి.

విజ—ఇంకను నిక్కడఁ జాలచరాస్తి కనుపించుచున్నదే.

వసు—ఈదేవతార్చనలోని సామానులును గొన్ని సాలగ్రామములును మా తాతగారు స్వయముగా కాశినుండి తెచ్చినారఁట. ఈ సాలగ్రామములును యీచిత్రపటములును నితరులు కొనరను భీతిచే నింతవఱకు నమ్మక యుచ్చటనే యుంచితిని.

విజ—ఇట్టిచిత్రపటములును, సాలగ్రామములును నేనెక్కడను జూచి యుండలేదు. ఇందుఁ గొన్ని యపూర్వమైనవి గనుపించుచున్నవి.

వసు—అప్పన్నా! ఇట్టిచిత్రపటములుగాని సాలగ్రామములుగాని నీవెన్నఁడును జూచియుండవు. మాతండ్రిగారు చనిపోయినప్పుడు తమమరణశాసనములో వీనిని బహుజాగరూకతతోఁ గాపాడుచుండుమని వ్రాసిరి. మాధవరావూ! నీవీదేవతార్చనపీఠముపై నెక్క వీనినన్నిటినీ ద్వరలో నమ్మివేయుము.

విజ—(తనలో) వీఁడు తనతండ్రి దేవతార్చనసామగ్రియుఁ దనపెద్దలచిత్రప



టములు నమ్మఁదలఁచుటయేకాక యత్యుత్కృష్టమైన దేవతాపీఠమును గూడ నేఁటికిట్టి యయోగ్య కార్యమున కుపయోగించి పరమనాస్తికుఁ డగుచున్నాఁడు.

వసు—ఇవియన్నియుఁ వేఱువేఱుగా నమ్ముటకంటె మొత్తముగా నమ్మివేయుటమంచిది.

మాధ—అవును. ఏలాగుననో యొకలాగున నివియన్నియుఁ ద్వరలోఁ దగుల బెట్టిపోదము; పాపమువిక్రమసేనుఁ డొంటరిగాఁ గూరుచుండును.

వసు—అప్పన్నా! ఇదిగో, మాపినతండ్రి విజయవర్మగారు నాకుఁ దమకుఁ గల ప్రేమను వెల్లడిచేయుచుఁ జెన్నపట్టణమునుండిపంపిన తమచిత్రపటమును దప్ప వీనినన్నిటి నయిదువేల రూపాయల కమ్మెదను.

మాధ—మనయింటిపీడ నేఁటితో వదలిపోవును. ఈపాడుపటములు, దేవతార్చనయు నెక్కడలేనిస్థలము నాక్రమించినవి.

విజ—నాకు విజయవర్మగారి పటముఁగూడ మీరిచ్చినయెడల నింకొకవేయి రూపాయ లెక్కువిచ్చెదను. ఈపటములలో నదియే చక్కగానున్నది.

వసు—నీవు పదివేలరూపాయ లిచ్చినను నేనాపటమునమ్మను. నాకాయనయందు గల గౌరవమునకు నేనాపట మమ్మజాలను.

విజ—నాకాపటమే ముఖ్యముగా గావలయును. అది మీరమ్మనియెడల నాకీపటములును దేవతార్చనయు నక్కఱలేదు.

వసు—నాబంధువుఁడు, స్నేహితుఁడును నగు పురుషోత్తమరావు కష్టదశయందుంటి నని నన్ను సహాయముగోరి యుండుటచే నేను వీనినమ్ముచుంటిని గాని వేఱుగాదు; నీవు వీనినిఁ గొనకపోయినయెడలఁ బోనిమ్ము గాని నేను విజయవర్మగారి పటముమాత్రమమ్మను.

ధన—పురుషోత్తమరావు కష్టదశలోనున్నాఁడని మీరే చెప్పుచున్నారు. అతనికి మీరిట్టిసమయములో సహాయము చేయుటకంటె ధర్మకార్యము మఱియొకటిలేదు. అప్పన్న కోరిన పటమునుఁగూడ మీరిప్పు డమ్మివేసినయెడ

ల రూపాయల నిప్పుడే మీరందవచ్చును. సందేహింపక మీరాపటమునుఁ గూడ నిచ్చివేయవలయును.

వసు—ఆపత్కాలములో సహాయము చేయుట ధర్మకార్యమని యెంచి, దానిని నిర్వహించుటకు నేనీదుష్కార్యము చేయను. (అని నిష్క్రమించుచున్నాఁడు)

ద్వితీయరంగము.

వసుకామునియింట నొకగది.

(విజయవర్మయు, ధనగుప్తుఁడును ప్రవేశించుచున్నారు)

ధన—విజయవర్మగారూ! చూచినారా, దామోదరవర్మగారు చెప్పినమాటకనుగుణముగా నెట్లుప్రవర్తించుచున్నాఁడో, నాకతనిదుస్థితి చూడఁ జాల విచారముగానున్నది.

విజ—అవును, కాని, నాయందాతనికి గౌరవమెంతమాత్రమును దగ్గలేదు.

ధన—వసుకాముఁడు చీట్లాడుటయుఁ ద్రాగుటయుఁ గూడ మొదలుపెట్టినాఁడు.

విజ—ఏమైనను నాయందాతనికిఁ గల విశ్వాసమునకును గృతజ్ఞతకును మిక్కిలి సంతోషముగానున్నది.

ధన—అతను జూదమాడుటఁగూడ మొదలుపెట్టినాడండీ.

విజ—ప్రపంచములో విశ్వాసముకన్నను, గృతజ్ఞతకన్నను నెక్కువ సద్గుణములేవు. ఈసద్గుణములు గలవాఁడెన్నఁటికైన యోగ్యుఁడు కాకమానఁడు. ఇదిగో వీరభద్రుఁడు.

(వీరభద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వీర—విజయవర్మగారూ! మీరేమో వసుకామునియొద్దఁ గొన్నిసామానులు గొన్నట్లున్నది.

విజ—అవును. వాఁడు తన పెద్దల చిత్రపటములను జిరకాలార్జితమైన దేవతార్చన సామానులను బ్రాఁతయిత్తడివలె నొక నిముషములో నమ్మివేసినాఁడు.



వీర—ఇదిగో, మీరాతనికిఁ గ్రయముక్రింద నిచ్చిన సొమ్ములోఁ గొంత పురుషోత్తమరావున కివ్వవలసినదని నాచేతికిచ్చినాఁడు. అది మీకే యివ్వవలయును గాదా?

ధన—వసుకాముని స్థితి మిక్కిలి విచారకరముగానున్నది. అతఁడు తనకుమాలినధర్మము గూడఁ జేయుచున్నాఁడు.

వీర—ఇప్పుడే వసుకామునియొద్ద కిద్దఱు ఋణదాతలు వచ్చి బదులుపుచ్చుకొనిన తమ సొమ్మిమ్మని యడుగుచున్నారు. పురుషోత్తమరావున కిచ్చుటమాని తనయప్పు తీర్చుకొని యున్నయెడల బాగుగానుండును.

విజ—సరే. దానికేమి, పురుషోత్తమరావునకు సహాయముచేయుటయందు వసుకాముని యోగ్యత వెల్లడియైనది. అతని ఋణములన్నియు నేను తీర్చివేసెదను. ఇప్పుడే కామపాలునియొద్దకుఁ బురుషోత్తమరావు వేసమువేసికొని వెళ్ళి యతనిస్వభావముఁ గూడఁ దెలిసికొని వత్తమురమ్ము.

వీర—మీరు తొందరపడఁగూడదు. దామోదరవర్మగారిప్పుడు కామపాలునితో మాటలాడుటకు వెళ్ళినారు.

(రాముఁడు ప్రవేశించుచున్నాఁడు)

రామ—అయ్యా! క్షమించండి; అయ్యగారు పని చెప్పుటచేత మీయొద్ద సెలవుపుచ్చుకోలేదు. ధనగుప్తుఁడుగారూ! మీతో ఒకమాట చెప్పవలెను.

(ధనగుప్తునితో రాముఁడు నిష్క్రమించుచున్నాఁడు)

విజ—వీరభద్రా! మేమిప్పుడిక్కడకు రాఁగానే రాముఁడు ధనగుప్తునిఁ తన జీతముమీఁద నప్పిమ్మని యడిగినాఁడు. ఈయింట యజమాని మొదలు సేవకునివఱకు నప్పులపాలై యున్నట్లున్నారు.

వీర—ఇది మఱి వింతగానున్నది.

విజ—ఈమాట వాస్తవమే. ఇంతేకాక తన యజమానుని సామానులను దాను స్వతంత్రముగాఁ దాకట్టు పెట్టెదననియుఁ దన యజమానునకావస్తువులు కావలసివచ్చినపుడు మఱికొన్ని యితరవస్తువులు తనయొద్దనుంచుకొని

యావస్తువులు పుచ్చుకొనుటకుఁ గూడ రాముఁ డొప్పుకొన్నాఁడు. యజమానుని వస్తువులను సేవకులు దొంగిలించుట వినియుంటిమే కాని స్వేచ్ఛగాఁ దాకట్టు పెట్టుటమాత్రము వినియుండలేదు.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

తృతీయరంగము.

కామపాలునియింటఁ గచేరీచావడి.

(కామపాలుఁడును సేవకుఁడును బ్రవేశించుచున్నారు)

కామ—పద్మావతియొద్దనుండి యెవరైన వచ్చినారా?

సేవ—ఎవ్వరును రాలేదండి.

కామ—(తనలో) పద్మావతి తానువచ్చుటకు వీలు గలుగకపోయినయెడల మనుష్యునైనఁ బంపకపోవుటకుఁ గారణమేమో తెలియకున్నది. దామోదరవర్మకు నామీఁద నెంతమాత్రము ననుమానములేదు. పద్మావతితోఁ గలసి నేను పన్నిన తంత్రములవలన జానకిని నేను వివాహమాడనేరకపోనని నాకుఁ జాల ధైర్యమున్నది. వసుకాముని యయోగ్యతయు, దుష్ప్రవర్తనమును నాకిప్పుడీకార్యసానుకూలమునకు మిక్కిలి యుపయోగపడుచున్నవి.

(తలుపు కొట్టుచున్నట్లొకధ్వని వినిపించుచున్నది)

సేవ—పద్మావతి వచ్చినట్లున్నదండి.

కామ—తొందరపడి తలుపు తీయవద్దు మెల్లఁగా నివతలనుండి తొంగిచూచి మఱి తలుపుతీయుము. అది వసుకాముఁడైనయెడల నాతోఁ జెప్పక తలుపుతీయవద్దు.

సేవ—ఆవచ్చినది తప్పకుండ పద్మావతియేనండి. ఆమె యీవేళనే పొరుగిండ్లకు వెళ్ళుతూవుంటుంది.

కామ—ఆగు. ఆగు. తొందరపడకు; ఆకిటికీ మూసివేయుము. ఆకిటికీలోనుంచి మన యెదుటింటివారి పిల్లవాఁడు కనుపించుచున్నాఁడు. అత నరఁగు మీఁదఁ గూర్చుండి యిక్కడ కెవరువచ్చినది చూచుచుండును.



(సేవకుఁడు కిటికీమూసి వెళ్ళుచున్నాఁడు)

ఇప్పుడు నాప్రజ్ఞ యంతయు నుపయోగించి నేను బహుజాగరూకతతో సంచరింపవలెను. జానకితో నేను మాటలాడుచుండగాఁ బద్మావతిచూచి యనుమానపడినది. పద్మావతిని నేను సంపూర్ణముగా స్వాధీనపఱచుకొనువఱకును జానకివిషయమై నేనుచేయు ప్రయత్నములామె కెంతమాత్రమును దెలియకుండునట్లుచేసి యిదివఱ కామెకుఁగలిగిన యనుమానమును బోఁగొట్టవలయును.

(పద్మావతి ప్రవేశించుచున్నది)

పద్మా—కామపాలుఁడుగారూ! మీరేమో దీర్ఘాలోచనలో నున్నట్లున్నారు. ఒంటరిగాఁ గూర్చుండి యోగాభ్యాసము చేయుచున్నట్లాలాగున నున్నారేమి? నే నింతకంటెఁ ద్వరగా రావలయునని యెంతప్రయత్నించినను దయ్యమువలె దామోదరవర్మగారరఁగుమీఁదఁ గూర్చుండి యెంతసేపటికిఁ గదలినారుకారు. ఇప్పుడే యాయన గదిలోనికి నిద్రపోవుటకు వెళ్ళఁగాఁజూచి తలుపు వెలపల గొళ్ళెముపెట్టి పరుగెత్తుకొని వచ్చినాను.

కామ—పద్మావతీ! నీవు పడుచున్న బాధలన్నియు నాకుఁ జక్కఁగాఁ దెలియును. పాపము నీవేమి చేయఁగలవు. నీకన్నివిధములుచేతను నెక్కడలేని కష్టమును సంప్రాప్తమైనది. కాకి ముక్కునకు దొండపండు గట్టినట్లు దామోదరవర్మకు నిన్ను వివాహముచేసి నీతల్లిదండ్రులు నీగొంతుకఁ గోసినారు.

(అని పద్మావతిప్రక్కను గూర్చుండెను)

పద్మా—కామపాలా! నాబ్రతు కన్నివిధములచేతను మిక్కిలి దుఃఖకరముగా నున్నది. దామోదరవర్మగారికి నే నేమి యపకారమును జేయకయే నాకాయన యెక్కడలేని చెఱనుఁ దెచ్చిపెట్టి నాప్రాణములు నాకు ధారవోయుచు నన్నెప్పుడు చూచినను దిట్టుచు కసరుకొనుచు నున్నారు. పరమమిత్రుఁడవని పేరుబెట్టుకొని నాస్థితినిఁగూర్చి నీవైనను విచారపడకుం

డుట వింతగానున్నది. ఆయనకు నామీఁదఁగల యనురాగమునకుఁ దోడు
వసుకామునకును నాకును నేమో స్నేహసంబంధ మున్నదని యనుమానప
డుచు నన్ను మఱింత బాధపెట్టుచున్నారు.

కామ——(తనలో) సుభద్రమ్మ మొదలగు నాయాప్తులీయపవాదము దామోదర
వర్మ హృదయమున నాటి ఆయన దానిని నమ్మునట్లు చేసినందుకు నాకు మి
క్కిలి సంతోషముగానున్నది.

పద్మా——దైవానుగ్రహమువలన నాయన జానకిని వసుకాముని వివాహమాడని
చ్చిన బాగుగానుండును. అప్పుడైన నిందల వాస్తవ మాయనకు బోధ
పడును.

కామ——(తనలో) అంతపని నాకంఠములోఁ బ్రాణముండఁగా జరగనియ్యను.
(పైకి) ఆమాటవాస్తవమే; ఆయన కకారణముగాఁ గలిగిన యనుమానము
పోవుటయుండఁగా జానకిని నేనేమో వివాహమాడవలెనని యున్నానను
దురభిప్రాయము గూడఁ బోవును.

పద్మా——అవును. నీవు చెప్పినమాట నిజమే. కానినావిషయమై జనుల
నుకొను నపవాదలవలన నాకుమిక్కిలి విచారముగానున్నది. నా
స్నేహితురాలువలె నటించుచు సుభద్రమ్మకూడ నన్నుఁగూర్చి యె
న్నియపవాద లాడుచున్నదో చూచినావా? అవియన్నియు ని
ష్కారణముగా నామెకు నేనేమి యపకారమునుఁ జేయకయే పుట్టిం
చినది. అందువలన నాకుమఱింత విచారముగా నున్నది.

కామ——నీవు చెప్పినదంతయు నిజమే. అకారణముగా నేదైన నపవా
దము పుట్టినచో మిక్కిలి సంతాపకరముగా నుండును. అట్టి యప
వాదలలో నొకదానికైనఁ గొంతవఱకైన నిజమున్నచో నంతవిచారక
రముగా నుండదుసుమీ ?

పద్మా—— అవును. ఉన్నమాటంటే నాకువిచారమే యుండదు. ఏపా
పము నెఱుగనిదీ, నన్ను లేనిపోని మాట లనుటచేత నాకుఁ గష్టము



గా నున్నది. నా స్నేహితులను గాని యితరులనుగాని నేనెన్నఁడు
ను పరిహాసమునకైన నొకమాటైన నాడి యెఱుఁగను. ఇట్లునా స్నే
హితులే నామీఁద నపవాదములు వేయుచుండుట నాకుమిక్కిలి సం
తాపకరముగా నున్నది. ఇదియిట్లుండఁగా దామోదరవర్మగారి
యెడల నాకుఁగల గౌరవమునకాయన నాయెడల నేదో లేనియ
నుమానమును గల్పించుకొని నన్నాడరాని మాటలాడుచుఁ జంపుకొ
ని తినుచున్నారు. నేనుమంచిమాటాడిన నాయనకుఁ దప్పుగానే
తోఁచుచుండును. మాటలాడ కూరకున్నచో సిగ్గునుభిడియమును లే
క మొరడువలె నూరకున్నావేమందురు. నేనీకాపురము చేయుట
కంటె నెందులోనైనదిగ్గుటమంచిదని తోఁచుచున్నది. ఈమధ్య నా
పేరంటేనే యాయనకుఁ బొత్తిగా పనికిరాకున్నది. ఆయన నన్నే
మన్నను నాగుణమును, నాయనయందు నాకుఁగల గౌరవమును,
విశ్వాసమును దైవమునకే తెలియును.

కామ——పద్మావతీ! నీ వూరకుండినయెడల నిట్లేయుండును. ఈకష్ట
ము లన్నియు నీవే తెచ్చి పెట్టుకొన్నావు. దామోదరవర్మకు నీయె
డల లేని ప్రేమయు గౌరవమును నీకుమాత్ర మాయనయెడల నెం
దు కుండవలెను. లేనిమాట పుట్టినచో విచార ముండుననియు,
నున్నమాట పుట్టినచో విచార ముండదనియు మీకుఁ దెలిసియు నీ
మీఁదఁ గలిగిన యపవాద లన్నిటివలనను నీకుఁ గలిగిన విచార
ము పోఁగొట్టుకొనుటకు నామాటల నన్నిటిని నిజముగాఁ జేసి నిన్ను
పీడించుచున్న యీవృద్ధపిశాచముపై నీవేల పగ దీర్చుకొనఁ గూడ
దు? కారణము లేకయే భర్తకు భార్యపై ననుమానము గలిగినపు
డట్టి నిత్యశంకితుని దగినట్లు దండించి బుద్ధిచెప్పుటయే మేలు.

పద్మా——అయితే, ఆయన యనుమానములను నిజముగాఁ జేయుటకు
నన్ను దుష్కార్యములను జేయుమనియా నీయభిప్రాయము?

కామ—వాస్తవముగా నాయభిప్రాయము నదే. నీభర్తకును నీయందుఁగల యభిప్రాయమునకుఁ దగినట్లు నీవు సంచరించుట న్యాయముగాని మఱియొక విధముగా సంచరించుట ధర్మముఁగాదు.

పద్మా—నీవు చెప్పినది బాగుగానే యున్నది. కాని నాయందేదోషమును లేకయే—

కామ—అయ్యో! నీవెంత యమాయకురాలవో గదా, నేనెంత బోధించి చెప్పినను నిందలి ధర్మమును గ్రహింపనే లేకపోయినావు. నిర్దోషివని నీయంతరాత్మ బోధించు విషయమే నీకింత మనస్తాపమును బుట్టించుచున్నది. నిదోషను నన్నెవరేమనుకొన్న నేమని యూరకున్నచో నీకింకనుఁ గష్టములు సంప్రాప్తమగుచునే యుండును.

పద్మా—సరే. ఇదియంతయు నాప్రారబ్ధముగాని మఱియొకటికాదు.

కామ—నేను చెప్పినట్లు నీవు చేసినయెడల దామోదరవర్మయు నీవు నెంతయన్యోన్య ప్రేమాతిశయముతోఁ గాఁపురముఁ జేయుదురో నీకే తెలియును.

పద్మా—అట్లు మేమన్యోన్య ప్రేమాతిశయముతోఁ గాపురముఁ జేయు నదృష్టముగూడ సంభవించునా.

కామ—నామాటనమ్ము. మీరిద్దఱు సుఖముగాఁ గాఁపురముఁ జేయుటయే గాక నీమీఁదఁ బుట్టిన యపవాదములుగూడ తగ్గిపోవును. నీవిప్పుడు లోకులును నీభర్తయు ననుకొనునట్లు దుష్ప్రవర్తకురాలవు గాకయు నీయంతరాత్మ బోధించునట్లు సత్ప్రవర్తకురాలవు గాకయుఁ ద్రిశంకుస్వర్గమునం దున్నట్లున్నావు.

పద్మా—అయితే సరే. నీనీతిబోధలన్నియు నేను దుష్కార్యములను జేసి నామీఁద లోకు లన్యాయముగా వేసిన యపవాదలన్నియు వాస్తవముగాఁ జేయుమనియా నీహితోపదేశము.

కామ—నిశ్చయముగా నాయభిప్రాయమదియే.



పద్మా—నీ నీతిబోధ లింకఁ జాలును. అపవాదలు పోఁగొట్టుకొనుటకు నీవు చెప్పిన యుపాయము బహువింతగానున్నది.

కామ—ఇదిమిక్కిలి యుచితమైన యుపాయము. నామాటనమ్ము.

పద్మా—నీవు చెప్పుమాటలు బహువింతగానున్నవి. నాకిష్టములేనిపని నేనెట్లు చేయఁగలను.

కామ—ఇష్టమనఁగా నెంతటిది. మొదట నిష్టము లేకపోయినను దరువాత నదే యిష్టమగును. అలవాటు పడినతరువాత నేపనియైన నిష్టముగానే యుండును. దైవసాక్షిగా గౌరవహాని చేయు కార్యములను జేయుమని నా స్నేహితులకు నేనెన్నఁడును సలహా చెప్పను.

పద్మా—గౌరవమున కేమిలే. నీవు చెప్పినప్రకారము చేసినయెడల గౌరవముగూడ నెక్కుడుండును.

(అని వెళ్ళఁబోవుచున్నది.)

కామ—పాపము పల్లెటూరిలోఁ బుట్టిపెరిఁగిన దానవు గనుక నీకింకను నేను చెప్పినమాటలయందలి యంతరార్థము దెలియకున్నది.

పద్మా—నేను పల్లెటూరిదాననైతే నైనాను. నీమాటలయందలి యంతరార్థము నాకక్కఱలేదు. దామోదరవర్మగారు నన్నెంతకష్టపెట్టినను నేను నాప్రాణమునైన విడుతునుగాని నాగౌరవమును బోఁగొట్టుకొన నొల్లను.

(అని వెళ్ళఁబోవుచున్నది.)

కామ—అయితే నీసౌందర్యమంతయు నావృద్ధపిశాచమునకు ధారవోయఁ దలఁచితివా? (అని పద్మావతి చేయిపట్టుకొని యామెను నాపుచున్నాఁడు)

(సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సేవ—లేదండి. దామోదరవర్మగారు వచ్చినారు. ఆయన వచ్చినాతని మీతో ముందుగాఁ జెప్పకపోతే మీరు కోపపడతారని వచ్చినానండి.

కామ—దామోదరవర్మగారా! అయ్యోదైవమా! ఇప్పుడు నేనేమి చెయ్యను!

పద్మా—ఆయన యిక్కడికే వచ్చినారు. నాపాపము పండినది. ఇఁక నాకేమిగతి!

సేవ—ఆయన వస్తే నేనేమి చెయ్యను. ఆయనతో మీరిద్దఱు లోపల తలుపులు బిగించుకొని వ్యవహారము మాటలాడుచున్నారని నేను చెప్పలేదు.

పద్మా—నేఁటితో నాపని అయినది. ఆయన నన్నొంటిగా నిక్కడఁ జూచి యేమనుకొనినను అనుకొనును. అదుగో! పైజాలఁ జప్పుడు వినఁబడుచున్నది. ఆయన వచ్చుచున్నట్లున్నారు. నేనీ బీరువాచాటున దాఁగికొనెదను. బుద్ధిలేక యిక్కడకు వచ్చినందులకు బాగుగానే జరిగినది.

(అని తొందరగా బీరువాచాటున దాఁగికొనుచున్నది.)

కామ—(సేవకునితో రహస్యముగా) ఆ భగవద్గీతల పుస్తకము ద్వరగా యిటు తీసికొనిరా. (పుస్తకము పుచ్చుకొని చదువుచున్నవానివలె నటించుచున్నాఁడు.)

(దామోదరవర్మ ప్రవేశించుచున్నాఁడు.)

దామో—కామపాలుఁడెప్పుడు చూచినను గ్రంథకాలక్షేపమే చేయుచుండును.

(అని కామపాలుని వెన్నుచఱచుచున్నాఁడు)

కామ—దామోదరవర్మగారా! క్షమించండి. తమరు వచ్చినది నేను చూడనేలేదు. (అని పుస్తకము మూసి యొకప్రక్కను బెట్టి) భగవద్గీతలలో విశ్వరూపసందర్శనఘట్టమున శ్రీమచ్ఛంకరభగవానులవారు వ్రాసిన భాష్యమును జూచుచున్నాను. తమరిక్కడకు దయచేయుట నాకుఁ జాలా సంతోషముగా నున్నది. ఈయుపనిషద్భాష్యగ్రంథములు నేను కొనినతరువాతఁ దామిక్కడకు దయచేయనేలేదు. ప్రతిదినము నేదైన నొకగ్రంథ మొకగంటసేపైనఁ జదువనియెడల నాకుఁ దోఁచదు.



దామో—ఈ గ్రంథసామాగ్రి బహుబాగుగా నున్నది. నీవు కాలము వృథపుచ్చక యేదియో యొకటి చదువుచునే యుందువు. బుద్ధిమంతుల లక్షణ మిదేగద. ఈబీరువాలోఁ గూడ నన్నియుఁ బుస్తకములే యున్నట్లున్నవి. ఇందులోఁ బుస్తకము లుంచుట కిది మిక్కిలియుపయోగకరముగా నుండును.

కామ—పుస్తకము లుంచుటకే కాదు. బీరువా పెద్దదగుటచే నది యనేకవిధముల నుపయోగించుచున్నది.

దామో—గ్రంథములు బీరువాలో నుంచుటవలన నేగ్రంథము కావలసినను ద్వరితముగాఁ దీసికొనవచ్చును.

కామ—(తనలో) తొందరసమయములోఁ ద్వరగా దాఁగికొనుటకుఁ గూడ నుపయోగించును.

దామో—కామపాలా! నేను నీతోఁ గొంచెము మాటలాడవలెను.

కామ—(సేవకునితో) నీవు వెళ్ళిపో.

సేవకుఁడు—చిత్తము (అని వెళ్ళుచున్నాఁడు.)

కామ—దామోదరవర్మగారూ! తమరీతివాచీపైన దయచేయండి.

దామో—కామపాలా! నీతో రహస్యముగాఁ గొన్ని సంగతులు మాటలాడి నీయభిప్రాయమును దెలిసికొనవలెనని చాలకాలమునుండి యాలోచించుచున్నాఁడను. ఒకవిషయమును గూర్చి నామనస్సు మిక్కిలి బాధపడుచున్నది. మనమిప్పు డిద్దఱమే యున్నాముగనుక నామనస్సులోనున్న దంతయు నీతోఁ జెప్పి నీయభిప్రాయమును తెలిసికొనవలెనని యున్నది. మనకిద్దఱకును గలస్నేహముపట్ల రహస్యమెందుకు. పద్మావతినిఁ గూర్చి జనులనుకొను మాటలు నిజమనియో అబద్ధమనియో నీయభిప్రాయము చెప్పవలెను.

కామ—పద్మావతినిఁగూర్చి యపవాదలా! ఈమాటవినుటకే నాకుఁ జాల విచారముగను ఆశ్చర్యముగ నున్నది. పద్మావతివంటి యోగ్యురాలినిఁ గూర్చి మీరనుమానపడుటఁ గూడనా?

దామో—జనులాడుకొను మాటలు నమ్మక విధిలేదు. దానినడత చూచినను దానిమాటలు చూచినను నాకనుమానముగనే యున్నది. దానికి నాయందెంతమాత్రమును గౌరవము లేదు. దానిని జూచిన నాకు దానిగుణ మంతయుఁ జెడిపోయినదని గట్టినమ్మకము గలిగినది.

కామ—ఏమిటి! మీరు చెప్పు మాటలు వినఁగా నాకు మిక్కిలి ఆశ్చర్యముగా నున్నది.

దామో—ఆసంగతంతా నేను దెలిసికొన్నాఁడను. దానికిఁ బ్రబలనిదర్శనములు దొరకినవి.

కామ—మీకు నిదర్శనములు గూడ దొరకినవా? మీమాటలు వినిన నాకు మిక్కిలి ఆశ్చర్యముగా నున్నది.

దామో—ఎందుకు. సంగతంతయుఁ జెప్పినతరువాత నీకే నమ్మకము పుట్టును.

కామ—ఈవిషయమై మీమన సెంత బాధపడుచున్నదో నామనసు గూడ నీమాట వినుటమాత్రము చేతనే అపరిమితముగ బాధపడుచున్నది.

దామో—పద్మావతినిగుఱించి పుట్టినమాటలు నిశ్చయమని నాకుఁ గట్టినమ్మకము గలిగినది. కామపాలా! గృహచ్ఛిద్రములుగూడ సందేహము లేకుండఁ జెప్పుటకు నీవంటి స్నేహితుఁడు నాకు దొరకుట మిక్కిలి సంతోషముగా నున్నది. అయితే అతఁడెవరో నీవూహించఁ గలవా?

కామ—నాకు బొత్తిగాఁ దెలియదు. ఒకవేళ నాదుర్మార్గుఁడు చలపతిరావు కాఁడుగద?



దామో—అబ్బే! కాదుకాదు. వసుకాముఁడు—

కామ—మాతమ్ముఁడా! ఏమి మీరాలా సెలవిచ్చుచున్నారు. నేనామాట నమ్మఁజాలను.

దామో—నీవు మిక్కిలి యమాయకుఁడవు! ఇతరుల మనసుఁగూడ నీమనసువంటిదే యనినమ్మి మోసపోవుచున్నావు.

కామ—దామోదరవర్మగారు! ఎవరిమనసులో నేమిరాలోచన లున్నవో మనము దెలిసికొనలేముసుమండీ. యోగ్యులగుమీవంటి స్నేహితుని మనసు నొవ్వఁజేయుట కెట్లు సాహసింతురోగదా! దుర్మార్గులయాలోచనలును గార్యములును మనమెంతమాత్రమును గ్రహింపఁజాలముగద. ఏదోగ్రంథము చదువుకొనుచు నింటఁబడియుండు నావంటివాని కితరులచర్యలు తెలియుట కష్టము.

దామో—నీవుచెప్పినమాట వాస్తవమే. నీతమ్మునికిఁ జదువేమియు నక్కఱ లేదుగద. అతఁడు దుష్టులతోఁగూడి యేమిదుష్కార్యములను జేయుచుండునో నీకెట్లు తెలియును?

కామ—కాని, పద్మావతి యిట్టిపని చేసినదని నేనుమాత్రము నమ్మఁజాలను. ఆమె బహుబుద్ధిమంతురాలు.

దామో—బుద్ధికేమి, స్త్రీబుద్ధియెప్పుడు నమ్మరాదు. వాండ్రబుద్ధి స్వభావముచేతనే చంచలమైనది. అందులో నేనేండ్లుగడచినవాఁడనగుటచేతను, వసుకాముఁడు పడుచువాఁడగుటచేతను పద్మావతి అట్టిపనిచేసినదన్నయెడల నాశ్చర్యమేమున్నది.

కామ—అవును, ఆమాట నిజమే. కాని—

దామో—ఇంతవయసువచ్చినతరువాత నేను దానిని వివాహమాడుట నాదేతప్పు. ఈసంగతి విన్నవాళ్ళు నన్నుఁ జూచి నవ్వక మానరు. నేనుచేసిన దానిఫలము నేననుభవించుచు మాట్లాడకపడియున్నాను.

కామ—అవునండి. మనమిప్పుడప్రతిష్టపడలేము. వీధిలోనిపోరుకన్న నింటిలోనిపోరు మెఱుఁగు.

దామో—అప్రదిష్టయనుచున్నావేమిటి. సంఘదురాచారసంస్కరణసభవారు తమయుపన్యాసములలోను పత్రికలలోనుఁ బ్రకటించియు హాస్యసంజీవనులలో వ్రాసియు మఱింతయప్రదిష్ట దెచ్చిపెట్టెదరు. నాప్రాణమునకీసభలు వారపత్రికలుఁగూడ దొరకినవి. ఎవరైన నేళ్ళుగడచిన పెద్దమనుష్యుఁడు వంశమునిలుపుకొనుటకు వివాహముచేసికొనఁ బ్రయత్నించినయెడల నాతనిపేరు చెప్పి యుపన్యాసములు చేసి మహాసభలు గూడఁ జేయుచున్నారు.

కామ—అవునండి. పాడుకాలమువచ్చినది. మీకీసంగతి యెవరికిని దెలియనియ్యఁగూడదు.

దామో—చిన్ననాఁటనుండియుఁ బెంచి పెద్దవానినిఁజేసిన నాస్నేహితునికొమారుఁడిట్టిపని జేసెనని నాకుమిక్కిలివిచారముగానున్నది.

కామ—కృతఘ్నులును విశ్వాసహీనులును నెంతకార్యమైనఁజేయుటకు సాహసింతురు.

దామో—నాకొమారునివలెఁ బెంచి నాకెప్పుడు నేదియుఁ గొఱతరాకుండఁగాపాడుచు మంచిమార్గమునఁ బ్రవర్తింపఁజేయవలయునని నాశక్తివంచన లేకుండ బాటుపడుచుండిన నాకుఁ దుదకు వసుకాముఁ డిట్టియపకారము చేసినాఁడు.

కామ—మీరింత చెప్పినను నాకెందుచేతనో యింకను నమ్మకముపుట్టలేదు. తమకేదియో నిదర్శన మగపడక తామట్లనుమానము పడువారుగారు. ఈసంగతి నేను వినినప్పటినుండియు వసుకాముఁడు నాసోదరుఁడని చెప్పుకొనుటకుఁగూడ నాకుసిగ్గుగానున్నది. ఇట్టి విశ్వాసహీనుఁడునుఁ గృతఘ్నుఁడును నగు వానికేశిక్షచేసినను జేయఁదగును.

దామో—నీబుద్ధియెక్కడ వానిబుద్ధియెక్కడ. దుర్మార్గుఁడెప్పటికినిదుర్మార్గుడే.

కామ—పద్మావతి యింతగౌరవహాని చేకుఱుపనిఁ జేయుటకెట్లుసాహసించెనోగద! ఆమె బహు బుద్ధిమంతురాలు.



దామో—ఇఁక దానితో నాకక్కరలేదు. అది యేమైపోయినను సరే. దానినింటఁబెట్టుకొని యప్రదిష్టకుఁ బాలగుచు దానితోఁ గయ్యమాడుచుండుటకంటె దానిమాట దలపెట్టకుండుట మేలు. అదినన్నన్నమాటలను బట్టియీ వృద్ధపిశాచము పోయినయెడలఁ దిరిగి పడుచువానిని బునర్వివాహము చేసికొనవచ్చునని నన్నెప్పుడో బలవంతముగ గొంతుపిసికి చంపునని కూడ భయముపుట్టుచున్నది. ఇంతయెందుకు నేఁడుమధ్యాహ్నమెండవేళఁ గొంచెము నిద్రపోదమని నేను గదిలోనికి వెళ్ళఁజూచి పైనఁ గొళ్ళెముపెట్టి యెక్కడికో పోయినది. ముసలివాఁడనగుటచేఁ గడుపుబ్బి కేకలువేయఁ బొరుగింటివారిపిల్ల వచ్చి తలుపుఁదీసినది. నాసౌఖ్యమీవిధముగా నున్నది. పదిదినములక్రిందటఁ దనకు మనోవృత్తి యిచ్చినయెడల నన్నువదలిపోదునని చెప్పినది. ఏదియో కొంత పాఱవైచి యీబాధ తప్పించుకొనఁదలచియున్నాఁడను.

కామ—మీయంతఃకరణ మెంతయోగ్యమైనదండి. మీరు మంచివారుగనుక మనోవృత్తి యిచ్చెదమని చెప్పినారు. మఱియొకరైనయెడల నొకచిల్లిగవ్వైననియ్యక యిల్లువెడలఁ గొట్టుదురు.

దామో—అవును. నిశ్చయముగా దానికేమైన మనోవృత్తి నేర్పఱచి నేనాపని జేయఁదలఁచినాను. అయితే, జానకిని వివాహమాడుటను గూర్చి నీవేమాలోచించినావు.

కామ—(మెల్లఁగా) పోనియ్యండి. ఆమాట యిప్పుడెందుకు. ఆసంగతినిగూర్చి తరువాత మాటలాడవచ్చును.

దామో—జానకికి మునుపటికంటె నీయందనురాగము గొంచెమంకురించినట్లే తోఁచుచున్నది. దానిని నీవువివాహమాడినయెడల నేనుచాలసంతోషింతును.

కామ—(మెల్లఁగా) ఆమాట మీరిప్పుడు తలపెట్టవద్దు. మీగృహచ్ఛిద్రములను గూర్చి మాట్లాడునపుడు నావివాహముసంగతి యెందుకు. మీకెంతకష్టముసంప్రాప్తమైనపుడు నేనుమాత్రము వివాహమాడి సంతోషించువా

డను కాను. (తనలో) నాకన్నివిధములచేతను గష్టమేవచ్చినది. నాదొంగ
తనమంతయు నిప్పుడు పద్మావతికిఁ దెలియునని భయముగానున్నది.

దామో—జానకిని నీవువివాహమాడఁ బ్రయత్నించుచున్నావనుమాట పద్మా
వతికి రుచికరముగా నున్నను బద్మావతి కీవివాహమంతగా నయిష్టముగా
నుండదని నేనుదలఁచెదను.

కామ—దామోదరవర్మగారు ! నన్నుక్షమించండి. స్నేహితులయాపత్కా-
లములలో నాస్నేహసంబంధ మగుమాటలను నేను వినఁజాలను. దయచేసి
మీరామాటఁ దలపెట్టినన్నాయాసపెట్టవద్దు.

(సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సేవ—అయ్యా ! మీతమ్ముఁడుగారు వీధిలో నెవరితోనో మాటలాడుతూ
మీరింట్లోవున్నారాయని నన్నడిగినారండి.

కామ—నేనింట్లోలేను నేనూరిలోనే లేనని చెప్పు.

దామో—వద్దు. అలాగునఁ జెప్పవద్దు. నాకిప్పుడొకయుపాయము తోఁచినది.
కామపాలుఁ డింటిలోనే యున్నాఁడని చెప్పుము.

కామ—సరే. అలాగైనయెడల నాతనిలోపలికిఁ దీసికొనిరమ్ము.

(సేవకుఁడు వెళ్ళుచున్నాఁడు.)

(తనలో) ఇందుమూలముగనైన దామోదరవర్మ జానకిపేరు తలపెట్ట
మానివేయును.

దామో—కామపాలా ! నీవునాకుఁ బరమమిత్రుఁడ వైనందుకు నాకీసహాయ
ము నీవుచేయకతప్పదు. నన్నెలాగునైనవసుకాముఁ డిక్కడకు వచ్చులో
పల నీగదిలో నేమూలనైన దాఁచిపద్మావతివిషయమై యాతని నీవు స్వ
యముగా నడిగి ప్రమాణికముగా నతఁడు చెప్పుమాటలను నేను స్వయము
గా వినునట్లు చేయవలయును.

కామ—దామోదరవర్మగారు! క్షమించండి. నేనిట్లు మోసపుకృత్యములను
జేయఁజాలను. తామిక్కడలేరని నాతమ్మునితో నబద్ధమాడి యతనియంత



రంగముగ నేనెట్లాతనిచే మీరువినునట్లు చెప్పించి నాతమ్ముని మోసపు
చ్చును ! ఇట్టిదుష్కార్యమునకు నాకు మనసొప్పకున్నది.

దామో—అలాగునఁ జెప్పవద్దు. తాము నిర్దోషినని నీతమ్మునిచే నీవుచెప్పింపగ
లిగినయెడల నామనస్తాపమును బోఁగొట్టి నాకుసంతోషమునుఁ గలుగజేయు
టయేగాక నీతమ్మునియందు నాకుఁగల యనుమానమును బోఁగొట్టి యతని
కి మహోపకారము చేసినవాఁడవగుదువు. ఈవిషయములలో నీవు నేను చె
ప్పినట్లు చేయకతప్పదు. (అనినడచుచు) ఇదుగో ! ఈబీరువాచాటున
దాఁగికొనుటకుఁ వీలుగానుండును. (అని తొంగిచూచి) ఇక్కడ నెవరో
యున్నారు. మనమనుకొనిన మాటలన్నియు నామనుష్యునకు వినఁబడినట్లు
న్నవి. చేతిని గాజులుగూడఁ గనుపించుచున్నవి. అదిఆడదిలాగుననున్నది.

కామ—దామోదరవర్మగారు ! నారహస్యము నేఁటికి మీకన్నులఁబడినది. భ
యముచేత నేనిదివఱదాఁక మీతోఁ జెప్పకపోయినను స్నేహముపట్ల ని
ప్పుడుమీదగ్గఱదాఁచుట మంచిదికాదు. నేను కేవలము సుకయోగినని తమ
తో మనవి చెయ్యలేను. ఏమిటో చిన్నతనము. తమరు క్షమించవలెను.
పొరుగింటికివచ్చుచుండు పూజారివారిపిల్ల మాయింటికి వచ్చి నేనెంత త
ప్పించుకొని తిరిగెదమన్నను నన్నువదలిపెట్టక దయ్యమువలె బాధిం
చుచున్నది.

దామో—కామపాలా ! నీవిట్టివాఁడవని నేను కలలోనైనఁ దలఁపలేదు. దాని
కేమి, నాభార్యనుగూర్చి నేనన్నమాటలన్నియు నాపిల్లవినినదిగాఁబోలును.

కామ—మీకాభయమక్కఱలేదు. పద్మావతినిఁగూర్చి యాపిల్లయేమాట వినిన
ను. రెండవచెవినిఁబడదు.

దామో—అయితే భయములేదు. ఇదిగో ! ఇక్కడ నొకప్రాఁతపెట్టె కనఁ
బడుచున్నది. ఇందులోఁగూర్చుండివసుకామునకగపడకుండ దాఁగికొనెదను.

కామ—సరే, అలాగుననే చేయవచ్చును. మీయుపాయము బహుబాగు
గానున్నది.

దామో—ఈపెట్టె సమయమునకు బహుబాగుగా దొరకినది. నేనిందులోఁ గూర్చుండి సంగతులన్నియుఁ జక్కఁగా వినవచ్చును. (అనిపెట్టెలో గూర్చుండుచున్నాఁడు.)

కామ—మృత్యువునోటనుండి తప్పించుకొనిన వానివలె నేఁడీమహోపద్రవమునుండి నేను తప్పించుకొనినాఁడను. ఇంతకును నేఁడు నేనులేచినవేళ మంచిది. నాప్రయోజకత్వమువలన నీయుపద్రవమునుండి తప్పించుకొని భార్యాభర్తల నిద్దఱను జెఱియొకచోటను భద్రముగా దాఁచినాఁడను.

పద్మా—(కొంచెముతొంగిచూచుచు నేనిక్కడనుండి పాఱిపోయిన యెడల బాగుగానుండునని తోఁచుచున్నది.

కామ—నీపుణ్యము. ఇటు అటు కదలక చాటుననిలిచి యుండుము.

దామో—(పెట్టెలోనుండి తలపైకెత్తి) వసుకాముని నీవు గ్రుచ్చిగ్రుచ్చి యడిగి సంగతంతయుఁ గూలంకషముగా దెలిసికొనవలెను. నాకువినఁబడు నట్లుగట్టిగాఁ జెప్పింపవలెను.

కామ—మీచిత్తమువచ్చినట్లు చేసెదను. మీరు తలమాత్రము పైకెత్తకండి.

పద్మా—(తొంగిచూచుచు ) ఆపెట్టెకుఁ బైనతాళమువెయ్యరాదా ?

కామ—నీపుణ్యము, కొంచెముసేపు మాటలాడకుము.

దామో—(తలయెత్తిచూచుచు) ఆబీరువాచాటుననున్న అమ్మాయి నాసంగతి యెవరితోను జెప్పదుగద.

కామ—మీకాభయమెందుకు. తలయెత్తకండి ఇంకా వంగవలెను. కొంచెము తలగనుపించుచున్నది ; యింకా తలవంచవలెను. ఈపెట్టెకు మూఁత తాళము నున్న బాగుగానుండును.

(వసుకాముఁడు ప్రవేశించుచున్నాఁడు.)

వసు—అన్నగారూ! కుశలమా? విశేషములేమి ? రాముఁడునన్ను లోపలికి రానిచ్చినాఁడుకాఁడు. మీరు తలుపులన్నీ బిగించుకొని గదిలోఁ గూర్చుండుటఁజూడ నేవో విశేషమున్నట్లున్నది.



కామ—ఏమివిశేషమునులేదు. ఊరికే తలుపువేసికొని కూర్చున్నాను.

వసు—నేనువచ్చినానని విని దామోదరవర్మగా రెక్కడికో పాఱిపోయినట్లున్నది. ఆయనతో మాటలాడవలెనని నేనిక్కడకు వచ్చినాఁడను.

కామ—ఆయన యిప్పుడే వేఱుపనిమీఁద నెక్కడికో వెళ్ళినారు.

వసు—దామోదరవర్మగారు నేనప్పడిగెదనని భయపడి యెచటికో పాఱిపోయినారు కాఁబోలును.

కామ—లేదు. లేదు. వసుకామా! పాపమాదామోదరవర్మగారిని నీవాయాసపెట్టుట తగదుసుమా.

వసు—ఆసంగతినిఁగూర్చి నేనుకూడ ననేకులవలన వినినాఁడను. ఆయనను నేనెట్లాయాసపెట్టుచుంటినో నాకుఁ దెలియకున్నది.

కామ—ఇంతయెందుకు. ఆయనయనుమానము నేను వాస్తవముగాఁ జెప్పెదను. ఆయన సంసారసుఖము చెఱచి పద్మావతిని నీవు ప్రేమించినట్లనుమానము పడుచున్నాఁడు.

వసు—నేనా! ఈమాట బహుచమత్కారముగానున్నది. పాపము, దామోదరవర్మగారు తమ ముసలితనములో నీవివాహమాడుటఁ బట్టి యిట్టియనుమానములఁ బడుచున్నారు. ఒకవేళఁ పద్మావతి తనభర్త ముసలివాఁడని యెంచి ఆయనయందనురాగము లేకున్నదిగాఁబోలును.

కామ—ఈవిషయమును నీవేమో చులుకనగాఁ జూచుచున్నావు. ఇట్లు దీనిం గూర్చి హాస్యాస్పదముగా మాటలాడుటఁ దగదు. వాస్తవము చెప్పవలెను

వసు—ఆలాగునైనచో నేను వాస్తవమునేచెప్పెదను. పద్మావతిని నేనెన్నఁడును బ్రేమించలేదు. ఆమెయందు నాకు మఱియొక యభిప్రాయమెన్నఁడును బుట్టలేదు.

కామ—అయితే సరే. దామోదరవర్మగారికీమాట యెక్కడలేని మనశ్శాంతిని గలుగఁజేయును.

వసు—నిశ్చయముగా నొకప్పుడు పద్మావతి నన్నుఁ బ్రేమించినట్లనుమానపడితి

నిగాని నాకెన్నఁడును నామెయందు మాతృభావముఁ దక్క మఱియొక యభిప్రాయము లేకపోవుటఁబట్టియు, నేను జానకినిఁ బ్రేమించి యాదిన్నదానిని వివాహమాడఁదలఁచితిని కాఁబట్టియు నే నట్టిదుష్కార్యమునకొడిగట్టలేదు.

కామ—పద్మావతి యొకవేళ నిన్నుఁ బ్రేమించినట్లగపడినను నీవుమాత్రమామెనుఁ బ్రేమించుట తప్పుసుమా.

వసు—నే నెన్నఁడును నాస్వల్పబుద్ధివలన దుష్కార్యములను జేయలేదు. కాటికిఁ గాళ్ళుచాచుకొని యింద్రియపటుత్వము దప్పియున్నవాఁ డొకవేళఁ దనకు మనుమరాలుగా నుండఁదగిన చిన్నపిల్లను వివాహము చేసికొనినయెడల నది దుష్ప్రవర్తకురాలయి తన్నుఁ బ్రేమించినచో నెవ్వఁడట్టిదానినిఁ బ్రేమింపకుండఁగలఁడు.

కామ—అయితే దుష్కార్యములనుఁ జేయవలయునా. పరస్త్రీలనాశించుట తప్పుకాదా.

వసు—అయితే మీయొద్ద నేను నీతివాక్యములను నేర్చుకొనవలసియే యున్నది. అన్నగారూ! తేమరుచేసినపని నేను చేసినానని చెప్పుచుఁ బద్మావతితో నాకేమో సంబంధమున్నదని చెప్పుటకుఁ దమకేల సిగ్గులేకున్నదో నాకాశ్చర్యముగానున్నది.

కామ—వసుకామా! సిగ్గువిడియము వదలి పెద్దలదగ్గఱ నీవిట్లనుట తగదు. లోకులు నీవిషయమై చెప్పుకొనుమాటలను నమ్మక సోదరుఁడవని నిన్నసుగవన్నిట్లని నామనసు నొప్పించుట నీకుఁదగదు.

వసు—నిశ్చయముగా నీకామెయందనురాగమున్నదని నీనడతవలనే ననేకపర్యాయములు గనిపెట్టినాఁడను.

కామ—అది కేవలమబద్ధము. నిశ్చయముగా నాకామెయందట్టి యభిప్రాయమే లేదు.

వసు—నీవు పద్మావతితో రహస్యముగా మాటలాడుచుండఁగా నేను చూచినాను.



కామ—ఛీ. ఛీ. అట్టియపవాదలాడకుము.

వసు—ఒకపర్యాయము రాముఁడు—

కామ—(వసుకాముని చేయిపట్టుకొని నీతో నొకమాట చెప్పెదను. (తనలో) వీనికి నారహస్యమంతయుఁ దెలిసినట్లున్నది. వీనితో నిఁక నీవిషయమును గూర్చి మాటలాడఁగూడదు.



వసు—ఉత్తరమును దీసికొనిపోవుచు—

కామ—చాలు; చాలు. గట్టిగా మాటలాడకు. దామోదరవర్మగా రొకవేళ నీమాటలను విందురు. నీవు నిర్దోషివని నేను దృఢముగా నమ్మియుండని యెడల నిన్నీసంగతినిగూర్చి యడుగక నేపోదును.

వసు—ఇప్పుడే అవతలకు వెళ్ళిన దామోదరవర్మగారు నామాటలను వినుటకెట్లువీలుపడును. అయితే ఆయన యీగదిలో నేమూలనో దాఁగియుండియుండవలెను.

కామ—(మెల్లఁగా) నిజము చెప్పుతాను. అదిగో అక్కడ (అని పెట్టెవైపుఁ జూపించుచున్నాఁడు)

వసు—ఆలాగుననా! అయితే దామోదరవర్మగారి దర్శనము చేసెదను.

కామ—వద్దు వద్దు నీవాపని చెయ్యవద్దు (అని వసుకాముని చేయిపట్టుకొని బ్రతిమాలుకొనుచున్నాఁడు)

వసు—(పెట్టెయొద్దకుఁబోయి) దామోదరవర్మగారూ! నమస్కారము. తమరిక్కడ నున్నారని విని తమదర్శనము చేయవచ్చినాను. తమరీప్రాంతపెట్టెలో నింతశ్రమకోర్చి యిట్లు బాధపడుచు దాఁగియుండుటకుఁ గారణమేమో నాకుఁ దెలియకున్నది. (అని దామోదరవర్మను చేయిపట్టుకొని యీవలకు లాగుచున్నాఁడు)

దామో—వసుకామా! నీవు బహుయోగ్యుఁడవు. నిష్కారణముగాఁ బరలాడిన మాటలను విని నీయందు లేనియనుమానము దెచ్చిపెట్టుకొన్నాను. ఇ

ప్పుడు నామనస్తాప మంతయుఁ బోయినది. నీవు చెప్పినమాటలవలన ని
ర్దోషివని నేను దృఢముగా నమ్మినాఁడను.

వసు—పోనియ్యండి. ఇంతటితో సరిపోయినది. నేను కామపాలునితోఁ జె
ప్పఁదలఁచిన మాటలన్నియు మీరు వినలేదు.

దామో—నిన్నమొన్నయులకు నీవు తిరిగి కామపాలు ననఁదలఁచుకొంటివికాదు?

వసు—అబ్బే; అది యూరక హాస్యమున కన్నమాటసుమండీ.

దామో—అవును నీవ్వు వేఱే చెప్పనక్కఱలేదు. కామపాలుని యోగ్యతంత
యు నాకు బాగుగాఁ దెలిసినది.

వసు—దామోదరవర్మగారూ! ఒకవేళఁ బద్మావతితోఁ గామపాలునిఁ జూ
చి మీరు నన్ననుకొనలేదుగద.

దామో—ఇఁక నెందుకు నీమాట నమ్మినాను.

(సేవకుఁడు ప్రవేశించి కామపాలుని చెవిలో నేమో చెప్పుచున్నాఁడు)

వసు—రాముఁడూ! ఆరహస్యమేమిటి?

సేవ—ఏమీలేదండి సుభద్రమ్మగారు వచ్చినారు. ఆవిడ అయ్యగారితో నే
మో రహస్యముగా మాటలాడవలెనని వచ్చినది.

కామ—సుభద్రమ్మా! ఆమె యిప్పుడెందుకు వచ్చినది. ఆమెను లోపలికిఁ దీ
సికొనిరావద్దు.

(సేవకుఁడు వెళ్ళుచున్నాఁడు)

దామోదరవర్మగారూ! వసుకామా! నాకిప్పుడు కొంచెమవసరమైన పనియు
న్నది. ఆవలకు వెళ్ళెదను. నాకొఱకొక పెద్దమనుష్యుఁడు వచ్చియు
న్నాఁడు.

వసు—ఆపెద్దమనుష్యునిక్కడకు రమ్మను.

కామ—ఆయన యిక్కడకు రాఁడు. నేనే అక్కడకు వెళ్ళి మాట్లాడవలెను.

వసు—పోనీ, ఆయనను గొంచెము సావడిలోఁ గూర్చుండుమని చెప్పు. నేను
దామోదరవర్మగారినిఁ జూచి చాలకాలమైనది. మీతోఁ జాలసంగతులు



మాటలాడవలెను.

కామ—(తనలో) వసుకాముఁడు దామోదరవర్మతో మాటలాడఁగూడదు.
ఇతఁడిఁక నిక్కడనున్నచోఁ బద్మావతి దాఁగియున్న స్థలముగూడఁ గని
పెట్టఁగలఁడు. (పైకి) అయితే సుభద్రమ్మను వెళ్ళమని చెప్పి తిరిగి యి
ప్పుడేవచ్చెదను. (అనిచెప్పి సుభద్రమ్మ పేరు చెప్పినందుకుఁ బెదవి కొఱ
కికొనుచు దామోదరవర్మతో రహస్యముగా) మీరువాచాటున నున్నపిల్ల
సంగతి యితనితోఁ జెప్పవద్దు.

దామో—(కామపాలునితో రహస్యముగా) నేనాసంగతి యితనితో నెంత
మాత్రము జెప్పను.

(కామపాలుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

వసుకామా! నీయన్న బహుయోగ్యుఁడు. నీవీపాడుసహవాసము లిఁక మానివే
సి యతనిసహవాసము చేసినయెడల బహు బాగుగానుండును. అతనిమాట
లలో నీతులు గురియుచుండును.

వసు—చాలుఁ జాలు. అతని నీతిబోధనలకు మీరే సంతోషించవలెను. ఆనీ
తులన్నియు మాటలలోనేగాని చేష్టలలో నెక్కడను లేవు.

దామో—కాదు కాదు. అతనిసంగతిని నీవెఱుఁగవు. అతఁ డెంతమాత్రము
దుర్మార్గుఁడుగాఁడు. (తనలో) పూజారివారిపిల్లసంగతి యితనితోఁ జె
ప్పుదునా!

వసు—అవునండి. ఆయన కేవలము అస్ఖలితబ్రహ్మచారి.

దామో—నీవాతని నట్లాక్షేపింపఁగూడదు. నీవిట్లంటివని తెలిసినయెడల నా
తనిమనసు నొచ్చును.

వసు—అయితే నేనిట్లంటినని యాతనితోఁ జెప్పెదరుకాఁబోలును.

దామో—నేనెందుకు చెప్పెదను. అయితే నీతో నొకమాట చెప్పెదను. ఇ
టురా. (తనలో) ఇతనితోఁ జెప్పితే భయములేదు. (పైకి) కామపాలుని
సంగతి వింటివా?

వసు—ఏమిటి?

దామో—(మెల్లఁగా) నేనిక్కడకు వచ్చునప్పటికిఁ గామపాలుఁడును ఒక చిన్నదియు నీగదిలో నున్నారు.

వసు—ఏమిటి! కామపాలుఁ డట్టిపనిచెయ్యఁడు. అతను బహుయోగ్యుఁడు. మీరూరక యనుచున్నారు.

దామో—నామాటనమ్ము. ఆచిన్నది పూజారివారిపిల్ల. నామాట నమ్మకపో యినయెడల నేనాపిల్ల నీగదిలోఁ జూపించెదను.

వసు—ఈగదిలోనా? ఎక్కడనున్నది?

దామో—నెమ్మదిగా మాటలాడు. అదిగో! (అని బీరువావైపుఁ జూపించు చున్నాఁడు)

వసు—ఆబీరువావెనుక దాఁగియున్నదా? అయితే నిఁక నాభామవేషమును రంగస్థలములోనికిఁ దీసికొనివత్తును.

దామో—వద్దు. నామాటవిను, వద్దు. అతఁడు వచ్చుచున్నాఁడు.

వసు—పోనీ; ఆమె రూపురేఖవిలాసము లెట్టివో చూచెదను.

దామో—వద్దు. నామాటవిను. ఈసంగతి కామపాలునకుఁ దెలిసినయెడల న న్నుఁ బ్రతుకనియ్యఁడు.

వసు—మీకేమి భయములేదు. మీకింతమాత్రముగా నే హానియు రాకుండఁ గాపాడెదను. (అని బీరువాదగ్గఱకుఁ బోయి పద్మావతి చేయిపట్టుకొని యీవలకీడ్చి) పద్మావతీ! నీవేనా పూజారివారిపిల్లవు?

దామో—పద్మావతియా; పద్మావతియా!

వసు—దామోదరవర్మగారూ! చూచినారా, ఎంతలోఁ బద్మావతి పూజారి వారి పిల్లగనుఁ బూజారివారిపిల్ల పద్మావతిగను మారినదో! ఒహో! కామ పాలుని యోగ్యత బహు విచిత్రముగానున్నది. భార్యాభర్తల నిద్దఱిఁ నింతదాఁకఁ దాఁగుడుమూఁత లాడించినాఁడు. అన్నగారూ! ఇదంతా యేమిటి? తమ నీతిబోధవలన్నియుఁ దుదకీలాగునఁ బరిణమించినవేమి?



తమ నీతివాక్యములు మానివేసి మాటలాడక తలవంచుకొని వెలవెలపోవు చు నాలాగున నిలిచియున్నారేమి? దామోదరవర్మగారూ! ఇప్పుడైనఁ సంగతులంతయు మీకు బోధపడినదా? మాటాడరేమి? దీనియర్థము నాకు బోధపడలేదు. ఇందలి రహస్యము అనుభవముగల పెద్దలుగనుకఁ దమకే బోధపడవలెను. కామపాలుని యోగ్యత యెట్లున్నదో చూచినారా? (అని వెళ్ళఁబోవుచు). కామపాలా దామోదరవర్మగారికి నీవుచేసిన యప కారము సహింపనర్హముకాదు. దామోదరవర్మగారూ! కామపాలుఁడు బహుయోగ్యుఁడు సుమండి. (అని వెళ్లుచున్నాఁడు)

కామ—దామోదరవర్మగారూ! క్షమించండి. నావేషములన్నియుఁ బయలు పడినవి వాస్తవము మనవిచేసెదను. తాము నన్ను క్షమించితిమన్నయెడల సంగతంతయుఁ జెప్పెదను.

దామో—అదియేమో చెప్పుము?

కామ—ఏమియులేదు. పద్మావతి జానకిని నేను వివాహమాడఁదలఁచితి నని విని మీయభిప్రాయ మేమైయుండునో యనితలఁచిజానకికి నాయందిష్టము లేదనుమాట గ్రహించి, మీకు వసుకాముని దిష్టములేదనుమాట దెలిసికొ ని నాతో మాటలాడుట కిక్కడకు వచ్చి మీరు వచ్చినసంగతి విని భయ పడి ఆబీరువాచాటున దాఁగికొనినది. దైవసాక్షిగా నమ్మవలెను.

దామో—సంగతంతయుఁ బూసగ్రుచ్చినట్లున్నదున్నట్లు చెప్పినాఁడవుగాఁ బోలును. పద్మావతీ! ఈమాట వాస్తవమేనా?

కామ—(పద్మావతితో రహస్యముగా) నీపుణ్యము. ఆసంగతి చెప్పక నన్ను రక్షింపుము.

పద్మా—కామపాలుఁడుగారూ! మిమ్ములను రక్షించుటకు నేనెంతదానను. నా కుఁ దోచినట్లు వాస్తవము చెప్పెదను; నన్ను మీరు నిజమాడవద్దని బా ధపెట్టవద్దు.

దామో—పద్మావతియేమోచెప్పుచున్నది. దానిమాటలకు నీవడ్డమురావద్దు.

పద్మా—నేనుచెప్పెమాటవినండి. నేనిక్కడకు జానకి వివాహమును గూర్చి మాటలాడుటకు రాలేదు. జానకిని యీయన వివాహమాడఁ దలఁచినాఁ

డని కూడ నేనెఱుఁగను. మన సంసారమును జక్కఁబఱచి మీకు నా యందు దయగలుగుట కుపాయమును చెప్పెదనని నన్నిక్కడకుఁ బిలిచి నాపాతివ్రత్యముఁ జెఱచి నన్నుఁ దనకు వశురాలినిఁగాఁ జేసికొనుటకు నాకు దుర్బోధలనుఁ జేయుచున్నాఁడు.

దామో—ఇప్పుడు నాకు వాస్తవమంతయుఁ జక్కఁగాఁ దెలిసినది.

కామ—ఆమాటలు నమ్మవద్దు. ఆమె భయముచేత మతిలేనిమాటలాడుచున్నది.

పద్మా—నేనెంతమాత్రమును భయపడవలసిన యవసరములేదు. నీవే యిప్పుడు భయపడుచున్నావు, (దామోదరవర్మగారితో) అయ్యా! తాము నా మాటలు నమ్మినను సరే నమ్మకపోయినను సరే, నాకుఁ దమయందుఁగల గౌరవమునకును, విశ్వాసమునకును నాయంతరాత్మయు, దైవమునుమాత్రమే సాక్షులు. ఈకామపాలుఁడు మిక్కిలి దుర్మార్గుఁడు, జానకిని వివాహమాడఁ దలఁచి ఆసంగతి యబద్ధమని నాయొద్ద బొంకుచు దనకుఁ బరమాప్తులైన మీకు భార్యననియైన శంకింపక తల్లిమెడలోని మంగళసూత్రము ద్రెంచు దుర్మార్గునివలె నన్నుఁ దనకు వశ్యురాలినిగఁ జేసికొని యమాయకస్వభావముగల మీవంటి యుత్తమునకు మిత్రద్రోహ మాచరింపఁదలఁచిన యీపరమనీచునిఁ గన్నెత్తిచూచుటకయిన నాకసహ్యముగానున్నది.

(అని నిష్క్రమించుచున్నది)

కామ—ఇది యంతయు నాగ్రహచారఫలముగాని మఱియొకటికాదు. నిజము దైవమునకే తెలియును.

దామో—అవును. నీవు పరమనీచుడవనియు, దుర్మార్గుఁడవనియు, మిత్రద్రోహివనియు, దైవమునకుఁ దెలిసినమాట వాస్తవమే.

కామ—దామోదరవర్మగారూ! మీరు తొందరపడి యాగ్రహపడవద్దు. నేను చెప్పుమాటవినండి. మీయందింత గౌరవముగల నేనిట్టిపని చేయుదునా?

దామో—నీగౌరవమును, విశ్వాసమును నేటితోఁ దెలిసినది. ఇకఁ జాలును. నీమాటలతో నాకవసరములేదు.

(అని కోపముతో నిష్క్రమించుచున్నాఁడు)

శ్రీరస్తు

# అపవాదతరంగిణి.

## పంచమాంకము.

### ప్రథమరంగము.

రంగము:—కామపాలునియింట నొకగది.

(కామపాలుఁడును సేవకుఁడును ప్రవేశించుచున్నారు)

కామ—కార్యమంతయుఁ జెడి నేను విచారించుచు నాపత్సముద్రములో మునిఁగియుండఁగా పురుషోత్తమరావు వచ్చినాఁడని చెప్పవచ్చినావు. మూలిగేడు నక్కమీఁదఁ దాటిపండు పడినట్లు నన్నీసమయములోఁ బీడించుకొని తినుటకితఁడుగూడ వచ్చినాఁడు. నీవిట్టివాండ్ర నందఱిని లోపలికెట్లు రానిచ్చినావు.

సేవ—లేదండి; ఆయనను నేరానియ్యక నేపోదును. వీరభద్రునితోఁగూడఁ గలసివచ్చుటచే లోపలికి రానియ్యనంటే మీకు కోపమువస్తుందని రానిచ్చినాను.

కామ—ఏడిచినట్టేవుంది. నీవు యెప్పుడు నీలాగుననే చేస్తూవుంటావు. అపారమైన యాపత్సముద్రములో నేను స్నేహితులను బంధువులను చూస్తాననుకొన్నావు. సరే; లోపలికి తీసికొనిరా.

సేవ—చిత్తము. ఆలాగేనండి. పద్మావతిగారిని మీరీబిరువాచాటున దాఁచిన సంగతి దామోదరవర్మగారు కనుక్కొంటే నేనేమిచెయ్యాను, నామీఁద మీరిట్లా కోపపడుతారు.

కామ—నోరుమూసికొనిపో, నీకీసంగతులు యిందుకు?

(సేవకుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

నాగ్రహచారస్థానములు బాగుగా లేవు. నేనెంతదూరమాలోచించి యేకార్యము దలపెట్టినను నది విఫలమగుచున్నది. నాయయోగ్యతయు నా కుచోద్యవ్యాపారమును నేఁటితో దామోదరవర్మగారికి బయలుపడి పోయినది. జానకిని నేను వివాహమాడఁగలనన్న యాస నేఁటితోఁ బోయినది. నా మాటలవలనను నడతవలనను దామోదరవర్మగారిని మోసబుచ్చి జానకి నే నైన వివాహమాడవలె నని నేనెన్ని యకార్యములు కొడిగట్టి విశ్వప్రయత్నము చేసితినో యదియంతయు నేఁటితోఁ జెడిపోయినది. మహాపద్దశయందున్న నేనీసమయములో నితరులకు సహాయము చేయుటగూడనా! పురుషోత్తమరావుతో నేనిప్పు డేమని మాటలాడను. నాహృదయము దపించుకొనిపోవుచున్నను పైకిఁగనఁబడనీయక నవ్వుమొగముతో నుండి యూరడింపఁబడవలసిన నేను పురుషోత్తమరావు నూఱడింప వలసివచ్చెను. అదిగో! వీరభద్రుఁడును బురుషోత్తమరావును వచ్చుచున్నారు. కొంచెము చిఱునవ్వు దెచ్చికొని వారినాదరించి మర్యాదచేసెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

(విజయవర్మయు, వీరభద్రుఁడును బ్రవేశించుచున్నారు.)

విజ—వీరభద్రా! కామపాలుఁడు మనలఁ జూచియుఁ జూడనట్లు తలవంచుకొని లోనికిఁ బోవుచున్నాఁడు.

వీర—అతని స్వభావమట్టిదేనండి. అతని నెవరు చూడవచ్చినను దన్నేమైన నడుగుదు రనియనుమానపడి వారితో మాటలాడుటకుఁ గూడ నిష్టపడఁడు.

విజ—ఇట్టివాఁడు ధార్మికుఁ డని దామోదరవర్మ యెట్లునమ్ముచున్నాఁడో గదా.

వీర—ఇతని మాటలు విని మోసపోయి పాపము దామోదరవర్మగారీతఁడు పరమయోగ్యుఁడని నమ్ముచున్నారు. ఆయన యెదుటఁ దనకులేని యోగ్యతఁగనఁబఱచి మాయోపాయములవలన నితఁడు దనకార్యము గొనసాగించుకొనఁదలఁచియున్నాఁడు.

విజ—దామోదరవర్మగారు సంతోషించు నాతనిధర్మమిట్టిదేనా?



వీర—అదిగో! అతఁడు వచ్చుచున్నాఁడు. నేను వెళ్లెదను. తామాతనితోఁ బురుషోత్తమరావునని మాటలాడిరండి.

తరువాత మీపినతండ్రి విజయవర్మగారు వచ్చినారని మిమ్ముఁ దిరిగి లోనికిఁ దీసికొనివెళ్ళెదను.

(అని వెళ్ళిపోయెను)

(కామపాలుఁడు ప్రవేసించుచున్నాఁడు)

కామ—అయ్యా క్షమించండి. ఆలస్యమైనది. తమరేనా పురుషోత్తమరావుగారు? తమరినిగూర్చి నేను వినుటయేగాని దర్శనమెప్పుడును జేయలేదు.

విజ—చిత్తము.

కామ—దయచెయ్యండి. ఈలాగున తివాసీమీఁద దయచెయ్యండి. చాలాశ్రమపడివచ్చినట్లున్నారు. (అని విసనకఱ్ఱతో విసరుచు) తామిచటికి రావలెనా. తమరు కబురంపితే నేనే వచ్చిదర్శనముచేతును.

విజ—సరిసరి. తమరాలాగున సెలవియ్యవద్దు. (తనలో) ఇతను నాకుఁ జేయు మర్యాద చూడ ననుమానము గల్గుచున్నది.

కామ—తమదర్శనము నేనెప్పుడు నిదివఱకుఁ జేయలేదు. కాని తమయోగ్యతంతయువిని మనబంధువులలో నిట్టియోగ్యులున్నారని సంతోషించుచున్నాను. నేఁడు సుదినము. మీదర్శనమైనది.

విజ—సరిసరి. నేనెంతవాఁడను. ఇందంతయుఁ దమదయగాని మఱియొకటి కాదు: నేను మీతల్లిగారికి మేనమామకొమారుఁడను. ఇప్పుడంతా నాస్థితి చితికి పోవుటచేత మీబంధువుఁడనని చెప్పుకొనుటకు గూడ సిగ్గుపడుచున్నాను.

కామ—ఎంతమాట సెలవిచ్చినారు. కలిమిలేములకును బంధుత్వమునకును నేమి సంబంధమున్నది. మీరు నాకు సమీపబంధువులు. దైవలోపమువలన మీసంసారస్థితియంతయుఁ జెడిపోయినదని మనబంధుత్వమున కేలోపమును రాదు. నాయభిప్రాయమెప్పుడును నాబంధువులకు సహాయము చేయవలయుననియేగాని మఱియొకటికాదు.

విజ—మీపినతండ్రి విజయవర్మగారు నాకుఁ బరమాప్తులు. ఆయన యిక్కడనున్నయెడల నాకిట్టిసహాయమైనఁ జేతురు.

కామ—ఆయనయిప్పుడు చెన్నపట్టణములోనున్నారు. ఏమో ఆయనభాగ్యముచూచి వీరట్లనుకొనుచున్నారు. ఆయనయీదేశము వదలిపెట్టిన తరువాతఁ దనస్నేహితులనందఱిని మఱచిపోయినాఁడు. ఆయనకు వార్ధక్యము హెచ్చినకొలఁది ధనాశ హెచ్చుచున్నది. ఇంతయేందుకు, జనులాయన నాకెంతోఆస్తియిచ్చెనని చెప్పుకొందురు. తమతో నాయంతరంగము మనవిచేయుచున్నానుసుమండీ. ఆయన నాకొకచిల్లిగవ్వైన నియ్యకపోయినను ఆయన యాస్తియంతయు నాకేయిచ్చినాఁడని నేనెంతో విశ్వాసముగాఁ జెప్పుకొనుచుందును.

విజ—ఏమిటీ! తమమాట మిక్కిలిఆశ్చర్యముగానున్నది. ఆయనతమకెప్పుడు నేమియు నియ్యనేలేదా.

కామ—ఏమిచెప్పను. ఒకసారి యొక మధురతలరుమాలును, మఱియొకసారి యొక దక్షిణాది పంచెలచాపునుఁ జెన్నపట్టణమునుండి తెచ్చి నాకిచ్చినారు.

విజ—(తనలో) నేనిచ్చిన ద్రవ్యమున కంతకు నితఁడు కృతజ్ఞత బాగుగనే కనఁబఱచుచున్నాఁడు.

కామ—నాతమ్ముని స్థితియంతయు మీరు వినియే యుందురు. అతను దనయాస్తియంతయుఁ బోఁగొట్టుకొన్నాఁడు. అతనికిఁ గూడ నేనిప్పుడు కావలసినసొమ్మప్పుడప్పుడిచ్చుచున్నాను. నేనాతనికిఁ గావలసినప్పుడెల్ల సొమ్మిచ్చుచుండుటబట్టియే యతఁడిప్పటికినిఁ దనదుర్వ్యసనములను మానకున్నాఁడు. అతనికి సొమ్మిచ్చుటొకవిధముగా నాదేతప్పు. అయితే, యేమిచెయ్యను. నాసోదరునకు సహాయముచేయకుండుటకు నాకుమనసొప్పదు. పురుషోత్తమరావుగారు! ఎక్కడలేనిధనము మాతమ్మున కిచ్చుటకేచాలకున్నది. లేకపోయినచో మీకీసమయములో నేనెంతసహాయమైనఁ జేతును.



విజ—(తనలో) వీఁడుపకారశూన్యుడనినాకుఁ జక్కఁగాఁ దెలిసినది. వీనిస్వభావమువేఱె పరీక్షించనక్కఱలేదు. (పైకి) అయితే నాకు మీరిప్పుడేమాత్రమైన సహాయము చేయలేరా.

కామ—నాస్థితియంతయుఁ దమకుఁ జెప్పనేచెప్పినాను. ప్రస్తుతము క్షమించండి. ముందుఁ దమకెప్పు డేమికావలసినను తమరుత్తరము వ్రాయుట తడవుగాఁ బంపించుచుందును.

విజ—తమరు ముఖ్యముగా నాకీసమయములో సహాయము చేతురని నమ్మివచ్చినాను.

కామ—తమకిట్టిసమయములో నేనెంతమాత్రము సహాయము చేయనేరనందుకు నావిచార మింతింతని చెప్పఁజాలను. లేదని చెప్పుటకు మిక్కిలి విచారముగానున్నది.

విజ—చిత్తము. మీహృదయము చూడఁగా నాకంతయుఁ దెలిసినది. మీరంతగా సెలవియ్యనక్కఱలేదు.

కామ—ఇట్టిసమయములో నెంతమాత్రమైన సహాయము చేయలేని నాబ్రతుకెందుకు. రాముఁడూ! పురుషోత్తమరావుగారి నింటివఱకుఁ బంపిరమ్ము.

విజ—అక్కఱలేదు. నేనొంటరిగా వెళ్ళఁగలను.

కామ—చిత్తము నమస్కారము. సెలవుచేయండి.

విజ—సరిసరి మీరాలాగున సెలవియ్యవద్దు. సెలవుపుచ్చుకొనెదను.

కామ—మీకెప్పు డేవిధమైన సహాయము గావలసినను నాపేర వ్రాయండీ.

విజ—మీమాటేచాలును. నాకు కనకాభిషేకము చేసినట్లున్నది.

కామ—మీక్షేమముఁ దప్పక వారమునకొకసారి వ్రాయించవలెను.

విజ—దయయుంచండి.

కామ—సరిసరి మీరు నాయందు దయయుంచవలెను.

విజ—(తనలో) వీనిస్వభావమంతయు నాకిప్పుడు స్పష్టముగాఁ దెలిసినది.

(అని వెళ్ళుచున్నాఁడు)

కామ—మంచితనముగాఁ గనిపించుటచే నన్నందఱు నీవిధముగా బోధించుచున్నారు. అందఱిచేతను మంచివాఁడ ననిపించుకొనుటకు నేను లేనిపోని వేషములన్నియు వేయవలసివచ్చినది. మాటలతో నెంత ధార్మికస్వభావమైనఁ గనఁబరచఁగలను గాని చేతితో నొక చిల్లిగవ్వైన నిచ్చుటకు నాకు మనసొప్పకున్నది.

(వీరభద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వీర—కామపాలుఁడుగారూ! క్షమించండి. మీ రేదో తొందరపనిమీఁద నున్నట్లున్నారు. (అని యొక యుత్తరము చేతి కిచ్చుచున్నాఁడు.)

కామ—వీరభద్రా! యేమీ పనిలేదు. నీవువచ్చుటచేత నాకుఁ జాల సంతోషముగా నున్నది. (తనలో) వీఁడు వదలిన మఱియొకఁడు నన్ను బిశాచమువలె బాధించుచున్నాఁడు. (ఉత్తరమును జదువుచున్నాఁడు.)

వీర—విజయవర్మగారు నేఁడుదయ మీగ్రామము వచ్చినారు. మిమ్ములను జూడవలయు నని వచ్చి వీధిలోనున్నారు.

కామ—ఏమిటి! ఆశ్చర్యముగానున్నది. ఆయన వచ్చినసంగతి మాకెవ్వరికినిఁ దెలియనేలేదు. రాముఁడూ! ఇప్పుడు వచ్చిన పురుషోత్తమరావుగారి నొకపర్యాయ మిటు తీసికొనిరా.

వీర—ఆయన అప్పుడే వెళ్ళిపోయినాఁడు.

కామ—వీరభద్రా! నీవిక్కడికి వచ్చికూడ నాకీసంగతి మొదటనే యెందుకు చెప్పలేదు?

వీర—మీరిద్దఱు నేమోరహస్యము మాటలాడుదు రనియు విజయవర్మగారు మీతమ్ముఁడు వసుకాము నిక్కడకుఁ దీసికొనిరమ్మని చెప్పుటచేతను నేనావలకుఁ బోతిని.

కామ—మాతమ్ముఁడుగూడ నిక్కడకు వచ్చుచున్నాఁడని నాకుమిక్కిలి సంతోషముగానున్నది. (తనలో) నాకిదివఱకుఁ దటస్థమయిన యాపదకుఁ దోడీ యాపదగూడ తటస్థమైనది గాఁబోలును!



వీర—మీరు సోదరు లిద్దఱును విజయవర్మగారును నింతకాలమునకిక్కడఁ గలసికొనుట తటస్థమైనది.

కామ—మేము ముగ్గురము గలసికొని యెంతోకాలమైనది. (తనలో) వసుకాముఁడు గూడ నిక్కడకు వచ్చుచున్నాఁడని వినుటవలన నాగుండెలు బద్దలగుచున్నవి. నాగ్రహచారమువలన మాయవేషములన్నియు నిప్పుడు బయలుపడుచున్నవి. నాకిట్లన్నియాపద లొక్కసారిగాఁ దటస్థమయినవి.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

ద్వితీయరంగము.

రంగము:—సుభద్రమ్మయింట నొకచావడి.

(ఒకపరిచారికయు నన్నపూర్ణమ్మయుఁ బ్రవేశించుచున్నారు)

పరి—అమ్మగారికిప్పుడు తలనొప్పిగా నున్నది. ముసుఁగు పెట్టుకొని లోపలఁ బరున్నారు. మీరిప్పుడామెనుజూచుటకు వీలు లేదు.

అన్న—అన్నపూర్ణమ్మ వచ్చినదని చెప్పు. ఆమెతోఁ గొన్నిసంగతులు జరూరుగా మాట్లాడవలెను.

పరి—ఆమె కోపపడుతారండి. ఎవరువచ్చినను లోనికి రానియ్యవద్దని నాతోఁ జెప్పినారు.

అన్న—నీకేమీ భయములేదు లోనికివెళ్ళి చెప్పితే కోపపడుతారంటే అన్నపూర్ణమ్మగారు వచ్చినారని తలు పీవలనుండి కేకలువేసి చెప్పు,

(పరిచారిక వెళ్ళుచున్నది)

ఎంతవింత జరిగినదో! ఎన్నఁడూ అనుకోని సంగతి జరిగినది.

(చలపతిరావు ప్రవేశించుచున్నాఁడు)

చలపతిరావూ! దామోదరవర్మగారు స్వయముగా గదిలో—

చల—పద్మావతినిఁ గామపాలునిఁ జూచిన సంగతియేనా?

అన్న—దామోధరవర్మగారే స్వయముగాఁ జూడడము తటస్థమైనది.

చల—ఈసంగతంతయు వినుట కాశ్చర్యముగా నున్నది.

అన్న—పాపము! పద్మావతి గుట్టంతయు నేఁటితో బయలుపడినది.

చల—అయోగ్యుఁడగు కామపాలుని నమ్మినందుకు దామోదరవర్మకుఁ దుదకు బాగుగానే జరిగినది.

అన్న—కామపాలుఁడట్టిపని చేయలేదు. ఆపని చేసినది వసుకాముఁడు.

చల—కాదు, కాదు. ఆపని చేసినది కామపాలుఁడే నామాటనమ్ము.

అన్న—కామపాలుఁ డెంతమాత్రమును కాదు. పద్మావతియు వసుకాముఁడును మాటలాడుచుండఁ గామపాలుఁడు దామోదరవర్మగారికిఁ జూపించినాఁడు.

చల—కాదు నేనీసంగతి నమ్మకమైనవారివలన విన్నాను.

అన్న—నామాటనమ్ము. నేనీసంగతి స్వయముగా కళ్ళతోఁ జూచినవారివలన విన్నాను.

చల—నీకెవరు చెప్పినారు?

అన్న—తాము స్వయముగాఁ దనకళ్ళతోఁ జూచిన యొకపెద్దమనిషి చెప్పినాఁడు.

(సుభద్రమ్మ ప్రవేశించుచున్నది)

సుభ—అన్నపూర్ణమ్మగారూ! పద్మావతి సంగతి వినుటకు నాకు మిక్కిలి విచారముగానున్నదండీ.

అన్న—అది యిట్టిపని చేస్తుందని యెవరనుకొన్నారు?

సుభ—ఎవరిగుణమెట్టిదో ముఖముచూచి మనము కనిపెట్టలేము. అది యెన్నఁడు నట్టిపని చేయునని నేననుకొనలేదు. తుదకేమిచేసినదో చూచినావా?

అన్న—అది వయసులోనున్నది. దానిభర్త దామోదరవర్మగారు ముసలివాఁడుగద

సుభ—కాని దానిగుణ మట్టిదికాదు.

అన్న—అవునుగాని, సంగతంతా నీకు తెలసినదా?

సుభ—కొంతవఱకు విన్నాను. కామపాలుఁ డీదుష్కార్యమది చేసెనని యూరందఱునుఁ జెప్పుకొనుచున్నారు.



చల—అన్నపూర్ణమ్మగారూ! కామపాలుఁడే నని మీతోఁ జెప్పలేదా?

అన్న—కాదు కాదు. ఆపని చేసినది వసుకాముఁడు.

సుభ—వసుకాముఁడా! యీమాట వినుట కాశ్చర్యముగానున్నది.

అన్న—అవును. ఈపని వసుకాముఁడే చేసినాఁడు కామపాలుఁడు దామోదరవర్మగారితోఁ జెప్పినాఁడు.

చల—అన్నపూర్ణమ్మగారూ! మీతో నాకు వివాదమెందుకు దామోదరవర్మగారికిఁ దగిలిన గాయమెట్లున్నదో మీకుఁ దెలిసినదా?

అన్న—దామోదరవర్మగారి గాయముగూడఁ దగిలినదా? ఆయనను గొట్టిన సంగతి నేను విననేలేదు.

చల—కామపాలుఁడు దామోదరవర్మగారి తలమీఁదఁ గొట్టి పాఱిపోయినాఁడు.

అన్న—కామపాలుఁడుగాదు. వసుకాముఁడు.

చల—కాదు. కామపాలుఁడే.

అన్న—కామపాలుఁడు తనకు దామోదరవర్మగారియెడలఁ గల గౌరవమునకాయన నట్లు కొట్టడు. నిశ్చయముగా నామాట నమ్ము. ఆపని వసుకాముఁడే చేసినాఁడు.

చల—దామోదరవర్మగారినిఁ జూచినతోడనే పద్మావతి పాఱిపోయినది. కామపాలుని దామోదరవర్మగారు తిట్టినారు. అందుపైన దామోదరవర్మగారి తల పగులునట్లు కామపాలుఁడు కొట్టి పాఱిపోయినాఁడు.

(నారాయణవర్మ ప్రవేశించుచున్నాఁడు)

నారా—కామపాలుఁడు దామోదరవర్మగారి ముక్కుమీఁద గ్రుద్దినాఁడని తాను స్వయముగాఁ జూచిన యొక పెద్దమనిషి చెప్పినాఁడు.

అన్న—నారాయణవర్మగారూ! దామోదరవర్మగారికి గాయము దగిలినమాట నిజమేనా?

నారా—నిజమే దామోదరవర్మగారికిఁ జాల దెబ్బ తగిలినది. పాపమాయన జీవించుట కష్టము.

చల—ఈముసలితనములో నెత్తిమీఁద నంతకఱ్ఱదెబ్బ తగిలిన తరువాత జీవించుట యెక్కడిది?

నారా—పాపమాయన ముక్కుమీఁద నెక్కువగాయమే తగిలినది.

అన్న—పాపము. దామోదరవర్మగారి కెట్టియాపద వచ్చినదోగదా?

చల—అవును. వసుకాముఁడట్టిపనిఁ జేయవలసినది కాదు.

అన్న—చలపతిరావూ! వసుకాముఁ డన్నమాట యిప్పటికైనఁ దెలిసినదిగద?

చల—నారాయణవర్మకీసంగతి తెలియనే తెలియదు.

నారా—దామోదరవర్మగా రాతనిఁగోపము వచ్చునట్టు తిట్టినారు. అప్పుడు వసుకాముఁడు కోపము పట్టలేక దామోదరవర్మగారిని గట్టిగా ముక్కుమీఁద గ్రుద్దినాఁడు.

చల—దామోదరవర్మగారికిఁ గాయము తగిలినమాట వాస్తవమేగాని వసుకాముఁ డాయనముక్కుమీఁద గ్రుద్దలేదు. కామపాలుఁడే దామోదరవర్మగారి తల పగులునట్లు కఱ్ఱతోఁ గొట్టినాఁడు.

నారా—వీరిలోఁ గొందఱు వసుకాముఁడన్నియు మఱికొందఱు కామపాలుఁడనియుఁ జెప్పుచున్నారు. నే నిందలివాస్తవము దెలిసికొనవలయును.

(అని నిష్క్రమించుచున్నది)

చల—వసుకాముఁ డీనేరము చేసినాఁడని చెప్ప సుభద్రమ్మ యెట్లు విచారము గపఱచుచున్నదో జూచితివా?

నారా—నాకాసంగతంతయుఁ దెలియును. వసుకామునియందు సుభద్ర కెక్కడలేని మోహము నున్నది.

అన్న—పాపము దామోదరవర్మగారి కెట్లున్నదో? పాపము పద్మావతి యాయనకు సేవ జేయుచున్నది గాఁబోలు.

నారా—అవును. ఇప్పుడే వైద్యుఁడుఁగూడ వెళ్ళినాఁడు.

చల—ఎవరో వచ్చుచున్నారు.

నారా—ఆయనయే వైద్యుఁడు. ఆయనకు దామోదరవర్మగారి సంగతంతయుఁ దెలిసి యుంటుంది.



అన్న—అవును. ఆయన వైద్యుఁడులాగుననే గనిపించుచున్నాఁడు. దామోదరవర్మగారి గాయ మెట్లున్నదో ఆయన నడుగుదము.

(విజయవర్మ ప్రవేశించుచున్నాఁడు)

నారా—అయ్యా! దామోదరవర్మగారి గాయమెట్లున్నది?

అన్న—పాపమాయనకుఁ బ్రాణభయము లేదుఁగద.

చల—పాపము కఱ్ఱతో ఆయనతల పగులగొట్టినారఁట.

నారా—రక్తముఁ గాఱునట్లు ముక్కుమీఁద గ్రుద్దినారుగాదండీ!

విజ—ఏమిటి మీమాటలకర్థము నాకు బోధపడుటలేదు.

అందఱు—మీరు దామోదరవర్మగారికిఁ దగిలిన గాయముఁ గుదుర్చుటకు వెళ్ళిన వైద్యులుగారా?

విజ—మీమాట బహువింతగానున్నది. నేను వైద్యుఁడనుగాను.

చల—మీరు వైద్యులు గానేకారా?

విజ—నేను కాను. నన్ను జూచి మీరు వైద్యుఁడని యెట్లనుకొన్నారు.

అన్న—మీముఖము చూచి మీరు వైద్యుఁడే మోయనుకొన్నాము. కాకపోతే పోనియ్యండి. మీరు దామోదరవర్మగారి స్నేహితులు గాఁబోలు. ఆయనగాయ మెట్లున్నదో మీకుఁ దెలుసునా? నాకాసంగతి వాస్తవముఁ దెలియలేదు.

నారా—ఆయన కపాయకరమైన గాయము మీకుఁ దెలియదా?

చల—ఆయన తల కఱ్ఱతోఁ బగులఁగొట్టినాఁడు.

నారా—రక్తము గాఱునట్లాయన ముక్కు పగులఁ గ్రుద్దినాఁడు.

చల—కామపాలుఁడు తల పగులఁగొట్టినాఁడు.

నారా—వసుకాముఁడు ముక్కుమీఁద గ్రుద్దినాఁడు.

విజ—మీ రాడు మాట లొకదానితో నొకటి సంబంధించకున్నది. దామోదరవర్మగారి కపాయకరమైన గాయముఁ దగిలినదఁటారా?

చల—ఆమాట నిశ్చయము.

నారా—అవును. గాయము తగిలినమాట వాస్తవమే.

విజ—ఆయన కేవిధమైన గాయమును తగులలేదు. అదిగో! ఆయనయే వచ్చుచున్నాఁడు.

(దామోదరవర్మ ప్రవేశించుచున్నాఁడు)

దామోదరవర్మా! నీవు సమయమునకు వచ్చినావు.

చల—(నారాయణవర్మతో రహస్యముగా) దామోదరవర్మ చనిపోయి దయ్యమైవచ్చినట్లున్నది.

అన్న—పద్మావతిమీఁది యాస వదలక దయ్యమై మనలనుఁ బీడించుకొనితినుటకు వచ్చినాఁడు.

నారా—ఈముసలివాఁడు చచ్చికూడ మనలను వదలకున్నాఁడు

విజ—దామోదరా! తలపగులఁగొట్టఁబడి యింతత్వరలో నీవెట్లిక్కడికి రాఁగలిగితివి?

దామో—నాతల పగులఁగొట్టఁబడినదా? (అని తలఁ దడవి చూచుకొనుచున్నాఁడు)

విజ—వీరు నీకపాయకరమగు గాయము తగిలిన దనియు నీవు జీవించుట కష్టమనియుఁ జింతించుచున్నారు. నీవేగాయమును లేక యిక్కడికి వచ్చినావు. నాకు మిక్కిలి సంతోషముగానున్నది.

దామో—(తనలో) ఆసంగతంతయు నూరంపటికే నప్పుడే తెలిసినట్లున్నది.

నారా—మీకింతవయసు వచ్చినతరువాత మీరు తిరిగి వివాహ మాడుటతప్పే.

దామో—ఆసంగతి మీకెందుకు!

అన్న—దామోదరవర్మగారికిఁ బద్మావతియందుఁగల ప్రేమ కామె యట్లు సంచరించుటతగదు.

చల—అయినకార్యమేమో అయినది. మీరిది మనసులోఁ బెట్టుకొనవలయునే గాని పద్మావతిని దండించి యల్లరి చేసికొనఁగూడదు.

దామో—మీహితోపదేశము నాకక్కఱలేదు. నాసంగతి మీకెందుకు.



నారా—తుదకు మీవివాహసౌఖ్య మిట్లు పరిణమించిన దనినాకు విచారముగానున్నది.

దామో—నావివాహసౌఖ్యమును, సంసారస్థితియు మీకెందుకు. నోరుమూసికొని పొండి.

అన్న—అవును. నాకాసంగతి యక్కఱలేదు. నేనీసంగతియెవరితోనుఁ జెప్పను.

(అని వెళ్ళిపోవుచున్నది.)

నారా—పద్మావతి మీయెడల నింతకృతఘ్నతగా నుండఁగూడదు.

(అని వెళ్ళుచున్నాఁడు)

చల—ఇంతపని జరిగినప్పటికి మీశాంతము చూచిన మిక్కిలి ఆశ్చర్యముగానున్నది.

దామో—స్నేహితులమని పేరుఁబెట్టుకొని మంచిచెడ్డ లాలోచింపక ఆఁడుదానిమాటాడు నీదుర్మార్గుని నమ్మరాదు.

విజ—వీరు యుక్తాయుక్తముల నాలోచింపక నోటికి వచ్చినట్లెల్లఁ బ్రేలుచున్నారు.

(వీరభద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వీర—దామోదరవర్మగారు! మీరు బిగ్గరగా మాట్లాడుచుండుటఁ జూడగా కోపపడునట్లగపించుచున్నది.

దామో—ఆసంగతి నీకెందుకు. ముసలివాఁడను నాదారిని నన్నుఁ బోనియ్యకుండ నందఱు నాయాసపెట్టుచున్నారు.

వీర—కోపపడకండి, మీక్షేమము గోరినవాఁడను గనుక అలాగడిగినాను.

విజ—దామోదరా! నేను నీతోఁ జెప్పినట్లు మాయన్న కోమాళ్ళ స్వభావమును బరిశీలించినాఁడను.

దామో—వారి స్వభావములు నీవు నాతో వేఱే చెప్పనక్కఱలేదు.

వీర—విజయవర్మగారుఁ గూడఁ దమతో నేకీభవించి కామపాలుఁడే యోగ్యుడని యొప్పుకొన్నారు.

విజ—అవును. కామపాలుని యోగ్యత చెప్పశక్యముఁగాదు.

వీర—అతను పరమయోగ్యుఁడని దామోదరవర్మగారు దివఱకుఁ జెప్పనే చెప్పినారు.

విజ—కామపాలుఁడు తనయోగ్యతను నిముసములో బయలుపఱచినాఁడు.

వీర—అతను మాటలాడునప్పుడు నీతులు గురియుచుండును.

విజ—దామోదరా! నీవు మాటాడవేమి?

దామో—విజయవర్మా! ఈప్రపంచము మంచిది కాదు. మనమెవ్వరిని మంచివాఁడని నమ్మఁగూడదు.

వీర—ఏమి? తమరాలాగిలవిచ్చుచున్నారు.

దామో—నన్ను మీరాక్షేపించవద్దు. సంగతంతయు మీకుఁ దెలిసినట్లున్నది.

వీర—మాకంతయుఁ దెలిసినసంగతి నిజమే. కామపాలునింటనుండి వచ్చుచుండగాఁ బద్మావతిని జూచినాను. ఆమె తానునిర్దోషిణినని తమతోఁ జెప్పుమన్నది.

దామో—విజయవర్మకుఁ గూడ నిదంతయుఁ దెలిసినదా?

విజ—నాకీసంగతంతయుఁ దెలిసినది.

దామో—బీరువాచాటునఁ బద్మావతియు, పెట్టెలోఁ గూర్చుని నేనును దాఁగికొనియున్న సంగతియు నీకుఁ దెలిసినదా?

విజ—నీభార్యపూజారివారిపిల్ల యనిచెప్పి నిన్నెట్లు నమ్మించెనోగద!

దామో—ఆసంగతి బహుచమత్కారముగా జరగినది.

విజ—నాకిది తలఁచుకొనిన నవ్వువచ్చుచున్నది.

దామో—ఇది బహుచమత్కారముగానే జరగినది.

వీర—నేఁటికిఁ గామపాలుని యోగ్యతబయలుపడినది.

దామో—వానియోగ్యత చెప్పనక్కఱలేదు. వాఁడు పరమనీచుఁడు, దుర్మార్గుడు, మిత్రద్రోహి.

విజ—అయితే; ఆదుర్మార్గుఁడు వసుకాముఁడు నిన్నుఁ బెట్టెలోనుండి యీవలకు లాగినాఁడుగా?



దామో—ఆసంగతి నేనేమనిచెప్పను.

విజ—పద్మావతిని బీరువాచాటుననుండి యీవలకుఁ దీసికొని వచ్చినప్పుడు నీమొగ మెట్లున్నది.

దామో—ఆవిషయము నన్నేమని యడిగెదవు.

విజ—ఈసంగతి దలఁచుకొన్న నవ్వుపుట్టుచున్నది. కాని నిన్నుఁజూచిన నాకు మిక్కిలి విచారముగానున్నది.

వీర—అదిగో! పద్మావతివచ్చుచున్నది. ఆమెను మాత్రము మీరపరాధినిగా నెంచఁగూడదు.

విజ—నీవిక్కడ నుండుటఁ జూచి యామె పెరటిత్రోవను లోనికిఁబోవుచున్నది. నేనిప్పుడు వెళ్ళెదను. నీవును వీరభద్రుఁడును గలసి పద్మావతి నూఱడించి కామపాలునింట నన్నుఁ గలసికొనుఁడు. నేనిప్పుడే కామపాలునింటికి వెళ్ళి యతని స్వభావమున్ను దెలిసికొంటినని చెప్పెదను.

దామో—ఆలాగుననే వచ్చెదను.

వీర—నేనుఁగూడ దామోదరవర్మగారితో వచ్చెదను.

(విజయవర్మ వెళ్ళుచున్నాఁడు.)

దామో—వీరభద్రా! చూచినావా! పద్మావతి యెట్టుసిగ్గుపడి నేనుబిలిచినను రాకున్నదో.

వీర—మీరామెపైఁ గోపముంచగూఁడదు.

దామో—ఏమిచేయుటకును నాకు దోఁచకున్నది. అది వసుకామునికేర వ్రాసినయుత్తరము నీకిదివఱకే చూపించినాను.

వీర—ఆయుత్తరము పద్మావతి వ్రాసినది కాదు. పద్మావతికిని దమకును గలహముఁగల్పించితమకార్యము కొనసాగించుకొనఁదలఁచి కొందఱు దుర్మార్గులువ్రాసిరి. ఈవిషయమును గూర్చి కరటకాచార్యులుఁ దమతో స్వయముగాఁ జెప్పును.

దామో—నాకీయనుమానముఁ దీఱినయెడల నామనోవ్యాధియంతయుఁ దీఱు

ను. అదిగో! అది యీలాగునవచ్చుచున్నది. నేను దానితో మాట్లాడెదను.

వీర—ముఖ్యముగా మాట్లాడండి. బిగ్గరగా మాటలాడి యామెనుమాత్రము దూషించవద్దు.

దామో—మేమిద్దఱము వివాదపడక సఖ్యముగాఁ గాపురము చేయుచుండిన యెడల జనులు నవ్వకమానరు.

వీర—ఇతరులు నవ్వితే మీకేమి చెడిపోయినది. మీరు సుఖపడుటయే మాకుఁ గావలసినది.

దామో—నీవు చెప్పినట్లాలాగుననే చేసెదను. మే మిఁకఁ జక్కఁగాఁ గాపురము చేసి సుఖపడవచ్చును.

వీర—అనుమాన మెక్కడలేని సౌఖ్యభంగమునుఁ గలిగించును. మీయనుమానముఁ దీఱిననాటనుండియు మీరు భూలోకస్వర్గసుఖ మనుభవించుచుఁ గాఁపురము చేయవచ్చును.

దామో—వీరభద్రా! కామపాలునిమాటలు విని నేనిదివఱకు మోసపోయినది చాలును. ఇఁక నేనెన్నఁడు నిట్లు మోసపోను.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

## తృతీయరంగము.

రంగము:—కామపాలునింట నొకచావడి.

(కామపాలుఁడును సుభద్రయుఁ బ్రవేశించుచున్నారు)

సుభ—దామోదరవర్మకు దీనితో వసుకామునియం దిష్టముకుదిరి గౌరవము హెచ్చుకమానదు. ఇఁక జానకి నాతఁడు వివాహమాడుట కయిష్టపడక తానే స్వయముగా జానకి నాతనికిచ్చి వివాహముచేయును. సరే! మన ప్రయత్నములన్నియు నిప్పటికీవిధముగా ఫలించినవి. ఈమాట దలఁచికొనిన నావిచార మింతింతని చెప్పనలవికాదు.

కామ—ఇది జరగకుండ నేదైన మనమొకయుపాయ మాలోచించవలెను.

సుభ—మన మిదివఱకుఁ జేసినప్రయత్నము లన్నియు నీవిధముగాఁ బరిణమించుచున్నవి. ఇంక నాకేయుపాయమును దోఁచుటలేదు. నీవంటిబుద్ధిహీనునితోఁ గలిసి యీప్రయత్నము లన్నియుఁ జేయుట నాదేతప్పు.



కామ—సుభద్రా! నీవు నన్నేల దూషించెదవు. జానకిని వసుకాముఁడు వివాహమాడినచో నాకాశాభంగము గలుగును. నామనోవ్యాకులము నీకేమి తెలియును. నేనీకార్యభంగము నెట్లుసహించుచున్నాఁడనో నీవెఱుఁగవా?

సుభ—నీకు జానకియందు నిజమైనయనురాగము లేదు. ఆమె ధనముఁజూచి ద్రవ్యమునకై యామెను వివాహమాడఁదలఁచితివికావున నీమనోభీష్టము చెడిపోయినదని నీకంతవిచారములేదు. వసుకామునియందు నాకుఁ గలయనురాగములో శతాంశమైన నీకు జానకియందున్నచో నీవిట్లుండవు.

కామ—సుభద్రా! నామనోరథము చెడిపోయినదని నన్ను నీవేలదూషించెదవు.

సుభ—దీనికి నీవేకారణము. దామోదరవర్మను మోసముచేసి నీవాయనచే యోగ్యుఁడ వనిపించుకొని జానకి నెట్లయిన వివాహమాడఁ బ్రయత్నించవలయునుగాని నీవాయనభార్యను స్వాధీనముచేసికొనవలె ననియేల ప్రయత్నించవలెను. నీమనోరథ మీడేర్చు చక్కనిమార్గము వదలి నీవేలఁ వంకరమార్గములఁ బ్రవర్తించవలెను. నీదుర్బుద్ధియే నిన్నిట్లు పాడుచేసినది.

కామ—అవును. నేను జేసినది తప్పనుటకు సందేహములేదు. పద్మావతిని వశపఱచుకొని నామనోభీష్టము మఱింతసులభముగా నీడేర్చుకొనఁదలఁచిన నీకార్యము మొదలంటఁ జెడిపోయినది. నీవుమాత్రము కార్యభంగము చేయలేదా?

సుభ—నేనెంతమాత్రముఁ జేయలేదు. నేను బహుజాగరూకతతో సంచరించుచున్నాను.

కామ—కరటకాచార్యుఁడు విశ్వాసపాత్రుఁడు గాఁడనియు, నీ వంతగా నమ్మి మనరహస్యము లతనితోఁ జెప్పుటుచితముగాదనియు నీతో నేనెన్నివిధములఁ జెప్పినను వినక యింకను నాతఁడు విశ్వాసపాత్రుఁడనియే తలఁచుచున్నావుగదా.

సుభ—అతఁడు విశ్వాసపాత్రుఁ డనుటకు సందియములేదు.

కామ—నీవు వసుకాముని మోహించి నీవాతని వివాహమాడఁ దలఁచితి వని యాతనికిఁ దెలియును.

సుభ—అతని కీరహస్యము దెలియుటవలన నేమియు భయములేదు.

కామ—మించినకార్యమునకు విచారింపఁబనిలేదు. మనప్రయత్నలోపము లేకుండ నింకను పనిచేయవలెను.

(తలుపుచప్పుడు వినిపించుచున్నది)

అదిగో మాపినతండ్రి విజయవర్మగారు వచ్చుచున్నట్లున్నారు. నీగదిలోఁ గూర్చుండుము. ఆయనవెళ్ళినతరువాత మనమీసంగతినిగూర్చి యాలోచింతము.

సుభ—ఒకవేళ విజయవర్మ కీసంగతంతయుఁ దెలసినచో నేమిచేతువు.?

కామ—నీకాసందేహ మక్కఱలేదు. దామోదరవర్మ యెన్నఁటికిని సిగ్గుమాలి యీవృత్తాంతము చెప్పఁడు. నీకాభయ మక్కఱలేదు. ఒక్కమాటలో విజయవర్మను మోసముచేసి నేను పరమయోగ్యుఁడనని యాతఁడనుకొనునట్లు చేయఁగలను.

సుభ—నీశక్తియంతయు నేనెఱుఁగుదును. నీవేమిచేసినను బహు జాగరూకతతో మాత్రము చేయవలెను.

కామ—ఆలాగుననే చేసెదను.

(సుభద్రమ్మ వెళ్ళుచున్నది)

నామనోరథము చెడిపోయినదని నేనువిచారించుచుఁ బడరానిపాట్లు బడుచుండఁ గార్యభంగము చేసితివని సుభద్రగూడ నన్ను దూషించుచున్నది. నేను వసుకామునికన్న యోగ్యుఁడ నని యూరందఱుఁ జెప్పుకొనుచున్నారు. నాకిందుమూలముననయినఁ గొంతలాభము గలుగకపోదు. ఇదిగో! పురుషోత్తమరావు నన్నుఁ బీడించుకొని తినుటకుఁ దిరిగివచ్చినాఁడు. విజయవర్మయని తలుపుతీసితినిగాని యాతఁడని తెలిసినచో నెంతేయఱచి తలుపు బద్దలుకొట్టినను మాటలాడకపోదును.



(విజయవర్మ ప్రవేశించుచున్నాఁడు)

పురుషోత్తమరావూ! ఇప్పుడు నామనసంతయుఁ జెడిపోయియున్నది నీతో మాటలాడుటకు వీలులేదు. నేను నీకిప్పు డేవిధమయిన సహాయమును జేయఁజాలను.

విజ—మీపినతండ్రి విజయవర్మగారికడకు వత్తురని విని యాయన నేమైన నడుగుటకు వచ్చినాఁడను.

కామ—ఇప్పుడు సమయముగాదు; వెళ్ళిపో, మఱియొకపర్యాయము రావచ్చును నేనుగూడ నీకేమయిన సహాయముఁ జేయుమని విజయవర్మగారితోఁ జెప్పెదనులే; వెళ్ళిపో.

విజ—నేను విజయవర్మగారి దర్శనము చేసి వెళ్ళిపోయెదను.

కామ—ఆలాగున పనికిరాదు. తక్షణము వెళ్ళిపో.

విజ—విజయవర్మగారి దర్శనము చేసినతరువాత నొకనిమిసము వుండను.

కామ—పొమ్మంటె నీవింకాపోవేమి? రాముఁడూ! ఇతని నావలకు గెంటివేయుము. ఏమండీ! ఇప్పుడు సమయముగాదంటే మర్యాదగా వెళ్ళిపోరేమి?

(వసుకాముఁడు ప్రవేశించుచున్నాఁడు)

వసు—అన్నగారూ! ఏమో కోపపడుచున్నారెందుకు. పాపము అప్పన్న యేమిచేసినాఁడు. అతనిమీఁద మీరు కోపపడకండి. ఏమోయీ! అప్పన్నా నీవేమిచేసినావు.

కామ—సరే. ఇతఁడు నీదగ్గఱకుఁ గూడ ముష్టికి వచ్చినాఁడా?

వసు—ఇతను నాదగ్గఱకు వచ్చినాఁడు. ఇతను బహు మంచివాఁడు. అన్నగారూ! తమరుగూడ నీతనిదగ్గఱ బదులుపుచ్చుకొనుట లేదుగద.

కామ—నేనెన్నఁడును బదులు పుచ్చుకొనను. విజయవర్మగారిప్పుడే యిక్కడకు వచ్చెదనని కబురుపంపించినారు సుమా.

వసు—ఆలాగైతే యితని నాయన జూడఁగూడదు. ఋణములు చేయుచున్నావాయని కోపగించును.

కామ—నేనెన్నివిధములఁ జెప్పినను యీపురుషోత్తమరావు వెళ్ళకున్నాఁడు.

వసు—పురుషోత్తమరా వంటావేమిటి? ఇతనిపేరు అప్పన్న

కామ—కాదు. కాదు. ఇతనిపేరు పురుషోత్తమరావే.

వసు—నామాట నమ్ము; యితనిపేరు అప్పన్న.

కామ—అతనిపే రేమైతే మనకెందుకు.

వసు—అవును. మనకక్కఱలేదు. అతని యిష్టమువచ్చినన్ని పేర్లు పెట్టుకోవను. రోజుకొకపేరు పెట్టుకొనినను నాకక్కఱలేదు.

(తలుపెవరో గ్రుద్దుచున్నారు)

కామ—అదిగో! విజయవర్మగారు. పురుషోత్తమరావూ! నీపుణ్యాము వెళ్ళిపో. నీమాట మాకక్కఱలేదు. త్వరగా వెళ్ళుతావా లేదా?

వసు—అతనిఁ ద్వరగా నావలికిఁ బంపివేయుము.

విజ—మీయింటికివచ్చిన పెద్దమనిషి నిట్లు గెంటుట న్యాయముకాదు.

కామ—నీకు బుద్ధిలేకపోతే యేమిచెయ్యమన్నావు?

వసు—త్వరగాపో.

(అని యిద్దఱును విజయవర్మను గెంటుచున్నారు)

(దామోదరవర్మయుఁ, బద్మావతియు, జానకియు, వీరభద్రుఁడును ప్రవేశించుచున్నారు)

దామో—విజయవర్మా! నీకు మంచిగౌరవము జరుగుచున్నది. చిరకాలమునకు నీయన్నకొమాళ్ళను జూడఁగోరి నీవిక్కడికి వచ్చినందులకుఁ బ్రథమదర్శనములోనే వీరిద్దఱు నిన్ను గొంతుకు పిసికి చంపఁ బ్రయత్నించుచున్నట్లున్నారు.

పద్మా—మేము సమయమునకు రాకపోయినయెడల వీరిద్దఱును గలసి మిమ్మేమిచేసియుందురోగద.

వీర—అదృష్టవశముచేత సమయమునకు వచ్చినాము. విజయవర్మగారూ! మీరిబంధువు పురుషోత్తమరావు నని మీరుచెప్పినను మీకీపాట్లు దప్పినవికావు.



విజ—బంధువైన పురుషోత్తమరావుపేరును, ఋణమిప్పించి యుపకారముచేసిన యప్పన్నపేరును గూడ నిక్కడ పనికివచ్చినవికావు. పురుషోత్తమరావు నని చెప్పి యీమహానుభావుని దగ్గఱ నొక్క చిల్లిగవ్వైనను సహాయము పొందనేరనైతిని. ఋణమిచ్చిన యప్పన్న ననియైన సందేహించక యితను నన్ను గెంటవచ్చినాఁడు. వీరిరువురును గలసి నన్నీవిధముగా గౌరవించుచున్నారు.

కామ—వసుకామా!

వసు—కామపాలా!

కామ—దీనితో మనయోగ్యతంతయుఁ దెలిసినది.

వసు—మనయోగ్యత బహుచక్కఁగఁ దెలిసినది.

విజ—దామోదరవర్మగారూ! వీరభద్రా! ఈకామపాలునిసంగతి వినండి. ఇతనికి నిదివఱకు నేనెంతద్రవ్యమిచ్చితినో యింకను నెంతద్రవ్యమియ్యఁదలఁచి యుంటినో మీకే తెలిసియున్నది. వీనియందుఁ గృతజ్ఞతయు, విశ్వాసమును, సత్యస్వభావమును లవలేశమైన నెంతవెదకినను లేవు.

దామో—విజయవర్మా! నాకీతనిమిత్రద్రోహమును, గుచోద్యవ్యాపారమును నిన్ననే తెలిసినవి.

పద్మా—ఇతఁడుపరమ నీచుఁ డనియు, దుర్మార్గుఁడనియు నేను దైవసాక్షిగాఁ జెప్పఁగలను.

దామో—ఇతనియోగ్యత మనకందఱకుఁ జక్కఁగాఁ దెలిసినది. మనవలె నితరులు గూడ నీతఁడు యోగ్యుఁడనినమ్మి మోసపోకుందురుగాక.

వసు—(తనలో) ఇప్పటివఱకును యోగ్యుఁడని కొనియాడఁబడిన కామపాలుఁడే యిట్లు దూషించుచుండ నన్నేమనెదరోగద.

(దామోదరవర్మయుఁ, బద్మావతియు, జానకియుఁ గొంచెమావలికి వెళ్ళుచున్నారు.)

విజ—ధనమంతయుఁ బాడుచేసినగౌరవముఁ జెలిమకొన్న వసుకాముఁడు.—

వసు—(తనలో) ఇప్పుడు నాసంగతిగూడవచ్చుచున్నది. నేనమ్మిన మాపెద్దల చిత్రపటములును, బాహుదేవతార్చన సామగ్రియు నాకొంప దీయును గాఁబోలు.

కామ—విజయవర్మగారూ! ఒక్కమాటచెప్పెదను. దయచేసివినండి.

వసు—(తనలో) ఇతనుమాటలాడునప్పుడు కొంచెముధైర్యము దెచ్చుకొనెనను.

విజ—నీయోగ్యతంతయుఁ జెప్పెదవు.

కామ—ఏదోనాకుఁ దోఁచినది చెప్పెదను. ఒక్కమాట వినండి. తరువాత నావిషయమై మీచిత్తమువచ్చినట్లనుకొనవచ్చును.

విజ—(వసుకామునితోఁ) నీవుగూడ యోగ్యతవిషయమై యొకమాట చెప్పెదవా యేమి?

వసు—నాకు యోగ్యతలేదని నేనెఱిఁగియు మీతో నేనేమిచెప్పను. దయయుంచి నన్నుక్షమింప మిమ్ము వేఁడుకొనుచున్నాను.

వీర—విజయవర్మగారూ! వసుకాముని యవ్యక్తప్రవర్తనకు మీరాతనిపయిఁ గోపపడఁ గూడదు. క్షమింపుమని మిమ్మాతఁడు గోరుచున్నాఁడు గావున మీరాతని క్షమించుటుచితము.

విజ—నిన్నుక్షమించుటకు నీవుచేసినతప్పొకటి కాదు. విశేషమగు ఖ్యాతివడసి మనవంశమునకు వన్నెవెట్టిన పెద్దలచిత్రపటములును పెద్దలార్జించిన దేవతార్చనసామగ్రియు నొకనిముసములోఁ గొంచెమైన నాలోచించక చిత్తుకాగితములవలె నమ్మివేసిన యీమహానుభావుని దామోదరవర్మగారూ! చూచినారా?

వసు—విజయవర్మగారూ! నేను చేసిన యపరాధము క్షమించవలెను. నాసహాయముఁ గోరిన యొకబీదబంధువున కేమైన నియ్యవలయుననుతలంపుతో నేనాచిత్రపటములను దేవతార్చనసామగ్రియు నమ్మినాఁడను. ఉపకారబుద్ధితో వేగిరపడి నేను చేసినపనికి నాఁటనుండియు నేను పడుచున్నపశ్చాత్తాప మింతింతని చెప్పఁజాలను. నాకు మహోపకారములను శతసహస్ర



ములుగా నొనరించినన్నుఁ గంటికిరెప్పవలెఁ గాపాడుచున్న మీరే నాయపరాధము మన్నించకున్న నాకెవ్వరుదిక్కు— ? నాతప్పులన్నియు క్షమింపుఁడు.

(అని విజయవర్మ పాదములపైఁ బడుచున్నాఁడు.)

విజ—(వసుకాముని లేవనెత్తి) నీవెన్నిచిత్రపటము లమ్మినను నాపట మమ్మఁజాలక నాయందగపఱచిన విశ్వాసమే చాలును. నిన్నుక్షమించినాఁడను.

వసు—నన్ను మీరిప్పుడు క్షమించి నాకొసఁగినయాదరణమునకు నేనుమీ ఋణమెట్లు దీర్చికొనఁగలుగుదునో నాకుఁ దోఁచకున్నది.

శుద్ధా—విజయవర్మగారూ! వసుకాముని మీరేమందురోయని జానకి తల్లడిల్లుచున్నది.

విజ—జానకీ! నీవు వసుకామునిఁ బ్రేమించి యాతని వివాహమాడఁగోరియున్నావని నేనిదివఱకే విన్నాను.

దామో—అమ్మాయీ! నీయభిప్రాయము దాఁచక చెప్పు.

జానకి—నేనేమి చెప్పుదు. వసుకాముని నేరములన్నియు క్షమించి యాతఁడు సుఖముగాఁ గాలముగడపునట్లు విజయవర్మగారు చేయుటయే నాకుఁ గావలసినది. నేనిదివఱకతని వివాహమాడవలయునని యుద్దేశించుకొనియున్నదానను గాని యిప్పుడు నేనాతని వివాహమాడఁజాలను.

దామో—అమ్మాయీ! ఏమి; యీవెఱ్ఱితనము. ధనమంతయుఁ బోఁగొట్టుకొని యయోగ్యుఁడని మేమందఱుఁ మెన్నిచెప్పుచుండినను అతనినేగాని వివాహమాడనని నిశ్చయించుకొని యిప్పుడు విజయవర్మగారి యనుగ్రహము వలన వసుకాముఁడు మంచిస్థితికి రానున్నసమయమున నాతని వివాహమాడననుచున్నావేమి?

జాన—అందుకుఁ గారణ మాయన హృదయమునకును సుభద్రమ్మ హృదయమునకును దెలియును.

వసు—(ఆశ్చర్యముతో) నాకును సుభద్రమ్మకునా!

కామ—వసుకామా! నీవీరోజు వఱకును సుభద్రమ్మను వివాహమాడెదనని యామెను నమ్మించి, నీవామె నీరీతిని మోసపుచ్చుట న్యాయముగాదు. ఇదిగో, సుభద్రమ్మ యిక్కడనేయున్నది.

(అనిగదితలుపు దెఱచుచున్నాఁడు.)

(సుభద్రమ్మప్రవేశించుచున్నది.)

దామో—ఇది బహువింతగానున్నది. వీఁడొక్కొకగదిలో నొక్కొకచిన్నదానిని దాఁచుచున్నట్లున్నాఁడు. ఈవిడగూడఁ బూజారివారిపిల్లయేనా?

సుభ—విశ్వాసహీనుఁడా! నన్ను నమ్మించి వివాహమాడెద నని చెప్పి నన్నీవిధముగా మోసపుచ్చి వంచింపఁదలఁచితివా?

వసు—విజయవర్మగారూ! ఈసంగతి యేమో నాకు బోధపడకున్నది. నాకీమాటలకర్థము తెలియలేదు.

కామ—అవును. నీకీమాటలకర్థము తెలియనే తెలియదు. ఇతనుసుభద్రమ్మను వివాహమాడెదనని చెప్పి యెట్లామెను నమ్మించెనో కరటకాచార్యునివలన మీకె తెలియును.

దామో—వీరభద్రా! నీవు కరటకాచార్యునిఁగూడఁ మనతోఁ దీసికొనివచ్చుటవలన మంచిపనియే చేసినావు.

వీర—కరటకాచారీ! ఇటురా.

(కరటకాచారి ప్రవేశించుచున్నాఁడు.)

కరటకాచారిసాక్ష్యము గావలసివచ్చునని నేనిదివఱకేయూహించియున్నాను. అతనికీసంగతంతయుఁ దెలియునని మీరే చెప్పుచున్నారు గనుక సుభద్రమ్మ చెప్పుమాట కేవలము అబద్ధమని యొప్పుకొనుట కిదిగో కరటకాచారివచ్చుచున్నాఁడు.

సుభ—విశ్వాసహీనుఁడా! కృతఘ్నుఁడా! నీవుగూడ తుదకు నాకపకారము దలఁచినావా? నేఁటికి నావిరోధులతోఁ జేరినావుగద.



కర—సుభద్రమ్మగారూ! నన్నేమి చెయ్యమన్నారు. మీరు నాచేతఁ జేయించిన యకార్యములకిచ్చిన ప్రతిఫలముకన్న వాస్తవముచెప్పుటకు వీరు నాలుగింతలు సొమ్మెక్కువిచ్చినారు గనుక నిజమంతయుఁ జెప్పినాను.

దామో—తుదకీమె యొరులనుమోసపుచ్చఁదలఁచి తానే మోసపోయినది. సుభద్రమ్మగారూ! మీకీవిషయములోఁ జాలశ్రమపడినారు సుమండీ.

సుభ—మీరందఱు నేకమై యీఁడుదానిని నన్నొకతెను బాధించుచున్నారు. మీయన్యాయము సహింపఁజాలను. ఇంతపనిఁజేయసాహసించినమీరే కార్యమునైనఁ జేయఁగలరు.

(అనికోపముతో వెళ్ళబోవుచున్నది)

పద్మా—సుభద్రమ్మగారూ! కొంచెము కూర్చుండండి. పాపము మీరెంతో శ్రమపడి నాపేరుఁబెట్టి నేనువ్రాసినట్టు వసుకామున కుత్తరములు వ్రాసి తిరిగి వసుకాముఁడు బదులువ్రాసినట్లా తనిపేరుపెట్టించి యుత్తరములు వ్రాయించి తాము పడినశ్రమకు మిక్కిలి సంతోషించినాను. మీరేమో స్నేహితులని మోసపోయినాతోఁ గలసి పరులనుగూర్చి యపవాదలాడు దురభ్యాసముగూడ గణించి తుదకు మీచే వంచితురాలనయి నాకాపురముఁ జెడఁగొట్టుకొనుటకు సిద్ధమైతుదకు దైవానుగ్రహము వలన నొకరయొడ్డుచేరితిని. మీస్నేహితురాండ్రందఱకు నమస్కారము. నన్నింతటితో వదలిపెట్టి నేను మీస్నేహితురాల నని చెప్పకుండ నతివినయముగా మిమ్ముఁ బ్రార్థించుచున్నాను.

సుభ—సాటియాఁడుదాన ననికూడ శంకించక నన్నీదుర్మార్గులతోఁ గలసి దూషించుచున్నావు. ఈపాపమూరకపోదు.

(అని కోపముతో వెళ్ళిపోవుచున్నది.)

దామో—ఈమెకు సిగ్గును బిడియమును లేనట్లున్నది.

పద్మా—దీనిమాటలువినుటకే అసహ్యకరముగా నుండును.

దామో—(కామపాలునితో) నీవు చెప్పెదనన్నమాట యేమో యిప్పుడు

చెప్పవలెను.

కాదు—నేనేమి చెప్పను. నిజమాడవచ్చిన కరటకాచారిని సుభద్ర నిష్కారణముగా దూషించి వ్యవహారమంతయుఁ బాడుచేసినది. ఆమె ముక్కోపి. నేనేమి చెప్పుటకును నాకుఁ దోఁచకున్నది. ఇంత అన్యాయమున కొడికట్టిన నన్నొకక్కసిగాఁ జేసి బాధించఁదలఁచుకొనిన యీశత్రుమధ్యస్థమున నిఁక నుండరాదు.

(అని వెళ్ళిపోవుచున్నాఁడు.)

దామో—వీఁడిప్పటికిని తానుయోగ్యుఁడనని చెప్పును మనలదుర్మార్గులని దూషించుచున్నాఁడు.

విజ—కామపాలా! నీకును సుభద్రమ్మకును దగియున్నది. నీవామెను వివాహమాడినచో మీకిద్దరకుఁ దగియుండును.

వీర—కరటకాచారి చెప్పవలసినదంతయుఁ జెప్పినాఁడు. ఇఁక నాతఁడు వెళ్ళవచ్చును.

కర—సుభద్రమ్మగారును, కామపాలుఁడును నాకిచ్చిన ధనమున కాశించి చేయరాని కార్యములనెన్నియో జేసి దామోదరవర్మగారికిని పద్మావతికిని నేను చేసినయపకారములనెల్ల క్షమించవలెను.

దామో—మాకపకారములు చేసి మమ్మాయాసపెట్టినను దుదకు వాస్తవము చెప్పి మాకుపకారమే చేసినాఁడవు

కర—నేనిఁక నీయూరినుండి పాఱిపోయెదను.

దామో—నీవు పాఱిపోవలసిన యవసరము లేదు. నీవు తుదకు న్యాయముగనే ప్రవర్తించినావు.

కర—నాస్నేహితులును పోషకులును నందఱు దుర్మార్గులేగాని సన్మార్గులు గారు. నేనిట్టియకార్యములను జేసి యీయూర జీవించుచున్నాను. ఇప్పుడు మీతో వాస్తవముఁ జెప్పినా స్నేహితుల గౌరవమంతయుఁ బోఁగొట్టుకొన్నాను.



దామో—నీవు వాస్తవముఁ జెప్పితివని యితరులతోఁ జెప్పి నీగౌరవము చెఱచలేము. నీకాభయ మక్కఱలేదు.

(కరటకాచార్యులు వెళ్ళిపోవుచున్నాఁడు.)

పద్మా—విజయవర్మగారూ! ఇప్పుడు వాస్తవము జానకికిఁ దెలియనే తెలిసినది. వసుకాముఁడు సుభద్రమ్మను మోహించి యామెను వివాహమాడెద నని యామెతోఁ జెప్పినాఁడను ననుమానము జానకికిందుమూలముగాఁ బోయినది.

విజ—అలాగైనచో జానకిని వసుకామునకు రేపే వివాహము చేయవచ్చును.

వసు—విజయవర్మగారూ!—తమయనుగ్రహమునకు నేను మిక్కిలిఁ గృతజ్ఞుఁడనై తమ కనేకవందనములు చేయుచున్నాను.

దామో—ఇది బహువింతగానున్నది. జానకి యభిప్రాయముఁ దెలిసికొనకయే వివాహము నిశ్చయపఱచి యిప్పుడే వివాహమైన ట్లానందించుచున్నారు. పెద్దవాఁడనైన నా యభిప్రాయము గూడ మీకక్కఱలేదు గాఁబోలును.

వసు—దామోదరవర్మగారూ! జానకియభిప్రాయము నేనప్పుడే గనిపెట్టినాను. ఆమె నన్ను వివాహమాడ సమ్మతించినది. ఇప్పుడు మిమ్ముఁగూడ నడిగి మీయనుజ్ఞవడయుచున్నాఁడను.

జాన—సిగ్గుచేత నాయంతరంగమును వెల్లడిచేసి మీతోనేను వసుకాముని వివాహమాడెద నని చెప్పఁజాలకున్నాను. అన్యోన్యానురాగముగల మాయిరువురకు నొకరియంతరంగ మొకరి కప్పుడే తెలిసియుండుటచేఁబట్టి వసుకాముఁడు నాయంతరంగమును గనిపెట్టి మీతో నట్లుచెప్పినాఁడు.

విజ—జానకీ! అలాగునైనయెడల మీరిరువురును వివాహమాడి చిరకాలమన్యోన్యానురాగము గలిగి సుఖపడవలయును.

దామో—మీరిరువురను నేనును పద్మావతియు నిదివఱకు కన్యోన్యకల
హములతోఁ గాఁపురము చేయుచున్నట్లుగాక సుఖముగాఁ గాఁపుర
ము చేయవలయును.

వసు—వీరభద్రా! నీవు నాకుఁ జేసిన యుపకారము నేను మఱవఁజాల
ను సుమా.

విజ—నిశ్చయముగా వీరభద్రునకు నీవు కృతజ్ఞుఁడవయి యుండవ
లయును.

దామో—వీరభద్రుఁడు నాతో నెప్పుడుఁ జూచినను వసుకాముఁడు యో
గ్యుఁడనియు నతను ఋజుమార్గమునఁ బ్రవర్తించుననియు వాదిం
చి వాస్తవమునే చెప్పినాఁడు.

వసు—నేనిఁక నెన్నఁడును దుష్టుల సాంగత్యముఁ జేయక సన్మార్గ
మునఁ బ్రవర్తించునట్లనుగ్రహింప నీశ్వరుని బ్రార్థించుచు మీ
కందఱకుఁ గృతజ్ఞతాపూర్వకవందనము లాదరించుచున్నాను.
జానకీ! నిన్ను నేను వివాహమాడఁగలుగుటకు వీరికి నాయందుఁగ
ల యనుగ్రహమే కారణమును మా. స్త్రీలు మాయావులు రనియుఁ
జంచలాత్మలనియు, భార్యకవులు నిందాస్పదముగా వర్ణించి చె
ప్పు మాటలు వాస్తవముగాదు. అతికఠినమగు పురుషుల యుల్లములఁ
గరఁగించి వారిని సన్మార్గమునఁ బ్రవర్తింపఁజేయఁ గలుగుటకు
స్త్రీలే సమర్థులు. కావున జానకిని వివాహమాడి నాప్రవర్తన
ముఁ జక్కఁబఱచుకొని యీశ్వరానుగ్రహమున సన్మార్గమును వద
లకుండెదను.

జాన—(తలవంచుకొని సిగ్గుచే నూరకున్నది.)

పద్మా—తమకార్యములను గొనసాగించుకొనఁదలఁచి న్యాయమార్గ
మును వదలి మోసవృత్తిచేఁ గుతంత్రములఁ బన్ని యితరులకు
హాని గలుగఁజేయు దుర్మార్గులను నమ్మఁగూడదు. తాము సత్పురుషు



లని కొనియాడఁగోరి లేనిపోని వేషములు వేయు వంచితులు చెప్పు
మాటలను నమ్మఁగూడదు. అంతశ్శుద్ధి యనునంతయు లేక దుష్కా
ర్యముల నాచరించుచు నీతులు బోధించువారు కూడ్రవ్యగములవం
టివారు. స్నేహితులమని పేరుపెట్టుకొని లేనిపోని మాటలాడి పరు
ల దూషించుచుఁ బాపపుణ్యమెఱుఁగని నన్నుఁగూడ మోసముచేసి
యనపరాధనైనను నేను దుర్మార్గురాలనని యితరులతోఁ జెప్పి నా
కాఁపురముఁ జెడఁగొట్టఁ బ్రయత్నించిన యీపరమనీచుల నేమన
వలయును! నేను నిరపరాధురాలనగుటఁబట్టి దైవము నాయందు
నుగ్రహించి వాస్తవముఁ దెలిపినాఁడు. వారు చేసిన దుష్ప్రయ
త్నములవలన నాకపకారము జరుగుటకు మాఱుగా సుపకారమే
జరిగినది. జనులయంతరంగము గనిపెట్టుట దుర్ఘటము. పైపైవ
న్నెలును నీతివచనములును జూచి సాధారణముగా జనులు మోస
పోయి దుష్టులనుగూడ సత్పురుషులనుగా గణింతురు. జనానులాప
ములు వాస్తవమని నమ్మరాదు. స్నేహితులమని యనపరాధలమగు
నాకును జానకికిని వీరు సేయఁదలఁచిన యపకారము కొనసాగిన
చో మేమిరువురము మేమికావలసినదో గద! ఒరుల నేరములను వి
నుటయందు జనులకుఁగలయాసక్తియు నుత్సాహమును వారిఖ్యాతి
వినుటయందుఁ గానరాదు. అపవాదములాడు మానవాధములు త
మ యప్రస్తుతప్రలాపములవలన జనులకుఁ జేయునష్టమును గుర్తె
ఱిఁగి న్యాయప్రవర్తకులయి ప్రవర్తింప జగదీశ్వరుఁ డనుగ్ర
హించును గాక. జానకియు వసుకాముఁడు నన్యోన్యానురాగమునఁ
జిరకాలము సుఖ మనుభవింతురుగాక.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)




సమాప్తము.

